# ఫారెక్స్®
# తల్లుల మొదటి ఎంపిక!



## తన పాపాయికి ప్రేమతో తినిపించి పెంచే ప్రతి తల్లికీ తెలుసు: పాపాయి పెరుగుదలకై ఘన ఆహారాలను ప్రారంభించేటపుడు మొట్టమొదటి ఎంపిక ఇదే-ఫారెక్స్®.

ఎందుకంటే, మేలుపర్చబడిన ఫారెక్స్‌లో ముద్దుల పాపాయి పెరుగుదలకై అవసరమైన పోషణ పదార్థాలు సరియైన పాళ్లలో కలవు.

- ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు అవసరమైనట్లు సరియైన పరిమాణంలో ప్రొటీన్లు; సున్నిత జీర్ణశక్తికి అనువుగా క్రొవ్వు పదార్థాలు కలవు.
- పుట్టిన నాలుగు నెలలకు, పాపాయికి తల్లి నుండి లభించిన ఐరన్ నిల్వ తగ్గిపోతుంది. పాపాయి రక్త-పుష్టికై ఫారెక్స్‌లో తగినంత ఐరన్ కలదు.
- దృఢమైన ఎముకలు, గట్టి పళ్లకోసం ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు ఉత్తమ 2:1 నిష్పత్తిలో కాల్షియం, ఫాస్ఫరస్ కలవు.
- ఫారెక్స్‌లో పాపాయి బాగా ఇష్టపడి తినే రుచి కలదు.
- దీనిని కలపడం, తినిపించడం సులభం.




పాలు చేర్చే అవసరం లేదు. కేవలం నీళ్లలో కలిపి ఇస్తే చాలు

**ఫారెక్స్-శ్రేష్ఠమైన ఘన ఆహారం**
**తల్లి ప్రేమకు ప్రతిబింబం**



వనితల వ్యక్తిత్వానికి
నిండుదనం చేకూర్చే....
సరిత
పోలియెస్టర్ శారీస్
SARITA®
FABRICS
100% POLYESTER SAREES
అన్ని షాపులలోనూ లభించును
తయారు చేయువారు: సరిత శారీ సెంటర్

# ప్రభుత్వంలో వ్యాపారవేత్తలు!

రాజీవ్‌గాంధి దేశంలో లేనప్పుడే ఏదో ఒకటి జరుగుతున్నది. జాతి వివక్షణని రూపుమాపే విషయంలో ఆఫ్రికా వారికి సహాయపడుతూ ఆయన హరారేలో, లేక అది టింబుక్టూనా?, ఉన్నప్పుడు సైనిక దళాల మాజీ ప్రధానాధికారి ఎ. ఎస్. వైద్య తీవ్రవాదుల తుపాకి గుళ్ళకి బలైపోయారు. ప్రకాశ్ సింగ్ సేఠీ ఒక బొంబాయి వారపత్రిక సంపాదకునితో అవాకులూ చవాకులూ పేలింది ఆయన ఆస్ట్రేలియాలో ఉన్నప్పుడు. లలిత్‌థాపర్ క్షమాపణ చెప్పి తప్పించుకున్నప్పుడాయన న్యూజిలాండ్‌లో ఉన్నారు. పాపం విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ మాత్రం ఇబ్బందులలో పడ్డారు. దానిని కప్పి పుచ్చుకోడానికి ఆయన ఏర్పాటుచేసిన పత్రికా సమావేశంలో వాళ్ళందరూ ఆయనని ఒక ఆట ఆడించి నవ్వుల పాలు చేశారు.

పన్ను ఎగవేసే వ్యాపారవేత్తలపై దాడుల విషయంలో ఆయన ఎంత ఉదారంగా ఉన్నది తెలిపే కథలని నేను ఎప్పుడూ నమ్మలేదు. ఈ దాడులలో తమకెలాంటి దురుద్దేశం లేదని, కక్ష సాధింపు అసలే కాదని శ్రీ సింగ్ ఒకసారి నాతో అన్నారు. వార్తా పత్రికలలో వాటి గురించి చదివేవరకూ అసలు వాటి విషయమే తమకి తెలియదని కూడా అన్నారాయన. శ్రీ సింగ్ గౌరవనీయులైన వ్యక్తి అయినప్పటికీ ఆయన మాటలని నేను నమ్మను. శ్రీ సింగ్ కూడా ఒక రాజకీయవేత్తననీ, ఆయన రాజకీయ పదవులలో ఇది మొట్ట మొదటిది కాదన్న సంగతి మనం మరచిపోకూడదు. వ్యాపారవేత్తలని వేధించటం అన్నది రాజకీయపుటెత్తులలో ఒకటి. అలాంటిదేమి లేదని శ్రీ సింగ్ చెప్పటం అసహజంగా ఉన్నది.

అసలు చిక్కు అంతా వ్యాపారవేత్తలతో రాజీవ్ ప్రభుత్వ యంత్రాంగానికి చాలా సాన్నిహిత్యం ఉండటం. నిజానికి రాజీవ్ మంత్రులలో కొంతమంది వ్యాపారవేత్తలే. ఆ సంస్కృతికి చెందినటువంటి వారే. డబ్బు చేసుకోవటం అన్న సంస్కృతి అది. వారిలో ఒకరు మాధవరావ్‌సింధియా. ఆయన ఒక్కరే కాదు ఇంకా కొందరు ఉన్నారు. సింధియా. బాంబేడయింగ్ అధినేత నస్లీవాడియా ఎంతో కాలంగా వ్యాపారంలో భాగస్వాములు. ఇప్పటికీ అలాగే కొనసాగుతున్నారు. నస్లీవాడియా కంపెనీలో సింధియా కుటుంబానికి వాటాలు ఉన్నాయి వాటి విలువ బహుశ కొన్ని కోట్లరూపాయలు ఉంటుంది. ప్రభుత్వంలో నస్లీవాడియా ప్రతినిధి మాధవరావ్ సింధియా. వ్యాపారంలో సంబంధాలు ఉండటం అన్నది తప్పేమి కాదు కానీ మాధవరావ్‌సింధియా మంత్రి పదవిలో ఉన్నారు కాబట్టి వాడియాతో కానీ, మరెవరితో కానీ ఆయనకి వ్యాపారంలో భాగస్వామ్యం ఉండటం అన్నది ఖచ్చితంగా తప్పే అవుతుంది. అమెరికాలో ఆ దేశాధ్యక్షునితో సహా ఉన్నతాధికారులు అందరూ పదవీస్వీకారానికి ముందుగానే తమ పేర ఉన్నటువంటి వాటాలని అమ్మివేయటమో లేదా ఉంట్టుంది. మిగతా దేశాలకి కూడా అలాంటి జాగ్రత్తలే వర్తిస్తాయి. బాగు చేయబడిన పాత యంత్రాన్ని దిగుమతి చేసుకో టానికి నస్లీవాడియాకి లైసెన్సు ఇవ్వమని రాజీవ్‌గాంధి, ఆయన తల్లి తమకి చెప్పారని సేఠీ అన్నారు. పాత పాటే ఇది. అయినకాడికి చెత్త కింద అమ్మేపాత యంత్రాలని పనిచేస్తున్న స్థితిలో ఉన్నట్టుగా అకౌంటెంట్ చేతో, మరొకరితోనో చెప్పించి పెద్ద మొత్తంలో విదేశీమారకద్రవ్యాన్ని ప్రభుత్వం దగ్గర నుంచి తీసుకుని అందులో చాలా కొద్ది భాగాన్ని మాత్రమే చెత్త కింద అమ్మిన ఆ యంత్రాల యజమానికి చెల్లించి మిగతాదాన్ని జేబులో వేసుకోవటం అనే ఈ ఆట కొత్తదేమి కాదు. నస్లీ కంపెనీవారు రు. 60 కోట్లు అడిగారని, కానీ వాళ్ళు దిగుమతి చేసుకున్న యంత్రాల విలువ రు. 18 కోట్లకి మించి ఉండదనీ సేఠీ అన్నారు. మిగిలిన

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

42 కోట్ల రూపాయలు జేబులో వేసుకొని విదేశీ బాంకులలో దాచుకున్నారన్నమాట. అలా చేసినందువల్ల మీరు దేశాన్నీ; ప్రభుత్వాన్నీ మోసం చెయ్యటమే కాకుండా ఎవరి డబ్బుతో అయితే మీరు ఈ ఆట ఆడుతున్నారో ఆ వాటాదారులని కూడా మీరు మోసగించినట్లే అవుతుంది.

ఇక అసలు విషయం రాజీవ్‌గాంధి రంగంలోకి ఎలా వచ్చారన్నది. అప్పుడు ఆయన పార్టీ ప్రధాన కార్యదర్శిగా మాత్రమే ఉన్నారు. శ్రీమతి గాంధి వాళ్ళకి లైసెన్స్ ఇవ్వమని సేఠీని అడిగారంటే అర్థం ఉన్నది. ఏది ఏమైనా ఆమె ప్రధానమంత్రి. సేఠీ ఆమె మంత్రివర్గంలో ఒక సభ్యుడు. జవహర్‌లాల్ నెహ్రూ కూడా జయంతి ధర్మతేజకి కొద్దిగా డబ్బు ఇవ్వమని తమ మంత్రివర్గానికి చెప్పారు. కొద్దిగా అంటే రు. 20 కోట్లు. "థోడా కుచ్ దేదో" అన్నారటాయన. దాదాపు అవే మాటలు రాజీవ్‌గాంధి, ఆయన తల్లి అన్నట్లు సేఠీ చెప్పినదాన్ని బట్టి తెలుస్తున్నది. అప్పుడు రాజీవ్‌గాంధి నస్లీవాడియా భాగస్వామిగా కూడా [illegible] కనేత ఉంది ఉంటే ఇప్పుడు కూడా అలాగే కొనసాగుతున్నారా? రాజీవ్‌గాంధి కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా ఉన్నప్పుడు తమ స్నేహితులకి, భాగస్తులకి, లైసెన్సులు ఇవ్వమని చెప్తూ మంత్రుల చుట్టూ తిరుగుతూ ఉండేవారా? దానికి ప్రతిఫలంగా ఆయనకి లభించింది ఏమిటి?

ఇవి సాధారణమైన ప్రశ్నలు కావు. నెహ్రూ కుటుంబానికి స్విస్ బాంకులో ఖాతా ఉందని, చాలా డబ్బు విదేశీ మారకద్రవ్యంగా అక్కడ ఉందన్న సంగతి మనందరికీ తెలుసు. దీనిపై ప్రశ్నలు పార్లమెంటులో వచ్చాయి. జనతాపార్టీ అధికారంలో ఉన్నప్పుడు ఆ డబ్బుని వెలికితీసే ప్రయత్నం జరిగింది. ఆ కుటుంబంలో ఉన్న వ్యక్తి రాజీవ్‌గాంధి ఒక్కరే కాబట్టి ఆ ఖాతా ఇంకా నడుస్తూనేఉన్నదా లేక మూసివేయబడిందా అన్న విషయం ఆయనకే తెలిసి ఉంటుంది. అందువల్ల సేఠీ ఆరోపణ నిరాధారమైనటువంటిది అనటానికి వీలులేదు.

ఇప్పుడిక విశ్వనాథ్‌ప్రతాప్‌సింగ్, ఆయన దాడుల విషయానికి వస్తాను. ఆ దాడులు కేవలం కొందరి మీదే ఎందుకు జరుగుతున్నాయి? ఇంతవరకూ ఒక్క కాంగ్రెసు వాది కూడా వాటికి గురికాలేదెందు కని? కాంగ్రెసువారిలో కూడా ఎంతోమంది వ్యాపారవేత్తలు లేదా వారితో సంబంధాలున్నవారు ఉన్నారు. బొంబాయిలో నిర్వహించిన కాంగ్రెసు శతవార్షికోత్సవ తిరణాలకి రు. 100 కోట్లు కర్చు అయిందని తెలిసింది. ఆ డబ్బంతా దాదాపు లోపాయకారీగానే వసూలు చేసారు. అందుకు సహాయపడిన కాంగ్రెసుపార్టీ వారి ఆఫీసులపై శ్రీ సింగ్ దాడులు జరిపారా? చలనచిత్ర నటుడిగా ఉన్న ఒక పార్లమెంటు సభ్యుని కార్యాలయం మీద కానీ, నివాసంపైగానీ, ఆయన ఎప్పుడైనా దాడి జరిపించారా? ఆ వ్యక్తి చదువుకోసం తమ పిల్లలని స్విట్జర్లాండ్ పంపారని, ఆయన సోదరుడు విదేశంలో నివసిస్తున్న భారతీయుడిగా నమోదు చేయించుకున్నారని తెలిసింది. ఈ విషయాన్ని శ్రీ సింగ్ మంత్రిత్వ శాఖ దర్యాప్తు జరిపించిందా? జరిపించకపోతే ఎందుకని జరిపించలేదు?

నేనింతకు ముందే చెప్పినట్లు ఈ ప్రభుత్వం వ్యాపారవేత్తలతో అత్యంత సన్నిహితంగా ఉంటున్నది. ఎంతోమందికి అనేక రాయితీలని కల్పించింది. ఆర్థికాభివృద్ధి పేర అదంతా జరిగింది. లలిత్‌థాపర్ అయినా లేక రాహుల్ బజాజ్ అయినా పెద్ద వ్యాపార సంస్థలన్నీ ఆయన తల్లి హయాంలో కంటే రాజీవ్‌గాంధి ప్రభుత్వంలోనే బాగున్నా యనటంలో సందేహంలేదు. ప్రభుత్వరంగ సంస్థల డైరెక్టర్లబోర్డులోని ఎంతో మంది వ్యాపార వేత్తలని చూస్తే అసలు ప్రభుత్వాన్ని పెద్ద పెద్ద వాణిజ్యవేత్తలే నడుపుతున్నారనవచ్చు. అందు వల్లనే థాపర్‌ని వదిలివేయటం జరిగింది. అసలు ఆయనని అరెస్టు చెయ్యటమే ఆశ్చర్య కరమయిన విషయం. పాపం విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ తమ శాఖని ఎవరు నడుపుతున్నారా అని ఆశ్చర్య పోతూ ఉండి ఉంటారు. □

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు . (1938-1972)

21-27 నవంబరు, 1986

శ్రీ అక్షయ నామ సం కార్తీకబ పంచమి

సంపుటము 79 : సంచిక 12

ముఖ్య సంపాదకుడు .

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు

మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75 |
| పోస్ట్‌లో 6నెలల చందా | రు. 78.00 |
| పోస్ట్‌లో 12నెలల చందా | రు. 156.00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధినగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి పూర్ణిమ

(ఫొటో : ఎమ్ కె. రామమూర్తి)



# ఉత్తరాలు

## శీర్షికలు

"రాధిక" ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాల అందముగా, ముచ్చటగా, ఆకర్షణీయంగా వుంది.

ఇందులో "అభిమాన తారలపై అభిప్రాయాలు', 'విజయశాంతి సమాధానాలు" చాల బాగున్నాయి

గొపిశెట్టి అనూరాధ, దాసీనగర్,హవురా

## సీరియల్స్

'రాధిక ముఖచిత్రం గల సంచికలోని 'పావని' సీరియల్ చాల బాగుంది కార్టూనులు కడుపుబ్బ నవ్వించాయి.

చెంగల కృష్ణమూర్తి, లింగన్నపాలెం

★ ★ ★ ★

"నటి రాధిక ముఖచిత్రంతో వెలువడిన 24-30 అక్టోబరు సంచిక చూడ ముచ్చటగా ఉంది. ప్రచురించిన నాలుగు సీరియల్ నవలలు ఆసక్తికరంగా సాగుచున్నవి"

బళ్లారి మహమ్మద్ సలీమ్, గుత్తి

★ ★ ★ ★

ఈ వారం నటి 'రాధిక' ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ఆకర్షణీయంగా ఉంది సీరియల్స్ 'నిశ్శబ్ద సంగీతం, పావని' మంచి క్లయిమాక్స్‌కి వచ్చాయి సీరియల్స్ మాకు బాగా నచ్చాయి.

-సాహుకార భిల్లేశ్వరరావు, నౌపడ్గా

★ ★ ★ ★

"కరిగిన శిల", పావని" సీరియల్స్ మమ్మెంతో ఉత్తేజింపజేసి, తదుపరి సంచిక కొరకు ఎదురు చూచే విధముగా వున్నవి "పావని సీరియల్ సినిమా తీసినచో అద్భుతముగా వుంటుంది

బి చెన్నారెడ్డి, భాల్కల్(కర్నాటక)

(73 వ పేజీ చూడండి)

# కనకాంబరాలని

విశాలమైన ఆవరణ నిండా జనం కళ కళలాడుతున్నారు.

ఇంటి ముందు షామియానా, కుర్చీలు, వేదిక మొదలైన



కె. నాగేశ్వరి

కొత్త సీరియల్ ప్రారంభం!

హంగులున్నాయి.

"ప్రముఖ వీణా విద్వాంసురాలు లలితగారి వీణ కచేరి" అని అందంగా వ్రాయబడిన బ్యానరు రెపరెపలాడుతోంది.



# రసరాగ వాహిని

"లలితగారు నేషనల్ ప్రోగ్రామ్సుకు వాయిస్తారు. వసంతగారి ఫ్రెండుట. అందుకే వచ్చారు. లేకపోతే ఈ మారుమూల పల్లెకి రావలసిన ఖర్మ ఆవిడకేంటట" అని కుర్చీల్లో కూర్చున్న వారిలో ఒకరన్నారు.

"అవును. వసంతగారు అస్తమానం విజయవాడ వెళ్ళి వస్తోంటే ఏదో అనుకున్నాం. ఆవిడకి ఈ ఆలోచన ఉన్నట్లే మనకి తెలియదు." ఇంకో వ్యక్తి అందుకున్నాడు.

'ఈ ఊరు ఒకప్పుడు మంచి దర్జాగా, ఆడంబరంగా కళాకారులను పోషించేదట మన గుడిలో ఇప్పటి ప్రముఖ నటులు నాటకాలు ఆడారట ప్రముఖ నాట్యాచార్యులు నాట్యప్రదర్శన లిచ్చారుట హరికథలు చెప్పారుట ఇప్పుడంటే ఇలా తయారయింది." ఒకమధ్యవయస్కుడు అన్నాడు

'అవును! వసంతగారు కాపురానికి వచ్చిన దగ్గర్నుంచి చూస్తున్నాం ఆవిడలో ఇంతటి కళాకారిణి దాగి ఉందని మనకి తెలియనే తెలియదు

పాపం! అప్పటికీ చాలా మంది పిల్లలకు జాతీయ గీతాలు మొదలైనవి చెప్పారు స్కూల్లో జాతీయ గీతాలు, స్వాతంత్ర్య దినానికి పాడేవారు ఆమె శిష్యులే "

'ఇప్పుడు గురుకులవాస పద్ధతి మళ్ళీ అమలులోకి వచ్చింది పల్లెలో ఇటువంటి స్కూళ్ళలో చదివిన వారికే ఫస్టు వస్తోంది తాడికొండ స్కూలు తరపున ఎంత మంది రాంకులు సాధించలేదు '

"అసలీ సంగీత విద్య గురువుకి, శిష్యులకి అన్యోన్యానురాగాలు నెలకొంటేనే వస్తుందట ఇప్పుడంటే కళ పూర్తిగా వ్యాపారమైపోయింది."

'కాని మన కళలు సజీవమైనవి స్వార్థపరులు వాటిని వాడుకొన్నా కొందరైనా వసంతగారి లాంటి వారుంటారు ముఖ్యంగా ఆమెను ప్రోత్సహించిన భానుమూర్తిగా రిని అభినందించాలి '

అవును! భానుమూర్తిగారు నెమ్మదైన వారు మంచివారు ఏదో మొదటి భార్య రోగంతో తీసుకుని, తీసుకుని ఈయనకు సుఖం లేకుండా చేసింది. వసంతగారు అటు అత్తవారినీ, భర్తనూ, పిల్లలనూ సమర్థించుకొందంటే, భర్తగా ఈయన సహకారం, ఉండబట్టేకద

ఇంతలో మైకులో "వీణ కచేరి ఇంకా కొద్ది నిముషాలలో ప్రారంభింప బడుతుంది అంతా నిశ్శబ్దంగా ఉండి మాకు సహకరించవలసింది." అని అనౌన్సుమెంటు వినిపించింది.




ప్రారంభ ఉపన్యాసం, లలిత యొక్క ఘనత అన్నీ ఉపన్యాస రూపంలో పరిచయం చేయబడ్డాయి.

"ఈవిడ చూడండి? ఎంత నిర్వికారంగా ఉందో? ఆమె ఎక్కడెక్కడ కచేరిలు చేసిందో, ఏవో దేశాలు తిరిగిందో ఒక చెంపను పొగుడుతున్నా అంతపట్టనట్టుంది " అని గుసగుసలు పోయారు.

నిజంగానే లలిత తనకేం పట్టనట్టుగా కూర్చుంది నిరుత్సాహంగా ఉన్న ముఖం, ఏమిటో ఆలోచనలు, ఒక సమాధిలో ఉన్న మౌనిలా కూర్చుంది చెప్తున్నది తన గురించేనా అన్నట్లుంది అందుకు భిన్నంగా వసంత అంతా తానై కలయ తిరుగుతోంది లలిత గురించి పరిచయం జరిగాక ఆమె శ్రోతల నుద్దేశించి ఇలా అన్నది

'అందరికీ నా వందనాలు ఈమె లలిత నా స్నేహితురాలని చెప్పుకోడానికి నేనెంతో గర్విస్తున్నాను. ఈమెను పరిచయం చేసుకోవాలని, చూడాలనీ, మీలో చాలా మంది ఉవ్విళ్ళూరుతున్నారన్నది నిజం. మీరే కాదు, మన ఆంధ్రదేశం గర్వించదగ్గ కళాకారిణి ఈమె ఈమె వీణా వాయిద్యం ప్రత్యక్షంగా చూసే అదృష్టం మీకు పట్టబోతోంది ఈమె వాయిద్యంలో చూపే గమకశైలి, రాగ స్వరూపం, సాహిత్య స్పష్టత, లాలిత్యంతో కూడిన గంభీర నాదాన్ని సృష్టించే వేళ్ళ కదలిక, ఆమె ప్రతిభకు అదృష్టానికీ, కృషికీ దర్పణాలు ఇలా ఈమె గురించి, ఈమె విద్య గురించి ఎంత చెప్పినా తరగదు. అది అబద్ధం కాదనీ, గొప్ప కాదనీ, ఇప్పుడు ఆమె వాయించి నిరూపిస్తుంది' అని నమస్కరించి దిగిపోయింది.

సభలోని వారందరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు

లలిత ముందుగా స్టేజికి నమస్కరించింది 'తరువాత సభకి నమస్కరించింది అక్కడే ఉన్న నటరాజు విగ్రహానికి నమస్కరించింది

ముందుగా విఘ్ననాయకుడైన వినాయకుడిపై కీర్తన వాయించింది

'వాతాపి గణపతింభజే" కీర్తన ఘంటసాల గారి ద్వారా పాప్యులర్ అయింది ఇప్పుడివిడ వాయిస్తుంటే పాడినంత స్పష్టంగా ఉంది ఎంత చక్కగా జిలుగులు వేస్తోంది. 'రవ" గమకం ఎంతటి సాధకులకో గానీ పలకదు "

అని అతి నెమ్మదిగా ఎక్కడ ప్రక్క వారికి డిస్టర్బెన్సుగా ఉంటుందో నన్నట్టుగా అన్నాడు ఒక వ్యక్తి.

ఇంతలో రాగాలాపన మొదలైంది.

'సంగీతం రాని వారం మనకే అభేరి రాగం చక్కగా తెలుస్తోంది. ఇంక సంగీతజ్ఞులు ఎంతగా ఆనందపడతారో!"

తనలో తనే నెమ్మదిగా అనుకున్నాడొక శ్రోత

లలిత "నగుమోము గనలేని" కీర్తనకు వేసిన రాగాలాపన నిజంగానే విన్నవారు ఆనందం అనుభవించేంత ఆహ్లాదంగా ఉంది రాగస్వరూపం అత్యంత రమణీయంగా వినిపించింది. తరువాత తానం ఎత్తుకుంది. తానంలో అనంత జగత్తును లీనం చేసుకొగల మహిముంది. నిపుణురాలైన లలిత హాలంతా నిశ్శబ్దంగా తను వాయిస్తున్న తానంలో లీనమయ్యేట్టు చేసింది.

ఇంక కీర్తన ఎంత రసపుష్టిగా పలికిందో, భావస్ఫోరకమైన ఆ వాయిద్యంలో వారికి ఆ కథ కళ్ళకు కట్టినట్లయింది నిజంగా గజేంద్రుడు మొర పెట్టుకోవడం అంత హృదయవిదారకరంగా ఉందా అన్పిస్తుంది చివరికి చరణం "జగమేలే పరమాత్మ ఎవరితో మొరలిడుదు" అని పరమాత్ముని వేడుకొంటున్నట్లు ఆర్ద్రపూర్వకమైన భావస్పష్టత ఆమె వాయిద్యంలో పొందుపరచింది

ఇంక వీణపై నడిచేది చెయ్యికాదు, నల్లని నీటిపై తెల్లని కలువా అనేట్లుంది. స్వరకల్పనతో ఆమె సామర్థ్యం అంతా విజృంభించింది.

అంతవరకూ ఆనందలోకాల్లో ఉన్న సభికులకు తన వాయిద్యం పరాకాష్టకు వెళ్ళేటట్లుగా "రఘువంశ సుధాంబుధి" ఎత్తుకొంది వివిధ రంజకములైన సంగతులు వేసింది. శ్రోతలకు సంపూర్ణమైన తృప్తి కలిగింది. కదన కుతూహల రాగమే గొప్పది. "టక టక టక"మని యుద్ధానికి సన్నద్ధమవమన్నట్లు రిథమ్ విన్పిస్తుంది ఇలా మూడు గంటల సేపు, పూర్వి కల్యాణి, అఠాణా, వాగధీశ్వరి, , శ్యామ, ఆఖరికి హిందూస్థానీ రాగమైన దర్బారి కూడా విన్పించింది. ఆఖరున అందరూ పెద్దపెట్టున కరతాళ ధ్వనులు చేశారు.

"లల్లీ! నా స్కూలు కలకాలం నిలవకపోవచ్చు. నీ లాంటి పేరు పొందిన

# ఆ కళ్లలో తళుకు కలకాలం ఉండాలి



# మార్గదర్శి

ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం ! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్థిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్లుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు 60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తా లలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1 00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 5000 | 50 | 2 50,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్
- లకిడికాపూల్, హైదరాబాద్
- చిక్కడపల్లి, హైదరాబాద్
- అమీర్‌పేట్, హైదరాబాద్
- ఎమ్ జి రోడ్ సికింద్రాబాద్
- ఎ ఎమ్ సి కాంప్లెక్స్, విజయవాడ
- బందర్‌రోడ్, లబ్బీపేట్ విజయవాడ
- జగదాంబ జంక్షన్ విశాఖపట్నం
- స్టేషన్‌రోడ్ గుంటూరు
- జె పియన్‌రోడ్, వరంగల్
- టి నగర్ రాజమండ్రి
- సుభాష్‌రోడ్ కాకినాడ
- నెహ్రూ రోడ్ కర్నూలు
- వైరారోడ్ ఖమ్మం
- నరసింహారావ్‌పేట ఏలూరు

డబ్బుకోసమేనా మీ చింత ! మార్గదర్శి ఉన్నది మీ చెంత !!

**మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్.**

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు
ఆబిద్ సెంటర్ హైదరాబాద్ - 500 001

Kiron-MCF 86 3

## రసరాగ వాహిని

గాయని వాయిద్యం ప్రత్యక్షంగా చూసే భాగ్యం కలుగజేశావు."

లలిత కచేరి ముగియగానే ఆగలేక స్టేజి మీదే అభినందనలు తెల్పింది వసంత.

ఇంతలో ఫొటోగ్రాఫరు వచ్చి "మాడమ్! మీరు విద్యార్థులతో లలిత గారిని ఫొటో తియ్యమన్నారు." అన్నాడు.

"అవును! లలిత చేతో నే మొదట స్వరాలు వాయింపజేస్తాను. ఉండండి! వెళ్ళి పిల్లలను పిలుచుకొస్తాను." వసంత వెళ్ళింది.

ఇలా ఆ రోజు మరునాడు వసంతకి, లలితకు ఊపిరి సలపని కార్యక్రమాలు. గ్రామంలోని వారంతా వచ్చి లలితను అభినందించిన వారే... వసంత అదృష్టాన్ని కొనియాడిన వారే... ఎందుకంటే ఆ గ్రామంలో సంపన్నులున్నారు. తెలివి ఉంది, కమ్మని కంఠ స్వరం ఉన్న పిల్లలూ ఉన్నారు. సంగీతం వల్ల లాభమే మేలు. దానికి పోసిన డబ్బు తిరిగి రాదు అన్న మూర్ఖపు ఆలోచనలను వారు విడిచేటట్లు చేసింది వసంత.

ఇంక భానుమూర్తిని పొగడని వారు లేరు. అతడి సహృదయతను, విశాల భావాల్ని కొనియాడారు. ఇలా ఉత్సాహ, ప్రోత్సాహాల మధ్య సతమతమయి ఉక్కిరిబిక్కిరయారు స్నేహితురాళ్ళిద్దరూ.

మూడవ రోజున వెళ్ళిపోతానని చెప్పింది లలిత. వసంత దిగులు పడింది.

"లల్లీ! నా స్కూలుకు వెనుక నీ అండ, ప్రోత్సాహం ఉందనే ధైర్యంతో నే ప్రారంభించాను. ఇంకా రెండు రోజులైనా ఉండి వెళ్ళు. నేను నీ అంత అనుభవశాలిని, విద్వాంసురాలిని కాను."

"ప్లీజ్ వసంతా! ఇంటి దగ్గర పరిస్థితి నీకు తెలుసు. వచ్చే వారం రెండు కచేరిలున్నాయి. ఢిల్లీకి నేషనల్ ప్రోగ్రాము రికార్డింగుకు కూడా వ్యవధి లేదు. నేను కేవలం అదృష్టం తోసుకొచ్చి ఇంత విద్వాంసురాలినయాను. మరి నువ్వో?

నలోని అణువణువూ సంగీతంలో ఇమిడి ఉంది. నువ్వే సంగీతం! సంగీతమే నువ్వు. ఏదో పూర్వజన్మ పుణ్యముంటే గాని ఇంతటి ఆసక్తి ఉండదు. దొంగలు దోచుకు పోలేనిది విద్య అంటారు. మా గురువు గారు ఇలా అనేవారు "నీ దగ్గర పది వేలుంటే అందులోంచి వెయ్యి తీస్తే తొమ్మిది వేలవుతాయి. ఆ తర్వాత ఇంకొక వెయ్యి, ఎనిమిది వేలవుతాయి. ఇలా తీసినకొద్దీ తరిగేది (ధనం) లక్ష్మి. కాని సరస్వతి అలా కాదు. నువ్వు ఇతరులకి దానం చేసే కొలదీ పెరుగుతుంది. ఆయన్న మాట నీలాంటి వారిని చూస్తే నిజమే నన్పిస్తుంది. నువ్వు చేపట్టిన ఆదర్శం గొప్పది. నీ బాటలో ఎన్ని అడ్డంకులు వచ్చినా ముందుకు పోగల కార్యశూరత నీకుంది. నీ దగ్గర ఉన్న కొలదీ ఉండాలనుంటుంది. నీతో కబుర్లు చెప్పిన కొద్దీ చెప్పాలని ఉంటుంది. వచ్చే జన్మలోనైనా మనం భార్యాభర్తలుగా పుట్టాలని నా కోరిక. వద్దులే. భార్యాభర్తలైతే బాగుండదు. ప్రేయసి ప్రియులుగానే పుడదాం. సంగీతమే జీవిత పరమావధిగా జీవిద్దాం."

అంది లలిత. ఆమెకి వసంతను విడిచి వెళ్ళాలని లేదు. వసంతతో ఎన్ని కబుర్లయినా చెప్పగలదు, స్వతహాగా మితభాషియైన లలిత.

"అన్నట్లు లలితా ప్రేయసి ప్రియులంటే గుర్తొచ్చింది. నేనా పాఠశాల ప్రారంభించడానికి వెనుక ఉన్న బలమైన కారణం నీకు చెబుతాను. రెండు రోజులుండు. ఎల్లుండి నిన్ను నేను రైలెక్కిస్తాను." బ్రతిమాలాడింది వసంత.

"ఇప్పుడు చెప్పవా?" దిగులుగా అడిగింది లలిత.

లలితకు కథలంటే అపరిమితమైన ఆసక్తి. ఏమాత్రం తీరిక దొరికినా ఆమె శిష్యులచే కథలు చదివించుకొంటుంది.

"హమ్మయ్య! ఈ రోజుకి నిన్ను ఉంచినట్లే. సరే! ఇప్పుడు కాదు. రాత్రికి చెబుతాను. పద! ఎవరో నీతో మాట్లాడడానికి వచ్చారు."

"చూడు వసంతా! ఈ ఊర్లో ఎన్నో కష్టనష్టాల కోర్చి, గురుకులవాస పద్ధతిని నెలకొల్పాలని నడుం కట్టింది నువ్వు. వాళ్ళందరూ, నా కోసం ఎగబడుతున్నారు."

"వాళ్ళకి ఆ మాత్రం తెలియదా? నువ్వు ఎ. క్లాసు, నేను ఆర్డినరి. ప్రజలు

తెలివి మీరుతున్నారు లలితా. వెళ్ళు."

ఆ రాత్రి లలితకు మెత్తని పక్క లేసింది ప్రేమగా చిలకలు చుట్టిస్తూంటే లలిత ఆనందంగా–

"వసూ! నేనెంత పుణ్యం చేసుకోకపోతే నీ చేతి చిలకలు తినే భాగ్యం కలిగింది. పాపం! భానుమూర్తి గారికి నా సానుభూతి ఈ మెత్తటి పరుపుపై అతడు శేషశాయిలా శయనిస్తే నువ్వు అతని నోటికి చిలకలు చుట్టి ఇవ్వాలి. భర్తను వంటరిగా అతడి ఖర్మానికి వదిలేసి నాకు సేవ చేస్తున్నావు. మేలుకొలుపు దగ్గర్నుంచి పవళింపు సేవ వరకూ చేయించుకొంటున్నాను. అన్నట్టు నువ్వెంతో బాగా పాడతావు మోహనరాగంలోని క్షేత్రయ్య పదం. ఏదీ ఎత్తుకోవా! నేను హాయిగా వింటాను."

"లల్లీ! మోహన అంటే గుర్తొచ్చింది. నీకు ఒక ముఖ్య సమాచారం చెప్పాలని నా మనసు ఉవ్విళ్లూరుతోంది. అది ఒక రకంగా ప్రేమకథ అనుకో?"

"అబ్బ! ప్రేమకథని ఇన్నాళ్ళు నాకు చెప్పకుండా ఎలా దాచావు. నన్ను ఊరించి చంపక. అబ్బో! నీ దెంత లోతు గుండె."

"సమయా సమయాలు చూసుకుని ఏ పని చేసినా విలువుంటుంది. నీకు చెప్పడానికిదే సమయం ఇన్నాళ్లకు కలుసుకున్నాం. వచ్చిన దగ్గర్నుంచి స్కూలు ప్రారంభోత్సవపు హడావుడితోనే గడిచింది. ఇంక మిగతా సమయం ఈ కథతో గడిచేట్టుంది. ఇంక కష్టసుఖాలు ఎప్పుడు చెప్పుకుంటాం " లలితను మరింతగా ఊరించింది వసంత.

"అబ్బ! బడాయి కట్టిపెట్టు ముందు కథ చెప్పవోయ్! కథ పూర్తయ్యే దాకా నిద్రపోను. నేను ఊరు వెళ్లను. అంతే!"

"అయితే ఈ కథకు ముగింపు వదిలేసి మిగతాది రోజుకి కొంత కొంతగా చెప్తాను. ముగించేవరకూ ఎన్నాళ్లయినా ఉంటావా?" మురిపెంగా అడిగింది వసంత.

"నీకు నేనంటే వేళాకోళంగా ఉందా వసూ! అందుకే చెప్పటం లేదు." కోపంగా అడిగింది లలిత.

"అయితే విను. నేను వేళాకోళంగా చెప్పడం లేదు. నేను ఈ కథను ఈ ఊర్లో ఒక్కొక్కరి నోటంట ఒక్కో రకంగా విన్నాను. కొన్ని శిథిలమైన వస్తువులు దొరికాయి. ఇంకా రకరకాలుగా విషయాన్ని సేకరించాను. మొత్తానికి విన్నది, దొరికినది కలిపి ఆ ఆనవాళ్లతో ఆ కథ ఒక సినిమా కథలా నా కళ్లకు కట్టినట్టు కనిపిస్తోంది. ఆ పాత్రలు అహోరాత్రాలూ నాకు మనశ్శాంతి లేకుండా చేశాయి. కాగితం పైన పెట్టే అదృష్టం, ఓపిక, సమయం నాకు లేవని నాకు తెలుసు. అయినా నన్ను నిలవనీయ లేదా కథ. ఆ విషాద గాథకు ముగింపు లేకపోయినా, నేను ఏదో నాలోని అశాంతిని తృప్తి పరచడం కోసం ఈ పాఠశాల ప్రారంభించాను. కథంతా విన్న తర్వాత నేనెందుకు ఈ పాఠశాల ప్రారంభించానో, నేను చెప్పకపోయినా నీకు తెలుస్తుంది."

అని వసంత కథ చెప్పినదనే కంటె జరిగినది లలితకు హృదయానికి హత్తుకునేలా చూపిందంటె అతిశయోక్తి కాదు.

* * * * * * * * * *

ఆ రోజుల్లో ఇదే ఊరులో సంపన్న కుటుంబీకుల ఇళ్ళు వేళ్ల మీద లెక్కబెట్టవచ్చును ఆ రోజుల్లో అగ్రకులాలవారి ఖచ్చితమైన నీతి నిబంధనలూ, కట్టుబాట్లూ చూసి వారిని దేముడ్ని కొలిచినట్టు కొలిచేవారు. వారిని చూసే మిగతా వారూ ఆదర్శవంతంగా మసలే వారు. ఇలా ఒక కట్టుబాటు, ప్రేమానురాగాలూ, మనిషికీ మనిషికీ మధ్య నెలకొని ఉండేవి. ఒక వ్యక్తి ఉంటే మొత్తం గ్రామం అతడు సమిష్టిగా తమకు చెందినవాడేనని భావించే వారు. అటువంటి ఆదర్శవంతమైన కుటుంబాల్లో ఒకరి ఇంటి ఆడబడుచు కల్యాణి.

"తల్లీ నిన్ను దలంచి పుస్తకమున్ చేతన్ బూనితి" అని అయిదవ ఏట అక్షరాభ్యాసం నాడు సరస్వతి స్తోత్రం చేస్తోంది చిన్నారి కల్యాణి. అంతలో ఆమె దృష్టి తను పూజిస్తున్న సరస్వతీదేవి చేతిలోని వీణపై బడింది.

"నాన్నా! అదేంటి? ఎంత అందంగా ఉందో!" అని అడిగింది.

"అది దేవలోకపు ,వాయిద్యమమ్మా, వాయిద్యములన్నింటికి మాత విద్యాధిష్టాన దేవతయైన సరస్వతి దేవికి ఆభరణం అది. ఆ వీణను "కచ్ఛపి అంటారు" అని పురోహితుల వారు సమాధానమిచ్చారు.

"మన లోకంలో ఉండవా? ఒక్క దేవతలు మాత్రమే వాయించాలా?" అని సందేహంతో అడిగింది కల్యాణి

"నువ్వు నారదమహర్షి పేరు,విని ఉండవు. ఆయన మూడు లోకాల్లోనూ సంచరించే వాడు ఆయన దగ్గర "మహతి" అనే వీణ ఉండేది ఆయన దాన్ని ఎల్లప్పుడూ ధరించే ఉండేవాడు. దాన్ని మీటుతూ పాడే ఆ వాయిద్యం ఈ భూలోకానికి పరిచయమైంది.

"మరి నేను వాయించాలంటే ఎలా తాతగారు."

"రాజు తలచుకొంటే దెబ్బలకు కొదవా! అయినింటి ఆడపిల్లవు. మీ నాన్నగారు కొండ మీద కోతిని తెమ్మన్నా తెస్తారు. విద్య నేర్చుకుంటానంటే వద్దంటారా?" అన్నారు పురోహితుల వారు.

"సరిసరి! అమ్మాయి కోరిక తీరడానికింకా వయసుంది ముందు ఈ రోజు ఓనమాలు దిద్దమ్మా వీణ వాయించాలంటే స్వరాలు వ్రాయటం రావాలమ్మా" అని తండ్రి ఊరడించాడు.

"ముందు జరగవలసినది చూడండి తర్వాత సంగీతాలు, సాహిత్యాలూను"




అని కల్యాణి తల్లి సంగీత ప్రపంచంలొంచి బాహ్య ప్రపంచంలోకి పిలిచింది

చక్కని చుక్కయైన కల్యాణి ఓనమాలు కుదురుగా దిద్దింది మర్నాడు ప్రయివేటు మాష్టారు వచ్చి–

"అమ్మా అఆలు దిద్దమ్మా" అని చిన్నారి చేతో దిద్దించారు

"మాష్టారూ! నాకు తొందరగా వ్రాయడం నేర్పాలి నేను వీణ వాయించటం నేర్చుకుంటాను."

"నీకు వీణంటే ఇష్టమామ్మా?"

"అవును మాష్టారూ! బొమ్మలో చూసిన దగ్గర్నుండి నాకు వీణెంత తొందరగా వాయిద్దామా అని ఉందండి."

"ఏ విద్య పట్టయినా, సహజసిద్ధమైన ఉత్సాహం, ఆసక్తి, కుతూహలం, ఉండటం పూర్వజన్మ సుకృతం. ఏవీ నీ వేళ్ళు.. అబ్బో! చక్కనివేనే. నీకు వీణ తప్పక వస్తుంది మరి ఈ రోజు అఆలు దిద్దేయాలి."

సంవత్సరం తిరిగేసరికి కల్యాణి పుస్తకాలు చదవటం నేర్చుకొంది. ఇంకో సంవత్సరానికి లెక్కలు, ఇంగ్లీషు మొదలైనవి నేర్చుకొంది (ఇంకా ఉంది)

# శిలాశాసనం..తలనొప్పిడికెడూ!

## అవనాపుల జగన్నాథరావు & మల్లంపల్లి గాంధీరామారావు

నాగపూర్ నగరానికి తల మానిక మని చెప్పుకో వచ్చు.... ఆ ఆఫీసు భవనాన్ని. అందంగా అధునాతనంగా కట్టిన.... ఆ ఆఫీసు.... ఘనత వహించిన గవర్నమెంటు వారికి చెందినది.

మామ్మూలుగా.... నిశ్శబ్దంగా ఉండే ఆ ఆఫీసు వాతావరణంలో రెండు పెద్ద మార్పులు ఒకే రోజు జరిగి.... పెద్ద సంచలనాన్ని రేపాయి.

అందులో మొదటి మార్పు.... పదేళ్ళుగా సెక్షన్ హెడ్‌గా పని చేస్తున్న రంగనాధం గారు రిటైర్ కావడం.... రెండో మార్పు అంతవరకూ సీనియర్ క్లార్కుగా పని చేస్తున్న సుబ్బారావు సెక్షన్ హెడ్‌గా చార్జి పొందో వరు చేసుకోవడం.

వీడ్కోలు పార్టీతో సహా తతంగ మంతా జరిగి పోయింది. రంగనాధం గారు బహుమతిగా ఇచ్చిన కొత్త శాలువా తీసుకుని..... శేష జీవితాన్ని ఎలా ఎదుర్కోవాలో అని ఆలోచించుకుంటూ ఇంటి ముఖం పట్టారు.

అంత వరకూ, బ్రతిమాలించు కొని పని చేయడం తప్పించి తనంత తానుగా పనిచేయడం అలవాటు లేని సుబ్బారావు ... మర్నాటి నుండి.... ముష్కరుల్లాంటి ముగ్గురు ఆఫీసర్లనీ... కింకరుల్లాంటి ఇరవై మంది టైపిస్టులనీ ఎలా ఎదుర్కోవాలో అని ఆలోచించు కుంటూ..... బెంగతో ఇంటి ముఖం పట్టాడు.

* * * * *

ఉదయాన్నే.... తొమ్మిదిన్నర కల్లా... ఆఫీసుకి వచ్చిన సుబ్బారావుకి... ఎంత ఆలోచించినా అర్థం కాలేదు ఆ రంగనాధం గారు అనుక్షణం అలా ఎందుకు... నీటి నుండి బయట పడిన చేపలా కొట్టుకునే వాడో.

కాస్త ఐదు పది నిముషాల ఆలస్యం మినహాయించి, రమారమిలో అందరు టైపిస్టులూ.... టైముకి వచ్చేశారు.

అన్ని సెక్షన్‌ల నుండి వచ్చిన... టైపు చేయాల్సిన కాగితాల బొండు ట్రేలో నిండు గర్భిణిలా ఉంది.

ఆ కాగితాల్ని అందరు టైపిస్టులకీ సమంగా పంచి ఈయడానికి గంట పట్టింది సుబ్బారావుకి.

ఎడ తెరిపి లేకుండా టైపు మిషన్లు చేస్తున్న చప్పుడు.... వీనుల విందుగా వినబడ సాగింది.

ఎంతో సందడిగా ప్రారంభ మైన టైప్ మిషన్ల చప్పుళ్ళలో రెండు గంటలయ్యే సరికి లయతప్పడం ప్రారంభ మయింది.

ఒంటి గంట అవడం భయం.... అందరూ పనిని ఆపు చేసి. . ఒంటి గంటన్నర ఎప్పుడవుతుంతా అని ఎదురు చూడ్డం మొదలు పెట్టారు–

సెకండ్ హాఫ్‌లో పనితో బాటు .... ఫోన్ల రొద కూడా ప్రారంభ మయింది.

కాగితం పంపించిన ప్రతి వాడికీ ... టైపు చేసిన కాగితాలు కావాలి. ప్రతి ఒక్కరి పనీ అర్జంటే. పని పూర్తయిన వారి కాగితాలు పంపించి..., అవని వారికి సర్ది చెప్పే సరికి తల ప్రాణం తోకకి వచ్చింది సుబ్బారావుకి.

సరిగ్గా నాలుగయే సరికి.... కొత్తగా జాయి నయిన నలుగురు కుర్రాళ్ళూ .... టైపు మిషన్లకి జుబ్బాలు తొడిగేశారు.... క్రికెట్ ప్రాక్టీసుకి వెళ్ళడం కోసం – లలిత, రంగారావు.... మామ్మూలుగా అడిగి ఇళ్ళలో అర్జంటు పనులుండటం వల్ల ముందుగా వెళ్ళి పోయారు.

ఆఖరు మెషిను చప్పుళ్ళు కూడా నాలుగున్నరకు ఆగిపోయింది. ఐదు గంటలయే సరికి, సుబ్బారావూ, ప్యూన్ వీరాస్వామి తప్ప, మిగిలిన వాళ్ళంతా వెళ్ళి పోయారు.

ఇంక తాళం వేసి.... యింటి మొహం పడదా మనుకున్న సుబ్బారావుకి, అరగంట క్రితం ఫోనులో వినిపించిన ఎడ్మిని స్ట్రేటివ్ ఆఫీసరు సింహ గర్జన జ్ఞాపకం వచ్చింది.

దసరా ఉత్సవాల సందర్భంగా రాజంపేట (కడపజిల్లా)లో ప్రభుత్వ సమాచార పౌర సంబంధాల శాఖ ఏర్పాటుచేసిన జానపద పాటల కార్యక్రమంలో పాల్గొన్న ప్రొద్దుటూరు సోదరీమణులు కుమారి ఆర్.చిత్రావతి, అరుణలని ఫొటోలో చూడవచ్చు.



"ఉదయం పదిన్నరకు, తను ఇచ్చిన కాగితాల టైపుడు కాపీలు టేబిలు మీద ఉండాలని"

పది రోజుల తర్వాత వెళ్ళ వలసిన ఆ మంత్రి స్టేటుమెంటుకు అంత తొందర ఏమిటో ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా అర్థం కాలేదు సుబ్బారావుకు.

నీరసంగా సిగరెట్ వెలిగించి..... మిషన్ ముందు కూర్చొన్నాడు మిగిలి పోయిన రెండు పేజీల టైపింగ్ పూర్తి చేయడానికి.

* * * * *

ఆఫీసులో హోదాతో బాటు... సుబ్బారావుకు తలనొప్పి కూడా ప్రారంభ మయింది.

కొత్త భాద్యత తీసుకొన్న.... మొదటి రెండు మూడు రోజుల్లో అంతగా గమనించలేదు.... గాని రాను రానూ తల బద్దలయే పరిస్థితి వచ్చే సరికి గత్యంతరం లేక డాక్టరు వద్దకు వెళ్ళాడు సుబ్బారావు.

డాక్టరు ఫీజులకీ, మందులకీ కలిపి మూడు వందలు ఖర్చయింది. పాత కళ్ళ జోడు స్థానంలో కొత్త కళ్ళజోడు వచ్చింది. కళ్ళ డాక్టరుతో బాటు, పళ్ళ డాక్టరు కూడా యధోచితంగా ఏభై రూపాయిలు లాగేశాడు.... రెండు పళ్ళతో కలిపి. ఇన్ని వైద్యాలు జరిగినా.... రవ్వంత కూడా గుణం కనిపించకండా, తల నొప్పి మాత్రం అలానే ఉండి పోయింది.

ఖాళీ అయిన ఆఫీసునీ, టైపు చేయవలసిన కాయితాల్నీ చూసి.... సుబ్బారావు గుండె బేజారెత్తి పోయింది.

"వీరాస్వామీ! అయ్యరు కొట్లోంచి హాఫ్ కాఫీ, నాయుడు కొట్లోంచి రెండు సారిడన్ మాత్రలూ పట్రా.... " అంటూ టైపు మిషను ముందు కూర్చొన్నాడు సుబ్బారావు.

ముఖ్యమైన కాయితాల టైపింగు పూర్తి చేసే సరికి... రాత్రి ఎనిమిదయింది.

రెండు గంటల క్రితం మింగిన సారిడన్ టాబ్లెట్లు.... ఎక్కడికి పోయాయో.... అర్థం కాలేదు సుబ్బారావుకి.... విపరీతమైన తల నొప్పి వల్ల.

తాళం వేసి బయట పడేసరికి ... జ్ఞాపకం వచ్చారు.... రిటయిర్డు సెక్షన్ హెడ్ రంగనాధం గారు. ఎన్ని పనులతో సత మత మౌతున్నా.... ఏ ఒక్క రోజు కూడా తలనొప్పి మాటెరుగని.... ఆయన ఆరోగ్య రహస్యం కనుక్కోవాలని పించింది.... సుబ్బారావుకి.

వెంటనే సైకిల్‌ను.... ఆయన యింటి ముఖంగా తిప్పాడు.

*****

కాఫీ.... కానిచ్చిన తర్వాత అసలు విషయాన్ని బయటపెట్టాడు సుబ్బారావు.

తెలియని ఇంగ్లీషు మాటకి అర్థం .... ఆక్స్ ఫర్డ్ డిక్షనరీలో దొరికినంత ఈజీగా.... తన తలనొప్పి పోడానికి మార్గం కనిపెట్టేశాడు.. . రంగనాథంగారు.

మర్నాడు ఉదయాన్నే ... ఆఫీసుకు వచ్చిన వెంటనే..... రంగనాథం గారి సలహా మేరకు మూడు లెటర్స్‌ను టైపు కొట్టాడు సుబ్బారావు.

అందులో మొదటిది –

"ఆఫీసులో కాలు పెట్టిందగ్గర నుండి.. . ఆఫీసు తాళం వేసే వరకూ .... యూనియన్ పనుల మీద తిరిగే అప్పారావు.... మీద చర్య తీసుకో వలసిందిగా అర్థిస్తూ ... ఛీఫ్ ఇంజనీరుకు వ్రాసిన ఉత్తరం

రెండవది....

"పాడయి పోయిన నాలుగు టైపు మిషన్లనూ. ..., తిరగని మూడు ఫేన్లనీ.... వెంటనే బాగు చేయించక పోతే ఆఫీసు పని స్తంభించి పోతుందని హెచ్చరిస్తూ..... ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరుకు వ్రాసిన ఉత్తరం.

మూడవది.. ..

"సప్లయి చేస్తున్న కాగితాలూ, కార్బనులూ బాగు లేక పోవడంతో టైపు మిషన్లు తరచూ పాడయి పోతున్నాయనీ.... వెంటనే కాగితాల క్వాలిటీ మార్చాలని అర్థిస్తూ స్టోర్సు ఆఫీసరుకు వ్రాసిన ఉత్తరం.

మూడు ఉత్తరాలు సంతకాలు పెట్టి.... డిస్పేచ్ చేసి వచ్చిం తర్వాత ఎంతో హాయిగా అనిపించింది సుబ్బారావుకి.

టైము చూసుకున్నాడు. సమంగా పన్నెండయింది. రోజూ మామూలుగా వచ్చే తలనొప్పి వచ్చి.... రంగనాథంగారిచ్చిన సలహాను మనసులో నిలిపింది.

'చూడు సుబ్బారావ్' తిలా దానం.. తలో పిడికెడూ అన్న ఆర్యోక్తి విన్నావా? నీవూ అదే పద్ధతి అవలంబించు. ఎంత బ్రతి మాలినా పని చేయని టైపిస్టులూ, ప్రతి కాగితాన్నీ అర్జంటు, అర్జంటు అంటూ గావు కేకలు పెట్టే ఆఫీసర్లూ.. ఈ ఇద్దరికీ మధ్య ఉండే నీలాంటి వాడికి తల నొప్పి రావడం సర్వ సామాన్యమైన విషయమే ఇలాటి పరిస్థితుల్లో, నీవు చేయు గలిగిందల్లా ఒక్కటే. నీ తల నొప్పిని... నీపై వారందరికీ సమంగా పంచి పెట్టేయ్"

ఆయన సలహా మేరకు తన సమస్యను ప్రస్తుతానికి మూడుగా విభజించి. ఉత్తరాల ద్వారా... తనను ప్రతి రోజూ వేధించే ముగ్గురు ఆఫీసర్లకూ సమానంగా పంచేశాడు సుబ్బారావు.

ప్రతి రోజూ సాయంకాల మయ్యే సరికి .. సాధారణంగా ఆ ముగ్గురి నుండీ వినిపించే సింహ గర్జనలు.... ఆరోజు వినిపించలేదు.

ఐదున్నరకు. ... ఆఫీసు తాళం వేసి .. ఇంటి ముఖం పట్టాడు సుబ్బారావు ఈలవేసుకుంటూ. □



సీరియల్

# ఒకటి ఒకటి మూడు

## తేజోవతి



(గత సంచిక తరువాయి)

లక్ష్మి పని చేస్తున్నదన్న మాటేగానీ మనసిక్కడ లేదు... ఆలోచనలన్నీ వాళ్ళిద్దరి చుట్టూనే తిరుగుతున్నాయి... డాక్టరమ్మగారు యింతదాకా ఎవరితోనూ యింత చనువుగా వుండటం తను చూడలేదు...

క్లోజ్‌ఫ్రెండ్ అన్నారు... వాళ్ళిద్దరి పరిచయం ఎలాంటిది?... ఏమో పెద్దవాళ్ళు. వాళ్ళ విషయాలు తను ఆలోచించకూడదు... పట్టించుకో-కూడదు...

లక్ష్మి ఆలోచనల్లోనే పని ముగించుకుని వచ్చి తన గదిలో పడుకోబోతుండగా వచ్చింది సుధగారు...

"లక్ష్మి... నా గదిలో శ్యామ్‌కు బెడ్ ఏర్పాటు చెయ్యి. ఆ పక్కనున్న స్పేర్‌కాట్ నాకిక్కడ వెసెయ్యి. ఈ రూమ్‌లో మనిద్దరం పడుకుందాం. ఎప్పుడూ ఎంత రాత్రయినా సరే నైట్‌స్టే చేసేవాడుకాదు. యీ రోజు వుంటానన్నాడు. ఆ బెడ్ ఏర్పాటు చేస్తావుకదూ..." అనేసి మళ్ళీ వెళ్ళిపోయిందావిడ.

లక్ష్మి చప్పున లేచి డాక్టరమ్మగారి పక్కమీద బెడ్‌షీట్స్ అవీ మార్చేసి అంతా అరేంజిచేసి వచ్చేసరికి అరగంటపైనే పట్టింది...

గంట పదకొండు కాబోతున్నప్పుడు లోపలికి వచ్చింది సుధా. "అమ్మా.... డాక్టరుగారు పడుకోబొయ్యేటప్పుడు పాలు తాగుతారేమోనని తీసిపెట్టి వుంచాను. యిచ్చివస్తారా అమ్మా."

అప్పుడే మంచంమీద వాలిన సుధగారు బద్ధకంగా ఆవులిస్తూ, "అబ్బ... యిప్పుడిక లేచే వోపిక లేదు లక్ష్మి... నువ్విచ్చి రారాదూ..." అన్నది...

"అహుఁ... వద్దులెండి... మీరిస్తే బాగుంటుంది."

"లక్ష్మి... నువ్వేం భయపడాల్సిన పన్లేదు... ఈ రోజు మూడ్ బాగులేక అలా మాట్లాడాడు గానీ అతడు చాలా మంచివాడు లక్ష్మి... యిచ్చేసిరా... ఏమనుకోడులే... నేను పంపానని చెప్పు."

తప్పనిసరిగా లేచింది లక్ష్మి...

అప్పటికి డాక్టరుగారింకా పడుకోలేదు... కిటికీ దగ్గరగా నిలబడి ఎటో చూస్తున్నాయన లక్ష్మి తలుపు మీద చప్పుడు చెయ్యడంతో తిరిగి చూశారు...

"పాలు... పడుకోబొయ్యేటప్పుడు తాగుతారని..."

ఆయన చిన్నగా నిట్టూర్చారు...

"పాలు యిదివరకు... బ్రతకాలనే ఆశ, బ్రతుకుమీద యిచ్ఛ వున్నప్పుడు తాగేవాడిని... యిప్పుడు నేను త్రాగేవి... మీ డాక్టరమ్మగారి ఫ్రిజ్‌లో దొరకవులే... తీసుకుపో ఈ పాలు... నాకక్కర్లేదు." అన్నారు...

"ఏమో నాకు తెలియదు. డాక్టరమ్మగారు యిచ్చిరమ్మన్నారు." అనేసి అక్కడ టీపాయ్ మీద పాలగ్లాసుపెట్టి తిరిగి వెళ్ళిపోయింది లక్ష్మి...

వెళ్ళిపోతున్న లక్ష్మివంకా, ఎదురుగా వున్న పాలగ్లాసు వంకా తదేకంగా అలా చూస్తూ నిలుచుండి పొయ్యారు శ్యామ్‌సుందర్ చాలాసేపు...

మర్నాడు ఆయన లేచి స్నానమదీ చేసి వచ్చేసరికి డైనింగ్ టేబిల్ దగ్గర వున్నది సుధా పరిమళ... డ్రెసప్ అయి రెడీగా కూడా వుంది...

"యామ్ అయి లేట్?" అంటూనే వచ్చి ఎదురుగా కూర్చున్నారు.

"ఫర్వాలేదులే... టయర్డ్‌గా వుండివుంటావనుకున్నాం... ముందు ఒక కప్పు కాఫీ తీసుకుంటావా..." అంటూనే, "లక్ష్మి... శ్యామ్‌కు కాఫీ పట్టుకురా..." అన్నది సుధా...

లక్ష్మికాఫీ తీసుకొచ్చి యిచ్చింది.

"థాంక్యూ." అంటూ చిరునవ్వుతో కాఫీ అందుకుంటున్న డాక్టరుగారి ముఖం ఈ రోజు చాలా ప్రసన్నంగా కనిపించింది... ముఖంలో నిన్నటి అలసట బదులు చిరునవ్వు కన్పడుతోంది...

లక్ష్మి తెల్లచీర, జాకెట్, చుట్టచుట్టిన తలకు వెయిల్. ఒక్క నిముషంపాటు అలా చూసి,

"మీ నర్సును యింట్లో కూడా యూనిఫాం వేసుకోమని యిన్‌సిస్ట్ చేస్తావా?." అన్నారు సుధగారి వైపు తిరిగి...

"డ్యూటీకి వెళ్ళబోతోందిగదా... అందుకని రెడీ అయింది... లక్ష్మి ఎందుకో యూనిఫాంనే ప్రిఫర్ చేస్తుంది ఎక్కువగా..." అని, "శ్యామ్ బ్రేక్ ఫాస్ట్ రెడీ అయింది... యిప్పుడు తీసుకుంటావా... యింకొంచెం సేపయ్యాక తీసుకుంటావా." అని అడిగింది .

"సుధా... ఎప్పుడైనా నా కభ్యంతరం లేదు కానీ... నీకు టైమయితే నువ్వెళ్ళిపోరాదూ నర్సింగ్ హోమ్‌కు?" అన్నారు...

"ఫర్వాలేదులే... యిద్దరం కలిసే వెళ్దాం... ఒకసారి రౌండ్స్‌కు వెళ్తే నువ్వు నర్సింగ్‌హోమ్ చూచినట్టు కూడా వుంటుంది... ఆ తర్వాత సెకండ్ ఫ్లోర్‌లో ప్రపోజ్‌డ్ ప్లాను కూడా చూపిస్తాను. నీ సజెషన్సు యివ్వచ్చు... ఆ తర్వాత కన్సల్టింగ్ రూమ్‌కు వెళదాం!!

జరిగిన కథ-1 డా. సుధాపరిమళ దగ్గర నర్సుగా పనిచేస్తుంటుంది లక్ష్మి. సుధా స్నేహితుడు డా. శ్యామసుందర్ సరదాగా గడుపుదామని అక్కడికి వస్తాడు. అతడు లక్ష్మిని చూసి 'సీతా' అని పిలుస్తాడు. తన పేరు సీత కాదని చెబుతుంది లక్ష్మి. తనకు ఎవరూ లేని లక్ష్మి డా. సుధ ఇంట్లోనే వుంటుంది. ఆ ఇంట్లో పనులన్నీ ఆమే చేస్తుంటుంది డా. సుధకు ఇంకా పెళ్ళికాలేదు. శ్యామసుందర్‌గారి మొదటి భార్య ఆత్మహత్య చేసుకుంటుంది. రెండవ భార్య లేచిపోయింది.

"నీ యిష్టం." అంటుండగానే వేడి వేడి పెసరట్టు వుప్మా యిద్దరికీ ప్లేట్లలో పెట్టి తీసుకువచ్చింది లక్ష్మి...

అది చూసి నవ్వుతూ, "నాగెస్ హండ్రెడ్ పర్సెంటు కరెక్ట్ అయింది." అన్నారు దానిని తినడాని కుపక్రమిస్తూ.

"గెస్ ఏమిటి?"

"యిదే... యీ రోజు నాకిష్టమైన పెసరట్టు వుప్మా వుంటుందని... అయినా నాకిది యిష్టమని నువ్వెలా గెస్ చేశావు?"

"నేనా!... నేనేం గెస్ చెయ్యలేదు... ఎవరన్నా విజిటర్సు వస్తే లక్ష్మి యిలా ఏదన్నా స్పెషల్ బ్రేక్‌ఫాస్ట్ చేస్తుంది."

"సో .. అయిమస్ట్ థాంక్ లక్ష్మి." అంటుండగా వేడివేడి దోసె యింకోటి తీసుకు వచ్చింది లక్ష్మి...

"థాంక్యూ లక్ష్మి... నాకిష్టమైన టిఫిను చేసినందుకు." నవ్వుతూ అన్నారు.. లక్ష్మి జవాబు చెప్పేలోపల సుధ అడిగింది...

"అవునూ. నీ నర్సింగ్‌హోమ్‌ను ఏమన్నా ఎక్స్‌టెండ్ చేశావా?."

"లేదు."

"ఎందుకని?. . ప్రాక్టీసు బాగా వుందని విన్నానే."

"వుంటే వుండచ్చు... కానీ నర్సింగ్ హోమ్ ఎక్స్‌టెన్షను అంటే యింకా కష్టం కదా... ఎవరికోసం కష్టపడాలి... ఎవరికోసం సంపాయించాలి? .. భార్యపిల్లలూ లేని వాడివి.. ఆర్జించి ఎవరికి పెట్టాలి... ఏదో పేషెంట్లు వస్తున్నారు కనుక ట్రీట్ చేస్తున్నాను. వాళ్ళేదో యిస్తుంటారు... గడిచి-పోతోంది."

"సన్యాసిలా మాట్లాడతావేం?... మళ్ళీ పెళ్ళి చేసుకోకూడదా?"

"ఒక విధంగా సన్యాసినే... మళ్ళీ పెళ్ళిచేసుకునే వుద్దేశం లేదు. ఎందుకని అడక్కు... మళ్ళీ నీ కభ్యంతరకరమైన భాష వుపయోగించాల్సి వస్తుంది."

"ఓ. కే. ఓ కే... వొప్పుకున్నాం... చెప్పద్దులే..." అంటూనే," అవునూ శారద ఆత్మహత్య చేసుకుందని విన్నానే.. ఎందుకలా చేసింది."

ఆయన చిన్నగా నిట్టూర్చారు..

"ఎందుకని అంటే నేనేమి చెప్పలేను... కొంతమంది కొన్ని పరిస్థితులను తట్టుకోగలరు . కొంతమంది తట్టుకోలేరు.. వాళ్ళు దానికి ఆత్మహత్య పరిష్కారమనుకుంటారు... ఏం చెప్పగలం?'

"భర్త్గా నువ్వు ఆమెకేమి తక్కువ చెయ్యలేదని నాకు తెలుసు మరలాంటప్పుడు అంతగా తట్టుకోలేని పరిస్థితులే మొచ్చి వుంటాయి. ."

డాక్టరుగారు లక్ష్మితెచ్చి పెట్టిన మరో దోసెను తుంపుకుంటూ, "సుధా. సహజంగా అత్తా కోడళ్ళ మధ్య ఘర్షణ ఎందుకొస్తుందంటావ్?." అని అడిగారు.

"ఎందుకేమిటి... కారణాలు చాలా వుండచ్చు! వుదాహరణకు, అత్తాకోడళ్ళల్లో ఒకళ్ళు డామినేటింగ్ థిప్ అయి తన పెత్తనం చలాయించాలని, అధికారం సాగించాలనీ అనుకుంటే దానికి అవతల వాళ్ళు అడ్డం వస్తున్నారని అనిపిస్తే ఘర్షణ వస్తుంది. .

లేదా తల్లి కొడుకుమీద ఆర్థికంగా డిపెండ్ అయివుంటే కోడలు వునికి తన ఫైనాన్షియల్ సెక్యూరిటీకి భంగం కల్గిస్తుందని అనిపించినప్పుడే తగాదా రావచ్చు

లేకపోతే తల్లీ భార్యా యిద్దరూ అతడ్ని అమితంగా ప్రేమించి ఆ ప్రేమను షేర్ చేసుకోడానికి యిష్టపడకపోయినా యిద్దరికీ పడకపోవచ్చు..

లేదా తను జీవితంలో ఏ సుఖమూ అనుభవించలేదనుకో, ఆ సుఖాలు తన



# ఒకటి ఒకటి మూడు

కోడలు ఎందుకు అనుభవించాలనే యీర్ష్యతో ఆ కోడలి పట్ల ద్వేషం పెంచుకోవచ్చు...

లేదా ఎన్నో అణగారిన కోర్కెలు అయిమీన్ సప్రెస్ట్ డిజైర్స్. అన్‌సాటిస్ ఫైడ్ అండ్ అన్‌ఫుల్ ఫిక్స్ట్ డిజైర్స్ యివన్నీ కూడా మనిషిలోని మానవత్వాన్ని చంపేసి పొద్దుగూకులూ సాధిస్తూనో వేధిస్తూనో వున్నా యిద్దరికీ పోట్లాటలు రావచ్చు...

వెల్ ఎన్నని చెబుతాం... అలాగే కోడళ్లల్లో కూడా అహంభావం, తమ మాటే నెగ్గాలనే పంతం, అత్తగారి పట్ల చిన్నచూపు యిలాంటివి వున్నా అగ్గి అంటుకోడానికి అట్టేకాలం పట్టదు...

ఇంతకూ నా ప్రశ్నకు జవాబు చెప్పకుండా ఏదో అడుగుతావేం."

శ్యామసుందర్‌గారు చిన్నగా నవ్వారు...

"నీ ప్రశ్నకు జవాబు నా ప్రశ్నలోనే వుందేమో...

"అంటే వాళ్లిద్దరికీ సరిపడకనా... అయినా నువ్వంతదూరం ఎందుకు రానిచ్చావు.?" అని ఏదో అనబోతుంటే, ఆయన ఫకాలున నవ్వాడు...

"ఎందుకు నవ్వుతావ్?"

"ఏం లేదు సుధా... నేను పర్సనల్ ప్రాబ్లమ్స్ మరిచిపోదామని యిలా రెండురోజులొచ్చాను... అవన్నీ యిప్పుడు తల్చుకోడం అవసరమంటావా?." అన్నారు.

"అయామ్ సారి శ్యామ్... వెరిసారి. బ్రేక్‌ఫాస్ట్ అయితే వెళ్దాం రా." అంటూ లేచింది డాక్టర్ సుధ.

లక్ష్మి డ్యూటీకి వెళ్లిపోయింది... తన రొటీన్ వర్క్ టెంపరేచర్ నోట్ చెయ్యడం వగైరాలు అయ్యాక లేబర్ రూమ్ దగ్గరకు వెళ్తుండగా యిద్దరు నర్సులు మాట్లాడుకోడం విన్పించింది...

"డాక్టరమ్మగారి ఫ్రెండెవరో వచ్చారటగా నిన్న?." అది నర్సు భారతి గొంతు...

"అవునట... రాత్రి వాళ్లింటోనే పడుకున్నారట కూడా." అది ఆదెమ్మ స్వరం...

సహజంగా లక్ష్మి ముందు ఎవ్వరూ డాక్టరుగారి మీద ఎలాంటి కామెంట్స్ చెయ్యరు... చేసినా తను విననట్టు వెళ్లిపోతుంది... ఈ రోజు ఆ అమ్మాయి కాళ్ళు సంకెళ్ళు పడ్డట్టు ఆగిపొయ్యాయి.

"డాక్టరమ్మగారు యివ్వాళ చాలా హుషారుగా కూడా వున్నారు." లక్ష్మి యిక అక్కడనుండి చప్పున వెళ్లిపోయింది...

మానవనైజం... యిదుగో తోక అంటే అదుగో పులి అంటుంది. రాత్రి ఆమె తన గదిలో తనతో బాటు పడుకున్నారు... కానీ యీ గుడ్డి సమాజం నమ్మేదెలా...

కానీ రాత్రి ఆమె గదిలోకి వచ్చేసరికి ఏడ్చినట్టు కళ్ళువాచి వున్నయి... తలుపులువేసివున్నయి.., వాళ్ళు మాట్లాడుకున్నది వినబడలేదు కానీ వాళ్లిద్దరికీ ఏదో విషయం మీద వాదోపవాదం జరుగుతున్నట్లు మాత్రం గమనించింది... అయితే యీ వుదయం నిజంగానే ఆవిడ సంతోషంగా కన్పిస్తోంది... అలాగే డాక్టరుగారు కూడా...

నిజంగానే వాళ్లిద్దరకూ ఏమన్నా సంబంధం వుందా?...

వాళ్లస్నేహం... వాళ్ల పరిచయం ఎలాంటిది?...

ఎటో ఎటో పోతున్న ఆలోచనల్లోంచి సడన్‌గా తెలివి వచ్చినట్లు వులిక్కిపడింది లక్ష్మి.... తనకేమయింది యీ రోజు?... వాళ్ళు పెద్ద వాళ్ళు... తను ఆలోచించకూడదు...

చిన్నగా నిట్టూర్చి తనను తాను సంబాళించుకున్నది... రూమ్‌లోకి వెళ్లింది... అది ప్రీవీ కేసు. పెరినియల్ టిష్యూస్ లాసిరేషన్సు వుండచ్చు... ఎ. పి. సియాటమి చేయాల్సి వస్తుందేమోననిపిస్తోంది. డాక్టరుగారికి చెప్పాలి" అనుకుంటూ లక్ష్మి సిజర్స్, నీడిల్స్, నీడిల్ హోల్డర్, సూచర్‌మెటీరియల్ తీసి పెడుతుండగా నర్సుమేరి వచ్చింది...

"డాక్టరమ్మగారు నిన్ను పిలుస్తున్నారు. టిబ్రేసుమీద వున్నారు." అని



చెప్పింది

లక్ష్మికి వాళ్ళిద్దరూ మాట్లాడుకునేటప్పుడు వెళ్ళడం యిష్టం వుండదు... అందుకే అయిష్టంగానే పైకి వెళ్ళి మెట్ల చివరనే నిలబడిపోయింది... అటు చివరగా నిలబడి వున్నారు డాక్టరుగారు. అక్కడే నిలబడిపోయింది లక్ష్మి

తెల్లటి ఫుల్‌స్లీవ్స్ షర్టు టక్‌చేసి ఆయన వయసుకంటే పది సంవత్సరాలు చిన్నగా కన్పడుతున్నారు. ఆ ముఖంలో నిన్నటి అలసట, విసుగూ, కోపం ఏమీలేవు.. ప్రశాంతంగా వున్నారు . పైగా యిద్దరూ ఏదో చెప్పుకుని నవ్వుకుంటున్నారు లక్ష్మికి అక్కడ నిలబడ్డం చాలా మొహమాటంగా వున్నది... అక్కడ నిలబడచ్చో కూడదో తెలియదు.. తటాపటా యిస్తూనే పైకి వెళ్ళి తలుపు దగ్గరగా నిలబడింది చేతులు కట్టుకుని పిట్ట గోడ కానుకుని కొంచెం వొరిగినట్లుగా నిలబడి వున్న ఆయన్ను అలా చూడాలనిపిస్తోంది లక్ష్మికి . ఒక్క క్షణం ఆగి అలా నిలబడ్డం బాగుండదనిపించి చిన్నగా దగ్గింది.

లక్ష్మిని ముందుగా చూసింది డాక్టరుగారే ఆయన చెప్పడంతో తిరిగి చూసిన సుధగారు గబగబా లక్ష్మి నిలుచున్నచోటికి వచ్చారు..

లక్ష్మి ప్రీవి కేసును గురించి చెప్పింది

"నే వెళ్తున్నానులే . చూసుకుంటాను .. కానీ శ్యామ్ యీపూట వెళ్ళిపోతాడనుకున్నాను లక్ష్మి.. కానీ అతడేమీ అనలేదు. బహుశా యీ పూట కూడా వుంటాడేమో భోజనం ఏర్పాటు చూడాలి . " అన్నది సుధగారు ..

అప్పటినుండి నా దగ్గరే వుంటున్నది..."

ఈ లోపల నెయ్యి తేవడానికి లక్ష్మి వంటింట్లోకి వెళ్ళగానే నెమ్మదిగా అడిగారు డాక్టరుగారు...

"ఎంత పే చేస్తున్నావ్?"

"తను పేమెంట్ యింత కావాలని అడగలేదు . ఎవ్వరూ లేరట .. యింట్లో వుండనిస్తే చాలని అడిగింది.". నేనే ఏటా ఓ రెండువేలు తన పేర క్రెడిట్ చేస్తుంటాను."

ఈ లోపల లక్ష్మి రావడంతో సంభాషణ ఆగిపోయింది... కొంచెంసేపు మౌనంగా భోజనం చేశారు యిద్దరూ...

"సుధా.. నేనొకటి అడుగుతాను. నువ్వుకాదు అననంటే అడుగుతాను." అన్నారు లక్ష్మిపెట్టిన గులాబ్ జామ్ తింటూ ..

"శ్యామ్. . నువ్వు అడగాలే కానీ... నేను లేదంటానా!. భలేవాడివే అడుగు ఏం కావాలో..."

"నో అనకుండా "

"అబ్బ.. " నో" అనకుండానే. . చెప్పు ఏం కావాలో "

"'ఏది' అడిగినా యిస్తావుగా?"

"యూ సిల్లీ .." 'ఏది' అన్నమాట పలికిన తీరుకు నవ్వుతూ మందలించి, "అభ్యంతరకరమైనది అడగవని తెల్సుగా " అన్నది.






"ఫర్వాలేదమ్మా . వెళ్ళిపోతారని మీరు చెప్పలేదు కనుక ఆయనక్కూడా వండేశాను. మరేం కంగారు పడాల్సిన పనిలేదు " అన్నది లక్ష్మి .

"కాదు లక్ష్మి. నిన్న కూడా ఏమీ స్పెషల్సు లేకుండా హడావుడిగా ఏదో చేసిపెట్టాం.. యీపూట ఏదన్నా స్వీటూ హాటూ చెయ్యాలి "

"మరి .. లేబర్ రూమ్‌లో?" నసిగింది లక్ష్మి ..

"ఏం ఫర్వాలేదు. . మేరీకి చెప్పాను. . చూసుకుంటుందిలే నువ్వెళ్ళి ఏదో ఒకటి చెయ్యడమో లేక. బజారు వెళ్ళి స్వీట్ షాపులో తీసుకొచ్చినా సరే... "

"మళ్ళీ బజారుకెందుకు లెండి .. వెళ్ళి చేసేస్తాను " అని దిగివచ్చింది లక్ష్మి..

సుధా, శ్యామ్‌సుందర్‌గార్లు ఒంటిగంట దాటింతర్వాత వచ్చారు భోజనానికి .

టేబిల్‌మీద అంతా సర్ది వాళ్ళరాకకోసం చూస్తున్న లక్ష్మిని చూడగానే, 'తను నీకు మంచి ఎస్సెట్ అనుకుంటాను" అన్నారు.

"అవును . చెప్పానుగా నాకంపానియన్ అని. . లేకపోతే ఒక్కరోజు గడవదు. "

"అంత డిపెండెన్సు మంచిదికాదు... యింతకూ ఏం చదువుకున్నది లక్ష్మి?." అక్కడే వున్నా ఆ అమ్మాయి వునికి గమనించనట్లే అడిగారు శ్యామసుందర్..

"మెట్రిక్ పాసయింది. . మా అంకుల్ దగ్గర అప్పుడే చేరింది... చెప్పానుగదా ఆయన పోయిన తర్వాత యీ నర్సింగ్‌హోమ్ నేను తీసుకున్నానని,

'అదుగో ముందర కాళ్ళకు బంధం వెయ్యకు '

లక్ష్మికి ఆ సంభాషణ వింటూ అక్కడ నిల్చోడం చాలా యిబ్బందిగా వుంది .. ఏదో సాకు చెప్పి వెళదాం అంటే డాక్టరుగారు గులాబ్‌జామ్ యింకొకటి వెయ్యమన్నట్లు చూశారు..

లక్ష్మి వడ్డిస్తుండగా అడిగారాయన. .

"లక్ష్మిని నాతో పంపించు."

ఉలిక్కి పడింది లక్ష్మి.. ఆశ్చర్యంగా చూసింది సుధా .

"శ్యామ్?!." అన్నది. అతడేనా యిలా అడగడం అన్నట్లు. . "నా యింట్లో యిలా వండిపెట్టడానికి కాదులే.. నర్సింగ్ హోమ్‌లో పనిచెయ్యడానికి... అఫ్‌కోర్సు వండి పెడితే కమ్మగా తినడానికి అభ్యంతరం లేదుగానీ .. అందుకు మాత్రం పంపమని అడగటంలేదు.'

"తానే ., ఎందుకు శ్యామ్?. నీ దగ్గర చాలా మంది బాగా ఎక్స్‌పీరియన్సుడు స్టాఫ్ వుండాలిగా!"

సుధగారు యింకా ఆశ్చర్యంనుండీ తేరుకోనే లేదు "వున్నారు. . అంతా మెన్. అయితే సిజేరియన్ కానీ డెలివరి కేసెస్‌గానీ నేనే చెయ్యాలని పట్టుబట్టే పేషెంట్సు వున్నారు కొంత మంది

వాళ్ళు ఫామిలీ వాళ్ళను మా నర్సింగ్ హోమ్‌కే తెస్తారు . కానీ మానవ స్వభావం ఏమిటంటే డాక్టరు మగవాడని తెలిసినా పక్కన ఫిమేల్ నర్సు

# ఒకటి ఒకటి మూడు

నిలబడితే అదో తృప్తి ఆడవాళ్ళకు "

"కానీ శ్యామ్ . తను నాకు ఎంత అవసరమో చూశావుగా. ."

"అబ్బ. నా మాట సొంతం విను నేను ఎప్పటికీ అడగటంలేదు. . జస్ట్‌ఫర్ టూమన్త్స్. ఆ తర్వాత మీ కంపానియన్‌ను జాగ్రత్తగా పువ్వుల్లోపెట్టి తీసుకొచ్చి అప్పగిస్తాను సరేనా "

"లేదు శ్యామ్ ప్లీజ్..."

సుధగారు బ్రతిమలాడుతున్నట్టు అన్నారు .

"సుధా... పెద్ద ఫ్రెండని తెగ కబుర్లు చెప్పావు... షార్ట్ ఆఫ్ హాండ్స్ ఒక్క నర్సుని జస్ట్ రెండునెలలు అడిగితే యివ్వలేదు ఎట్‌లీస్ట్ హ్యూమానిటేరియన్ గ్రౌండ్స్ మీదనన్నా యివ్వచ్చు. "

"హ్యూమానిటేరియన్ గ్రౌండ్స్ ఏంటి?"

"అవును.. నా దగ్గర ఆల్‌రెడీ ఒక నర్సు వుంది... ఆ అమ్మాయి యిప్పుడే ఎక్స్‌పెక్టింగ్ .. ఫుల్‌మన్త్స్ వర్క్ చెయ్యలేకుండా వున్నాను... రెండునెలలు సెలవు కావాలని అడిగింది.. హాండ్స్ లేక నేను పాపం ఆ అమ్మాయినే యిబ్బంది పెడుతున్నాను..

నువ్వు లక్ష్మిని పంపితే నేను పాపం ఆ అమ్మాయికి మచ్ నీడెడ్ సెలవ యిచ్చి పంపిస్తాను."

"శ్యామ్. . నామాట విన్పించుకోవేం.. నన్నొదిలి వెళ్ళడానికి లక్ష్మి వొప్పుకుంటుందనుకుంటున్నావా. తను నాకు చాలా అటాచ్‌డ్.. " అంటున్న సుధగారి మాటలకు అడ్డంవచ్చి, "సుధా . నిజంగా నువ్వు గనుక వెళ్ళి రెండు నెలలు హెల్ప్ చేసిరా అంటే లక్ష్మి కాదనదని నాకు తెలుసు... నిన్నటినుంచే చూస్తున్నానుగదా " అంటూనే కంచంలో చెయ్యి కడిగేసుకుని లేచారు డాక్టరుగారు.

ఆయన అంతసేపు కూడా లక్ష్మి వైపు అసలు చూడలేదు. వడ్డించమనీ అడగలేదు...

అంతదాకానిర్ఘాంతపోయినిల్చున్నలక్ష్మిఆయనఅర్ధాంతరంగాపెరుగు పోసుకోకుండా లేచి వెళ్ళిపోవడం చూశాక-

"మ...మజ్జిగ పోసుకోలేదు . " అన్నది వణికే గొంతుతో ..

"అభ్యంతరం లేకపోతే ఒక్క కప్పు పెరుగులో షుగర్‌వేసి తెచ్చివ్వు " అనేసి లివింగ్ రూమ్‌లో కెళ్ళి కూర్చున్నారు..

ఆ మధ్యాహ్నమంతా సుధ అతడ్ని కన్‌విన్స్ చెయ్యడానికి ప్రయత్నిస్తూనే వుంది... ఏమని చెప్పినా ఒకటేమాట ..

"అయివాంట్ హర్ సర్వీసెస్ జస్ట్ ఫర్ టూమన్త్స్ కాంట్ యూ డూదట్. .లెండ్‌హర్‌సర్వీసెస్‌ఫర్‌టూమన్త్స్?. ."

ఆ రోజు సాయంత్రం నర్సింగ్ హోమ్‌కు వెళ్ళేటప్పటిక్కూడా ఏ విషయం తేలలేదు .

' లక్ష్మి యిష్టపడడంలేదు అంటే నువ్వు చెబితే వెళ్ళననదు . నాకు తెలుసు. యిదేమాట

అతడి మొండి పట్టుదల చూసి చివరికి సాయంత్రం ఏడుగంటల ప్రాంతంలో లక్ష్మితో మాట్లాడి వొప్పించి చివరికి సరేనన్నది సుధగారు

'అయితే ఒక మాట... తనను ఎక్కడ వుంచుతావ్? యిక్కడలాగా మీ యింట్లో వుండడానికి యిష్టపడటం లేదు తను.'

"అయితే మా నర్సింగ్ హోమ్‌లోనే వుండచ్చు యిదివరకు అంటే మొదట్లో నేను కాస్త రెస్ట్ తీసుకోడానికి, అసిస్టెంట్సు కూర్చోడానికి వాడే గది... యిప్పుడది ఖాళీగానే వుంది అందులో వుండచ్చు అయివిల్ లుక్ ఆఫ్టర్ హర్ డోంట్ వర్రీ . '

అబ్బ . నీపంతమే నీది వినవుగదా సరే తీసుకెళ్ళు'

'అయితే త్వరగా తన లగేజి సర్దుకోమను . యీ రాత్రికే బయలుదేరాలి '

'అదేంటి శ్యామ్ యిప్పటికిప్పుడంటే ఎలాగవుతుంది?.'

"ఏమో . ఒకగంటలో సర్దుకోలేనన్ని బట్టలు లక్ష్మికున్నాయంటే నేను నమ్మను నిన్నటినుండి ఆ యూనిఫాంలోనే కనబడుతోంది. , రాత్రి పాలు తీసుకొచ్చినప్పుడు మాత్రమే మామూలు చీరలో చూశాను తనని "

'కాదులే శ్యామ్ యీ ఒక్కరోజు వుండిపో . రేపెళ్ళచ్చు '

"అయామ్ సారి రేపుదయం ఏడున్నరకల్లా మా వూర్లో వుండాలి. హెర్నియా ఆపరేషను అతడు నెల్లూరునుండి వచ్చి వుంటాడు రాత్రి ఎనిమిదికల్లా బయలుదేరుతాం వంట కాకపోయినా ఫర్వాలేదు ఎక్కడో క్కడ హోటల్లో తినచ్చు. . తనను వెంటనే సర్దుకోమను

సుధగారు యిక ఏమీ చెప్పలేకపోయింది

'ఆఁ బైదిబై నా స్టాఫ్ యూనిఫాం వేసుకోవాలని నేను యిన్‌సిస్ట్ చెయ్యను. . వాళ్ళు క్లీన్‌గా నీట్‌గా వుంటే చాలు.. అందుకని ఆ తెల్లచీరలన్నీ యిక్కడే వదిలేసి సర్దుకోమను " అని చెప్పారు

సరిగ్గా ఎనిమిది గంటల్లా బయలుదేరారు యిద్దరూ . లక్ష్మి తన బట్టలు సర్దుకోడమే కాక డాక్టరమ్మగారికి ఏవి ఎక్కడవున్నాయో అన్నీ అప్పచెప్పడంతో వంట చెయ్యడానికి వీలుకాలేదు.

లక్ష్మి సూట్‌కేసును లోపల పెడుతున్న శ్యామ్‌సుందర్‌గారితో అన్నది సుధాపరిమళ

"శ్యామ్ పేరుకు తను నాదగ్గర నర్సు... కానీ నేనెప్పుడూ నా సొంత చెల్లెల్లా చూసుకున్నాను తనను .. లక్ష్మి నొచ్చుకునే విధంగా ప్రవర్తించవు. కదూ?! ' నీళ్ళు నిండిన కళ్ళతో అడిగింది

శ్యామసుందర్ నవ్వారు...

"అందరి మనసులూ నొచ్చుకునే విధంగా ప్రవర్తించే దుర్మార్గుడిని నేనే కదూ .'

సుధ యిక మాట్లాడ లేదు. మౌనంగానే లక్ష్మిరాగానే బాక్ డోర్ తెరిచి పట్టుకున్నారు శ్యామసుందర్‌గారు...

కారు బయలు దేరింది

మౌనంగానే డ్రైవ్ చేస్తున్నారు శ్యామసుందర్‌గారు

ఊరు దాటి మెయిన్ రోడ్డుమీద మెత్తగా సాగిపోతోంది కారు . ఆలోచనల్లో వున్న లక్ష్మి ఎంత దూరం వచ్చారో కూడా గమనించలేదు

ఆయన ఒక హోటలు ముందు కారాపినప్పుడు ఆలోచనల్లోంచి బయటపడింది లక్ష్మి . డోరు తెరిచి పట్టుకున్న డాక్టరుగారితో,

"ఏమిటి?. ఏమైంది?" అన్నది కంగారుగా.

"ఏం కాలేదు. యిక్కడ చిన్న హోటలుంది .. భోజనం చేద్దాం రా!" అన్నారు.

లక్ష్మికి భోజనం ఆర్డరిచ్చినా ఆయన మాత్రం భోజనం చేస్తే నిద్ర వస్తుందని లైట్‌గా టిఫిన్ తీసుకుని కాఫీ తాగారు.....

మళ్ళీ వచ్చి బాక్ డోర్ తెరుస్తున్న లక్ష్మితో,

"ఆ డోర్స్ లాక్ చేశాను ... ఫ్రంట్ సీట్‌లో కూర్చో" అన్నారు. సందేహిస్తూ నిలబడి పోయిన లక్ష్మితో అన్నారు.



## అతనికి వడ్డించే ఆ పళ్ళెంలో
## ఇల్లాలి అనురాగంతోపాటూ
## మా నాణ్యతనూ కలుపుతాం.



సేలం స్టీల్‌లో మేము కంటికి కనిపించేదానికన్నా మరెంతో పళ్ళెంలో ఉందని విశ్వసించేవాళ్ళం అందుకే మేం ఎంచుకునేవన్నీ —అది సాంకేతిక విజ్ఞానం అయినా సరే, ముడిపదార్థమైనా సరే—ఉన్నత ప్రమాణాల్లో ఉండాలని కోరి, ప్రయాసపడి, ప్రపంచంలోనే ఉత్కృష్టమైనది ఎంచుకుంటాం అలాగే తయారీలోకూడా అడుగడుగునా ప్రతి చిన్న విషయాన్నీ ఎంతో శ్రద్ధతో పరిశీలిస్తాం నిరంతరం అత్యున్నతమైన నాణ్యతగల వస్తువుల ఉత్పత్తే మా ధ్యేయం మా దృష్టిలో 'పళ్ళెం' అంటే కేవలం పళ్ళెం మాత్రమే కాదు మా సంస్థ తత్వానికి, అభిరుచికి ప్రతీక. మాకు మీపై ఉన్న శ్రద్ధాసక్తులకు ఋజువు




**సేలం స్టీల్ కర్మాగారం**
సేలం-636 013, తమిళనాడు
స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్
భారత ప్రభుత్వ సంస్థ

## సేలం స్టెయిన్‌లెస్.
## దీనినే కోరుకోండి. ఎందుకంటే దీనికి మించినది దొరకటం అసాధ్యం.

Sista's - SSP 558 86 TE C

# ఒకటి ఒకటి మూడు

"రాత్రిళ్ళు డ్రైవ్ చేస్తుంటే నిద్ర వస్తుందని భయం. పక్కన మనిషి మెళుకువతో వుంటే నిద్రరాదు  నిద్రలో ఏ చెట్టుకో గుద్దేశాననుకో.... యిద్దరం' కలిసి కారులో నే సమాధయి పోతామని భయం...

నా సంగతెట్లా అయినా ఫర్వాలేదు.... ఛస్తే బాధపడే 'వాళ్ళు కూడా లేనివాడిని. .. నీకేదయినా అయితే సుధకు జవాబు చెప్పుకోవాలిగా."

లక్ష్మి మారుమాట్లాడకుండా పక్క డోరు తెరిచి ఫ్రంట్ సీట్‌లో నే ఎక్కింది ... కారు స్టార్ట్ చెయ్యబోతూ ఎడం చేత్తో, లక్ష్మి కూర్చున్న వైపు కారు డోరు తెరిచి వేస్తుంటే లక్ష్మి ఒక్కసారిగా వులిక్కిపడింది.... శరీరం పులకరించినట్లయి వెనక్కి వొదిగిన లక్ష్మితో,

"అంత వులిక్కి పడ్డావేం?.... డోరు కొంచెం లూజుగా వున్నట్లు' అనుమానం. కొంచెం చెక్ చేసుకోడం మంచిది కదాని... " అన్నారు

లక్ష్మి సర్దుకుని బాగా వొదిగి కూర్చుంది.... డాక్టరుగారు పాంటు జేబులోంచి సిగరెట్ పాకెట్ తీశారు.... ఒక సిగరెట్ తీసి తాపీగా వెలిగించుకుని ఆ తర్వాత నెమ్మదిగా కారు స్టార్టు చేశారు మళ్ళీ....

అప్పుడే భోజనం చేసిన లక్ష్మికి ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు గానీ కారు ఒక జర్క్ యిచ్చినట్లయితే కళ్ళు తెరిచింది....

కారు ఆపేసి నవ్వుతూ మొఖంలోకి పరిశీలనగా చూస్తున్నారు డాక్టరు గారు... కారులో లైటు వెలుగుతోంది.... తన తల ఆయన గుండెల మీద.... భుజాల మీద ఆయన చెయ్యి బరువుగా...

లక్ష్మి అదిరిపడి లేచి కూర్చుంది.... నవ్వుతూ మొఖంలోకి చూస్తున్న డాక్టరు గారితో,

"నేను . నేను.... వెనకసీటుకు వెళ్ళిపోతాను.. ." అన్నది కంగారుగా ...

"ఫర్వాలేదు.  అందమైన ఆడపిల్ల బరువు భుజంమీద ఆనివుంటే ఎంత రాత్రివేళ కూడా నిద్ర రాదని యీ రోజే తెల్సింది.. . కాబట్టి ధైర్యంగా కూర్చోవచ్చు." -

"అహఁ .. కాదు... నేను వెనక్కి వెళతాను.... తెల్లవారు జామున లేవడంతో బాగా నిద్ర వచ్చేసింది.." అంటూనే డోరు తెరవబోతున్న లక్ష్మి చేతిమీద తన చెయ్యి వేసి ఆపేసి,

"నీకంత నిద్రగా వుంటే యిక్కడెక్కడయినా వూర్లో హోటలుకు వెళ్దాం... గది తీసుకోవచ్చు.... అక్కడి నుండి ఫోను చేస్తాను రేపటి అపరేషను పోస్టుపోను చెయ్యమని...." అని కొంచెం ఆగి నెమ్మదిగా అన్నారు....

"కానీ ... యీ వేళప్పుడు రెండు గదులు దొరకడం కష్టం ఏ హోటల్లో అయినా.. ఒక్క రూమ్‌లో సర్దుకోడానికి నీ కభ్యంతరం లేకపోతే.. ."

డోర్ నాబ్‌మీద నుండి చప్పున తన చెయ్యి తీసేస్తూ, ఆ సీట్లోనే బాగా వెనక్కువాలి, "వద్దు, వెళ్ళి పోదాం." అంది లక్ష్మి...

నెమ్మదిగా తన చెయ్యి వెనక్కు తీసుకుని సిగరెట్ వెలిగించు కున్నారు. ఒకటి రెండు దమ్ములు పీల్చిన తర్వాత ఆ పొగ రింగులు రింగులుగా వదులుతూ,

"లక్ష్మి.... ఒకటడగనా?" అన్నారు.

లైటు వెలుతురులో వాచి చూసుకుంటే గంట పన్నెండు కావస్తోంది.... ఈ అర్ధ రాత్రి సమయంలో నిర్జీవంగా వున్న యీ ప్రదేశంలో ఆయనకు వచ్చిన సందేహ మేమిటో తెలియక పూర్తిగా డోరు పక్కకు వాలిపోయి, "అడగండి" అన్నది.

"ఏం.... లేదు... నేను నిన్ను చూడగానే "సీతా" అని పిల్చాను గుర్తుందా?"

గుర్తుందని తలాడించింది లక్ష్మి. .

"అయితే.... ఆ సీత ఎవరని నువ్వు అడగడం కానీ.... మీ డాక్టరమ్మగారి చేత. అడిగించడం గానీ చెయ్యలేదంటే నా కాశ్చర్యంగా వుంది.... ఇంతకూ ఆ విషయం మీ డాక్టరమ్మతో చెప్పావా?"

లేదన్నట్లు మళ్ళీ తల అడ్డంగా తిప్పింది.

"తనను మరో పేరుతో ఒక వ్యక్తి పిలవడం ... మరో వ్యక్తిగా భావించడం.... అందరికీ చాలా కుతూహలం కల్గించే విషయం.... ఆ వ్యక్తి ఎవరో తెలుసుకోవాలనుకోడం చాలా సహజమైన ఆసక్తి . మరి నీకు తెలుసుకోవాలని ఎందుకనిపించ లేదో .. "

ఒక్క క్షణం ఆగి లక్ష్మి అన్నది....

"మీరు పేరు ప్రఖ్యాతు లున్న పెద్ద డాక్టరు, . నేను మీకు చాలా క్లోజ్ ఫ్రెండ్ అయిన ఒక డాక్టరమ్మగారి దగ్గర మామూలు నర్సును.. అంతరాలు తెలుసుకోకుండా చనువు తీసుకో కూడదని, నా స్థానం ఏమిటో గుర్తు పెట్టుకుని ప్రవర్తించాలని నాకు జీవితం నేర్పిన పాఠాలు...

అందుకని మీరు సీత అన్నా గీత అన్నా .. నేను కాదని చెప్పుకోడం దాకానే నా హద్దు

మీరు సీత ఎవరో చెబితే వినడానికి నా కభ్యంతరం లేదు కానీ అడిగే అర్హత మాత్రం లేదని నాకు తెలుసు."

డాక్టరుగారు ఒక్కసారి మండుతున్న కళ్ళతో ఆ అమ్మాయి వైపు చూశారు. చేతిలో సిగరెట్ బయటకు విసిరి కొట్టి కార్లో లైటును ఆఫ్‌చేసి విసురుగా కారు స్టార్ట్ చేశారు...

కారు బయలు దేరింది ... ఎవరి ఆలో చనల్లో వాళ్ళు పడిపొయ్యారు.

అయితే సీత ఎవరు?

ఈ ప్రశ్న ఆ నిశీధి సమయంలో పెదవులు దాటక పోయినా మనసులో మెదలక పోదు...

అయితే ఆ ప్రశ్నకు సమాధానం కావాలంటే అయిదు సంవత్సరాలు వెనక్కి వెళ్ళాలి. .

అలా వెళ్ళితే ప్రతి సంఘటన, ప్రతి పలుకూ కళ్ళకు కట్టినట్టు కెమెరాలో అద్దినట్లు కన్పించక మానదు...

సముద్ర కెరటాల్లా లేచి పడే ఆలో చనాతరంగాల్లో అల్లకల్లోలితమైన మనసుతో, తను స్మూత్‌గా కారు నడపడం లేదని గమనించని డాక్టరు గారు, ఆక్సిడెంటు చెయ్యడమే ఆయన వుద్దేశమేమో ననిపించే తీరులో నడుపుతున్న కారులో ఎట్టి పరిస్థితుల్లోనూ నిద్రపోకూడదని జాగ్రత్తగా కూర్చున్న లక్ష్మి మనసులోనూ మిగిలినవి ఆలో చనలే

(ఇంకావుంది)






నాగార్జున సాగర్ – ప్రాచీన బౌద్ధ సంస్కృతీ పీఠం – ఇది హైదరాబాదుకు కేవలం 150 కి.మీ. దూరం మాత్రమే – ఇక్కడ యాత్రికులకు ప్రాచీన సంస్కృతి, నవీన యంత్రాంగము రెండూ ప్రస్ఫుటమైన రూపాల్లో కన్పిస్తాయి.



ప్రముఖ బౌద్ధ ఆచార్యులైన నాగార్జునుల పేరిట వెలసిన, నాగార్జున సాగర్ ఆనకట్ట ప్రపంచంలో రాతి పని కట్టడాలలో కెల్ల పెద్దది. నిర్మాణాత్మక రంగంలోనే గొప్ప అద్భుత కృత్యం, ఘనమైన విశేషం. వెలకట్టలేని బౌద్ధ సంస్కృతీ నిక్షేపాలు ఎన్నో నాగార్జున కొండలోని ప్రదర్శన శాలలో భద్రపరచబడ్డాయి. మానవ నిర్మితమైన సరోవరం మధ్యలో ప్రశాంత వాతావరణంలో కొండమీద వున్న ఈ ప్రదర్శనశాలకు వెళ్ళటానికి లాంచీ సౌకర్యం వుంది. 1926లో జరిపిన త్రవ్వకాలలో ఒక పెద్ద పట్టణ ప్రాంగణం, విశ్వవిద్యాలయం, స్థూపాలు, ఆధ్యాత్మిక గ్రంధములు, నాణెములు మొదలగునవి ఎన్నో బయట పడ్డాయి. ఇవన్నీ ఎంతో శ్రద్ధతో భద్రపరచబడ్డాయి.

నాగార్జున సాగర్‌కు దగ్గరలోనే సుందరమైన ఎత్తిపోతల జలపాతాలున్నాయి. అక్కడి రమణీయమైన ప్రకృతిలోని అందాలన్నీ



చూపరులకు కనువిందు చేస్తుంటాయి. అక్కడ మొసళ్ళక్షేత్రం కూడా ఒక పెద్ద ఆకర్షణ.



కృష్ణా నదిలో నౌకా విహారం అత్యంత ఆహ్లాదకరం. నాగార్జున సాగర్‌కి, శ్రీశైలానికి మధ్యగల 116 కి.మీ. నదీ ప్రయాణం ఎంతో ఉత్తేజకరంగా వుంటుంది. చుట్టూ వున్న దట్టమైన అడవులలో రకరకాల వన్య ప్రాణులకు సురక్షితమైన ఆవాసాలు. యాత్రికుల సౌకర్యార్థం నాగార్జున సాగర్‌లో ఎన్నో అతిధి గృహాలున్నాయి.

**ఆంధ్రప్రదేశ్‌లోని నాగార్జున సాగర్‌కు రండి. మరపురాని మధురాను భూతిని పొందండి.**

# ఘనమైన రాతి ఆనకట్ట పరిసరాల్లో బౌద్ధమత చరిత్ర వైభవాలు తెలుసుకోండి.





**ఆంధ్రప్రదేశ్ పర్యాటక విభాగం**
మొదటి అంతస్థు, గగన్ విహార్,
యం.జె. రోడ్డు, హైదరాబాద్ - 500 001.
టెలిఫోన్లు : 556493, 42835, 77192, 70087, 233384, 233385.

# భయం-భయం

-యడవల్లి సుధీర్

సాయం సమయం.

ఆమె పరిగెడుతోంది. రోడ్డు మీద జనం ఆమెను వింతగా చూస్తున్నారు. అవేమీ పట్టించుకునే స్థితిలో లేదు. ఆమె అలా ఆతృతగా పరిగెడుతూనే వుంది. ఆమె మనసులో అనేక ఆలోచనలు – సుళ్ళు తిరుగుతున్నాయి. జరిగింది తల్చుకున్న కొద్దీ ఆమె హృదయం తల్లడిల్లి పోతోంది. తల్లడిల్లిపోయిన ఆ అమాయక హృదయంలో ఏదో భయం గూడు కట్టుకుంటోంది. ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్టూ, తలక్రింద లౌతున్నట్టూ అనిపిస్తోంది. బాధతో ఆమెను నీరసం ఆవహిస్తోంది. అయినా ఆమె పరిగెడుతూనే వుంది. మాటి మాటికి అతని విషపు నవ్వు, గర్వంతో నిండిన అతని చూపే ఆమె కళ్ళ ముందు కనిపిస్తోంది. అది గుర్తు రాగానే ఆమె మెదడు మొద్దు బారిపోతోంది గుండె లయ తప్పుతోంది. ఆమె దాదాపుగా ఏడుస్తున్నట్టుంది. రెండు వీధులు దాటి మెయిన్ రోడ్ మీద కొచ్చేసింది. ఇంకా అర ఫర్లాంగు దూరం పరిగెడితే గానీ గమ్యం చేరువ కాదు. ఎంత లేదన్నా తను అక్కడికి చేరుకోవటానికి ఐదారు నిమిషాలు పట్టొచ్చు ఇటువంటి సమయంలో ప్రతి నిమిషం, ప్రతి సెకనూ విలువైనవే ఏం చేయాలి. ఇప్పుడేం చేయాలి.

దగ్గర్లో రిక్షాలు కూడా ఏమీ కనిపించటం లేదు. ఆమె అలా ఆలోచిస్తూనే పరిగెడుతోంది. గడియారం కాలాన్ని నిర్దాక్షిణ్యంగా కాలరాస్తూ ముందుకు సాగుతోంది. రేగిన ముంగురులతో, బాధతో, నీళ్ళు నిండిన కళ్ళతో ఆమె పరిగెడుతోంది. ఎందుకిలా జరిగిందని యింట్లో వాళ్ళు ప్రశ్నిస్తే తను ఏం సమాధానం చెప్పగలదు. ఏదో ప్రళయం జరగబోతున్నట్టు మబ్బులు కసిగా మూసుకొస్తున్నాయి. కొద్ది సెకన్లలోనే వర్షపు జల్లులు ప్రారంభమయ్యాయి. పెనుగాలులు ఈడ్చికొడుతున్నాయి. రోడ్డంతా వర్షపు నీటితో తడిసి పోవటం వల్ల ఆమె యిప్పుడు పరిగెత్తలేకపోతోంది. గబగబా నడుస్తోంది. ఎక్కడైనా ఒక్కక్షణం ఆగుదామా అన్న ఆలోచన ఆమెకు వచ్చింది. కానీ యిటువంటి పరిస్థితుల్లో కాలం ఎంత విలువైనదో ఆమెకు గుర్తొచ్చి తడిసిపోయినా గబగబా నడవటానికే నిశ్చయించుకుంది. ఆమెకు ఒక్కసారి తన తండ్రి గుర్తొచ్చాడు. మిలిటరీలో పన్జేస్తున్నారాయన. ఆయన మనస్తత్వం ఆమెకు కొత్తేమీ కాదు. అంతా డిసిప్లిన్డ్‌గా జరగాలంటాడు. అలాంటిది ఈ తప్పును ఎలా సహిస్తాడో ఆమెకు అర్థం కావటల్లేదు. అంతలోనే మరో ఆలోచన ఆమెకు కొంత ఉపశమనాన్ని కలుగజేసింది. నిజంగా ఆలోచిస్తే, ఇందులో తన తప్పేం లేదు. తప్పంతా అతనిది. విధి అలా వుండి అలా జరిగింది. తప్పెవరిదైనా ఈ సమాజం ఆడదాన్నే శిక్షిస్తుంది. మబ్బుల వల్ల ముంచుకొస్తున్న ఈ చీకటిని చూస్తుంటే ఆమెకు భయం వేస్తోంది. తుఫాన్ ఈ ప్రపంచాన్ని ముంచేస్తోందేమో అన్నంత భయంకరంగా వుంది వాతావరణం.

ప్రతి చిన్నదానికి అనవసరంగా కంగారు పడే మనస్తత్వం నీది అని తనతో పరిచయమున్న వాళ్ళందరూ అనేక సందర్భాలలో తనతో అనటం జ్ఞాపకమొస్తోంది. కానీ జరిగింది చిన్న విషయమేం కాదు. వారం క్రితమే 'రమ' క్లాస్ రూంలో ఉరేసుకు చచ్చిపోవటం, దానికి కారణం అతనే నన్న వార్త కాలేజీలో గుప్పుమనటం, అతను ఎం. ఎల్. ఏ. గారబ్బాయి అవటంతో ఎవరూ అతనికి వ్యతిరేకంగా సాక్ష్యం యివ్వకపోవటం వల్ల కేసు కొట్టేయడం, ఒకదాని తర్వాత ఒకటి గుర్తొచ్చి ఆమె మనసులో మరింత భయాన్ని నింపుతున్నాయి ఇప్పుడు తన వంతు వచ్చింది. డబ్బు, బలం వున్నాయనే అహంకారం నిండిన అతని కళ్ళల్లో అతని చూపుల్లో ఎప్పుడూ స్త్రీ పట్ల ఒక చులకన భావం కనిపిస్తూంటుంది. అతని కన్ను పడిన ఆడది అతనికి లొంగి పోవాలి, లేదా చచ్చిపోవాలి. రమ ప్రాణాలు తీసుకుంది. అతన్నెవరూ ఏం చేయలేరు. ఇపుడు తను మాత్రం అతన్నేం చెయ్యగలదు? ఈ విషయం బయట పెట్టినా, అమ్మో... ఎవరికీ చెప్పటానిక్కూడా వీల్లేదు. ఇంకా రెండు నిమిషాలుంది గమ్యం చేరుకోవటానికి. ఆ రెండు నిమిషాల తర్వాత తను ఏ ఫలితం కోసం ఎదురు చూస్తోందో అది తెలిసి పోతుంది. తన పరువు ప్రతిష్ఠ, జీవితం అన్నీ ఆ ఫలితం మీద ఆధారపడి ఉంటాయి. ఆమె గబగబా నడుస్తోంది. యింకా ఒక్క నిమిషం నడిస్తే సరిపోతుంది. ఆమె గుండెల్లో రైళ్ళు పరిగెడుతున్నాయి. ఆమె ఎందుకో వాచీ చూసుకుంది. వర్షానికి తడిసిన వాచీ గ్లాసులోంచి దుప్పట్లో మునగ దీసుకుని పడుకున్నట్టు కనిపిస్తున్నాయి ముళ్ళు. అవి కదలటం లేదు. ఆమె చేతికున్న గడియారం ఆగిపోయింది.

గమ్యం చేరువవుతున్న కొద్దీ ఆమె గుండె గుండెల్లో లేనట్టుంది. కాలం స్తంభించి పోయినట్టుంది. ఎదురుగా తను చేరుకున్న ఆ భవంతిని చూసి ఆమె ఆగిపోయింది. ఆ నిశ్శబ్దంలో ఆ భవంతి ఆమె దురదృష్టానికి ఆమెను చూసి వెక్కిరిస్తున్నట్టుగా వుంది. అది ఆమె కాలేజి భవంతి. గేటు తీసే వుంది. అక్కడి దాకా వచ్చాక ఆమె తన ఆతృతను ఆపుకో లేకపోయింది. ఒక్కసారిగా లోపలికి పరిగెత్తింది. సరాసరి తన క్లాసు రూమ్‌లోకి నడిచింది. క్లాస్ రూమ్ గుమ్మంలోకి రాగానే ఆమె అడుగులు తడబడ్డాయి. బయట వర్షం కురుస్తున్నా చలిగా వున్నా ఆమెకు చెమట పడ్తోంది. ఆమె కళ్ళు చకచకా వెతుకుతున్నాయి. రెండో బల్ల దగ్గరి కొచ్చి ఆమె ఆగిపోయింది. ఆనందంతో ఒక్కసారిగా ఆమె కళ్ళు చెమర్చాయి. అక్కడే వుంది ఆ పుస్తకం. అమ్మయ్య అనుకుందామె.

మరుక్షణంలో ఆమెకు పొద్దున కాలేజీలో జరిగిన సంఘటన జ్ఞాపకం వచ్చింది. ఇంటర్వెల్‌లో బయటకి వచ్చి నోటీసు బోర్డు దగ్గర వున్న తన కొచ్చిన లెటర్ తీసుకెళ్ళి క్లాసులో కూర్చొంది. అది చదివి నిర్ఘాంత పోయింది. అది రవి రాసిన ఉత్తరం. ఈ రోజు రాత్రి ఏడింటికి తనింటికి రమ్మనీ తనని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాననీ యింకా ఏదేదో రాశాడు ఆమెకు భయం వేసింది. అయినా మాటి మాటికి అందులోని వాక్యాలే గుర్తొస్తున్నాయి. "ఈ లెటర్ బయట పడితే జాగ్రత్త! ముందు అది గుర్తుంచుకో!!"

అసలు చదవగానే దాన్ని చించి పారెయ్యాల్సింది. కానీ యింతలో క్లాసులో లెక్చరర్ గారు ప్రవేశించటంతో దాన్ని గబుక్కున పుస్తకంలో దాచటం దురదృష్టవశాత్తూ అదే పుస్తకాన్ని తను క్లాస్ రూంలో మర్చిపోయి వెళ్ళిపోవడం ఎంత యాదృచ్ఛికమో అదే పుస్తకం ఎవరి కంటా పడకుండా బల్ల మీద అలాగే వుండటం అంతే యాదృచ్ఛికంగా అనిపిస్తోంది. ఆ ఆనందంలో 'తను' పడిన ఆవేదనంతా మర్చిపోయి బల్ల మీద కూలబడింది.

వెంటనే . ఆ ఆనందంలోంచి తెప్పరిల్లి పుస్తకంలోని పేజీలను తిప్పి చూసింది. ఆ లెటర్ అందులో లేదు.

ఒక్క క్షణం ఆమె ఒళ్ళు జలదరించింది. ఈ లెటర్ ఎవరి కంటన్నా పడిందో జాగ్రత్త! అంటున్నట్టున్న అతని ముఖమే కళ్ళలో కదలాడుతోంది. ఎందుకింత నిర్లక్ష్యంగా వున్నావంటే ఎవరికైనా ఏం సమాధానం చెప్పాలో అర్థం కావటం లేదు.

తనని అతనేమైనా చేస్తే ఇంట్లో తోబుట్టువులు తనని చూసే అసహ్యపు చూపు, కాలేజి గోడల నిండా నిండుకున్న తన పేరు, తండ్రి చేతిలో దెబ్బలు. ఇవన్నీ ఆమె మనోనేత్రం ముందు సినిమా రీళ్ళలా కదలాడాయి.

ఆ ఆలోచనకే ఆమె వణికి పోయింది. ఆమెకు యిప్పుడు ఒక విషయం మాత్రం స్పష్టంగా

తెలిసిపోయింది. ఇంక తనకి దారి లేదు. రేపు అనేది తన జీవితంలో అనూహ్యం అని తెలిపోయింది. ఒక వేళ లెటర్ కనిపించినా రేపో, ఎల్లుండో అతని చేతిలో నాశన మవక తప్పదు. తను అందంగా వుండటం తన తప్పా? ఈ సమాజంలో మగాడు చేసిన తప్పుకి ఆడదాని కెందుకు శిక్ష పడుతుంది? స్త్రీ నిస్సహాయత మానసిక వేదన ఎవరూ అర్థం చేసుకోరా? ఒక్కసారిగా ఆమెను నిస్సత్తువ ఆవహించింది. ఆమె గుండె చప్పుడు ఆమెకే స్పష్టంగా వినిపిస్తోంది. రమ ఆత్మహత్యకి కారణం యిప్పుడు ఆమెకు తెలిసింది. ఆ రోజు తన ఫ్రెండ్స్ తనతో "ఆత్మహత్య చేసుకోవడం పిరికి తనమని, ఏమైనా సమస్యలుంటే ధైర్యంగా ఎదుర్కోవాలని అనటం" ఆమెకు గుర్తొచ్చింది. ఆ రోజున వాళ్ళన్నదే నిజమనిపించింది తనకి. కానీ తన దాకా వస్తే కానీ తెలియదని ఈ రోజు తెలుస్తోంది. ఒక నిశ్చయానికొచ్చినట్లు ఆమె లేచి నిలబడింది. ఆమెకు ఒక్కసారిగా దుఃఖం ముంచుకొచ్చింది. కాలేజీలో తన ఫ్రెండ్స్, తన కుటుంబ సభ్యులు, పక్కింటి వాళ్ళు, పరిచయం వున్న వాళ్ళందరూ ఆమెకు ఇప్పుడు జ్ఞాపక మొస్తున్నారు. వాళ్ళందర్నీ యిప్పుడు తను విడిచి వెళ్ళి పోబోతోంది. తన తల్లిదండ్రుల కడుపులో చిచ్చు రగిల్చి ఈ ప్రపంచానికి శాశ్వతంగా దూరమై పోబోతోంది. తను చచ్చిపోతే ఈ ప్రపంచం ఏమౌతుంది? ఏమీ కాదు. ప్రపంచం మళ్ళీ మామూలుగానే నడుస్తూ వుంటుంది. ఒక అమాయకమైన ఆడపిల్ల ప్రాణాల్ని మింగేసి కాలం నిర్లిప్తంగా ముందుకు సాగుతుంది. కొన్ని గంటల్లో కాలేజి ఆవరణలో వున్న ఆ బావిలో ఆ కాలేజి విద్యార్థినుల్లో ఒకరైన తన శవం తేలబోతోంది. కాలేజికి ఒకరోజు సెలవొస్తుంది. ఆమె వేదాంతిలా నవ్వుకుంది.

మొగలి రేకులను ఆవహించే మిన్నాగులు ఈ ప్రపంచంలో వున్నంత కాలం ముగింపు యిలాగే వుంటుంది. తన నిర్ణయాన్ని అమలు పరచటానికి ఆమె అడుగులు వేస్తూ నడుస్తోంది.

వరండా మెట్లు దిగుతూ అప్రయత్నంగా చూసిన ఆమెకు మెరుపు వెలుగులో కనపడిందా ఉత్తరం. గాలికి ఎగిరొచ్చి కాలికి తగిలిన దాన్ని చేతిలోకి తీసుకుని చూసిందామె. వర్షానికి తడిసిన అక్షరాలు అలుక్కుపోయి కన్పిస్తున్నాయి. మరోసారి మెరుపు మెరిసింది. ఉత్తరంలోకి చూస్తున్న ఆమె ఉలిక్కి పడింది. ఆ ఉత్తరం వచ్చింది. డి. శ్యామలకు! తను పి. శ్యామల.

కసిగా దాన్ని చించి పారేసి వడివడిగా యింటి వేపు అడుగులు వేసింది ఆమె. □



# శివపంచాయతన క్షేత్రం
# 'శ్రీ ఉమారుద్ర కోటీశ్వరాలయం'



ఉమాదేవి మూల విగ్రహం

"పూజ్యో హరస్తు సర్వత్ర,
లింగే పూర్ణార్చనం భవేత్!"

'పూజ లన్నింటిలోనూ లింగా రాధనే శ్రేష్ఠమని' అగ్ని పురాణ ప్రవచనం. ప్రత్యేకముగా శివమూర్తిని గాని, కేశవ మూర్తిని గాని పూజించిన, 'అది' ఆ ఒక్కరికే ప్రాప్త మవును. లింగారాధన చేసిన, సృష్టిలయ కారకులైన ప్రరబ్రహ్మ, సర్వేశ్వరులకు సమర్పిత మవును. 'లింగోద్భవ మూర్తి క్షేత్రాల్లో' ప్రసిద్ధి చెందినది, శ్రీకాకుళం (జిల్లా)లోని 'శ్రీ ఉమారుద్ర కోటీశ్వరాలయం'

"వనోపాన్త నదీ శైల నిర్ఝరో పాన్త భూమిషు!
రమన్తే దేవతా నిత్యమ్ పురేషుద్యాన వత్సుచ"

'నదీ, శైల, సెలయేటి ప్రదేశాలలోని 'భూ' ఉద్యాన వనములలో దేవతలు, విహరిస్తారు. అట్టి దేవవాస స్థానములు శుభం, శాంతిని కల్గిస్తాయి. అట్టి పవిత్ర తీర్థ క్షేత్రాల్లో నొకటి ఈ 'మహా రుద్ర కోటీశ్వర తీర్థం'-

## దివ్య కథ

లింగవన్నిలయ స్థానములు 'పంచ స్థానముల'ని ప్రతీతి. అవి స్వయం వ్యక్తము, దివ్యము, ఆర్షము, పౌరాణము, మానుషము. అందులో ఉత్తమోత్తమమయిన 'దివ్యము', 'ఈ దేవాలయ 'అచల' లింగము. దివ్యమనగా దేవతలచే ప్రతిష్ఠింప బడిన దేవాలయము.

సాక్షాత్ 'స్థితి' నాయకుని సోదరుడైన 'బలరాముని'చే ఈ క్షేత్ర మూర్తి ప్రతి ష్ఠింప బడెనని చెప్ప బడుతోంది.

"కురుక్షేత్ర యుద్ధ సమయంలో ఇరు వర్గీయులకు సహాయ పడటానికి మనస్కరించక, దక్షిణ తీర్థ యాత్రా నెపమున విచ్చేసిన "హలాయుధుడు", దండకారణ్యమున అసంకల్పితంగా చేసిన బ్రహ్మహత్యా దోష నివారణార్థం, పంచలింగములను ప్రతిష్ఠింప బోయెను. నాటి 'కళింగ' వాసుల అభ్యర్థనను పురస్కరించుకుని, 'గరళ కంఠుని' మెప్పించి 'గంగ'ను కళింగ సీమకు రప్పించెను. తన నాగలితో

మహానంది





శ్రీరుద్ర కోటీశ్వరుని 'అచల' లింగం

గంగకు త్రోవచూపుతూ, కళ్యాణ ఫలిగ్రామం దగ్గర బంగాళా ఖాతంలో సంగమించునట్లు మార్గీకరించెను కనుక, ఆ నదికి "నాగావళి" అని పేరు వచ్చెను. పిదప నాగావళీ తీరం ననుసరించి, భీమేశ్వరుడు (పాయకపాడు) సోమేశ్వరుడు (గుంఫ) సంగమేశ్వరుడు (సంగం) రౌద్ర కోటీశ్వరుడు (శ్రీకాకుళం) మణి నాగేశ్వరుడు (కళ్యాణ ఫలి– నేటి 'కళ్లేపల్లి') మున్నగు పంచలింగములను ప్రతిష్ఠించి, పునీతుడాయెను. ఈ తావులన్నీ కలిపి 'బలరామ క్షేత్రం' గా పిలువబడుతున్నాయి. శివరాత్రి నాడు జాగరణ చేసి, బలరామక్షేత్రాన్ని సంపూర్తిగా దర్శిస్తే, పునర్జన్మ వుండదని 'పెద్దల' ఉవాచ. భక్తుల కోరికపై 'శ్రీకృష్ణుడు' కూడా 'ఉమాదేవిని' ప్రతిష్ఠించి, క్షేత్ర పాలకునిగా నిలిచెనని చెప్పబడుతోంది".

## నాటి, నేటి చరిత్ర

క్రీ. శకం 5–7 శతాబ్దంలో 'గాంగ వంశరాజులు', దంతపురం, ముఖలింగం పురములను రాజధానులుగా చేసుకుని, ఉత్తర కళింగ దేశాన్ని

పరిపాలించేరు. తదుపరి, కటకము రాజధానిగా 15వ శతాబ్దం వరకూ నిలిచియున్నారు. వీరు శైవమతస్థులు. వీరి కాలంలో, ఈ ఆలయ నిర్మాణం జరిగి వుండచ్చు.

కాలక్రమేణా, మత దురహంకారులు చేతిలోనూ, ప్రకృతి విజృంభణ లోనూ, దేవాలయం పూర్తిగా నాశనం గావింపబడింది.

క్రీ. శకం 18వ శతాబ్దంలో శ్రీ యలమంచిలి పుల్లాజీ పంతులు, మగటపల్లి కామయ్య శెట్టి నేతృత్వంలో, నాగావళినది యొడ్డున 'గోల్కొండ' రేవు దగ్గర నున్న శిధిల దేవాలయంలోని 'పవిత్ర మూల విరాట్'లు, నేడు దేవాలయం నెలకొని యున్న ప్రాతంలో పునఃప్రతిష్ఠింప బడినవి. శ్రీ కామయ్యగారు ఈ ఆలయ నిర్మాణాది కార్యక్రమములు చేపట్టినట్లు, ఇచ్చటి శిలాఫలకం వెల్లడి చేస్తున్నది నేటికిని మగ టపల్లివంశీయులు ధర్మకర్తలుగా వ్యవహరిస్తున్నారు.

ప్రస్తుతం ఎండోమెంట్సువారి అధీనంలో ఆలయం అభివృద్ధి నొచుకుంటోంది.

## క్షేత్ర విశేషాలు

"నాగావళి నదిస్నానం – కోటీశ్వర సుదర్శనం
నందీశ్వరాభి మర్శంచ – కోటి పంచాక్షరి ఫలం'

నాగావళీ నదిలో స్నానమాచరించి, నందీశ్వరుః స్పర్శించి, కోటీశ్వరుని దర్శిస్తే, కోటి పంచాక్షరి ఫలం వస్తుందని 'ఆర్యోక్తి'.

"ఆదిత్య, మం బికాం, విష్ణుం, గణనాధం,
మహేశ్వరమ్'

ప్రమాణీత మయిన 'శివ పంచాయతన క్షేత్రాల్లో' నొకటి ఈ రుద్ర కోటీశ్వరాలయం. సూర్య వంశ శ్రేష్టుడు 'శ్రీరాముడు', అంబ స్వరూపి 'ఉమాదేవి' విష్ణువాంశుడు 'వేణుగోపాలుడు', గణనాధుడు 'విఘ్నేశ్వరుడు', మహేశ్వరుడు



'గంగా' సమమైన నాగావళి

'రామలింగేశ్వరుడు', కోటీశ్వరుని ప్రాంగణంలో కొలువు తీరి యున్నారు.

నటరాజు నమ్మిన బంటు, నందీశ్వరాంశుడు 'ఆంజనేయుడు' ఆలయ రక్షకుడు.

నవగ్రహములు కూడా ప్రతిష్ఠింప బడినవి.

సుమారు 'పది' అడుగులు పొడుగు, 'ఆరు' అడుగులు ఎత్తు వుండే, అపురూప ఏకశిలా నంది విగ్రహం భక్తులను తన్మయులను చేస్తుంది. శ్రీశైల శనగల బసవణ్ణ – లేపాక్షి బసవణ్ణ'లను జ్ఞప్తికి తెచ్చే ఈనంది, నాటి శిల్పకళా ప్రతిభకు ప్రతిబింబం. గర్భగుడి వెలుపలగల 'శిల్పకళ' భక్తులకు కనువిందు చేస్తుంది.

## ఆదాయాలు, ఉత్సవాలు

ఏటా ఏభై వేలు సుమారుగా సంపాదించే ఈ భోళాశంకరులకి భక్తుల ఆదరణే ఆదాయం.

కార్తీకమాసం, శివరాత్రి, వైశాఖ మాసం మున్నగు పర్వదినాలలో వేలాది భక్తులు స్వామిని సేవించి తరిస్తారు.

ఫాల్గుణ శుద్ధ త్రయోదశినుండి, మూడు రోజులు పాటు జరిగే 'డోలోత్సవం', శివరాత్రి నాటి 'శివకళ్యాణం,ముఖ్యమయిన ఉత్సవాలు.

## ఉపశ్రుతి

'యథారాజా, తథాప్రజా' నానుడి ననుసరణీయమా యన్నట్లు, శ్రీ కె. వెంకట శివయ్య ఇక్కడ జాయింట్ కలెక్టర్‌గా యున్నప్పుడు, వ్యాపారస్థులు, అధికారులు 'వారి' నేతృత్వంలో, ఆలయ అభివృద్ధికి అన్ని విధాలా సేవలు చేసి, ఆలయాన్ని సుందర ప్రశాంత నిలయంగా నిలిపేరు. ఆయన బదిలీ పిదప, 'నాటి దాతల చిత్తం 'శివయ్య' మీదో 'శివుని' మీదో నని భక్తులకు సందేహం కల్గుతోంది. 'నాటి' ప్రోత్సాహకులు 'నేటి' ప్రోత్సాహకులను సమీకరించి, దేవాలయానికి పూర్వపు శోభలు సమకూరుస్తారని ఆశిస్తాను.

వ్యాసం, ఫోటోలు :
— నిడమర్తి ఆదిలక్ష్మి ప్రసాద్

విషయ సేకరణకు సహకరించిన ఆలయ ప్రధాన పూజారి "శ్రీ హరగోపాలశర్మ" ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ "శ్రీ. విశ్వనాధం" గార్లకు కృతజ్ఞతలు –వ్యాసకర్త

ఆలయ శిఖరం



గర్భగుడి పై శిల్ప కళ



# వీడ్కోలు

## బెహరా వెంకట సుబ్బారావు

మద్రాస్ పోయే మైలు వచ్చి ఆగింది. నా సూట్ కేసనీ ఎయిర్‌బేగ్‌నీ తీసుకొని ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటులోకి వెళ్ళా. కండక్టర్ నా బెర్తు చూపించాడు. అది "డి" కేబిన్. నాలుగు బెర్తులున్నాయి. నాది లోవర్ బెర్తు. నా సామానుని అనువైన స్థలంలో పెట్టుకొన్నా, తర్వాత కిటికీ దగ్గర కూర్చున్నా. మరొక ముగ్గురు వచ్చి కూర్చున్నారు. అటూ యిటూ ముగ్గురం చొప్పున కూర్చున్నాం. ఆ వచ్చిన వారు ముగ్గురూ వారి మాటలను బట్టి రైల్వే వుద్యోగులని తేలి పోయింది. అది వారి స్వంత బండి. (క్షమించాలి!) వాల్తేరు రాగానే ఆ ముగ్గురూ దిగిపోయారు. మరో పాసింజరు (సుమారు అరవై సంవత్సరా లుంటాయ్) హడావిడిగా మా కేబిన్‌లోకి వచ్చాడు వాల్తేరులో. కూలీలతో హిందిలో మాట్లాడుతున్నాడు నాపైనున్న బెర్తు ఆయనకు కేటాయించ బడింది అంతకు ముందే నా కెదురుగానున్న రెండు బెర్తుల్లోనూ పాసింజర్లున్నారు పైనున్న ఆయన బెంగాలీ వారపత్రిక తిరగేస్తున్నాడు. అడుగునున్నాయన యిండియన్ ఎక్స్‌ప్రెస్ చదువు కొంటున్నాడు. ఆయన్ని చూస్తే తమిళుడులా కన్పిస్తున్నాడు. మొత్తం మీద ఆ ముగ్గురూ ఆంధ్రేతరులే కావడంతో నిరుత్సాహపడ్డా.

మా డిపార్టుమెంటువారు ట్రైనింగ్ కోసం మైసూర్ వెళ్ళమన్నారు. నా వుద్యోగపు హోదాకి ఫస్టు-క్లాసులో ప్రయాణం చేసే అర్హత వుంది. అందుకే ఫస్టుక్లాసులో పయనిస్తున్నా. వ్యక్తిగతంగా అయితే నేను సెకండుక్లాసు పాసింజర్నే! సెకండు క్లాసులో ప్రయాణం అయితేనే హాయిగా వుంటుందని )బర్త్ రిజర్వేషన్ అయితేనే సుమండీ!) నా అభిప్రాయం. అక్కడ అంతా ఫ్రీగా మాట్లాడ్తారు ఒకరినొకరు పరిచయం చేసుకొని స్నేహాన్ని పెంచుతారు' ఆనందాన్ని పంచుతారు. నవ్వుతూ నవ్విస్తూ వుంటారు ఒకరికొకరు యథాశక్తి సాయపడతారు

ఫస్టుక్లాసు ప్రయాణీకుల పరిస్థితి ఇందుకు భిన్నంగా వుంటుంది. ఎవరిమట్టుకు వారికి సుపీరియారిటీ కాంప్లెక్స్! ముందుగా తాను కల్పించుకొని పలికరిస్తే తన ప్రిస్టేజికి భంగం వాటిల్లుతుందనీ, తన హోదాకి తగదనీ భావిస్తాడు. అందుచేతనే ఎదుటివాడు పలకరిస్తేనే గాని పెదవి విప్పడు. అదొకరకం మానసిక రుగ్మత! ఏ మాగజైన్నో పేపర్నో (ఇంగ్లీషుది) తిరగవేస్తూ వుంటాడు. ఏకాకిలా ప్రయాణం చేస్తాడు. నాకు మొదట్లో వారిని పలకరించాలనిపించినా (ఆ రుగ్మత నన్నూ పట్టుకొంది కాబోలు!) తర్వాత ఆ ప్రయత్నాన్ని విరమించుకొన్నా ఇదివరలో రెండుసార్లు పొందిన అనుభవాన్ని విస్మరించి మళ్ళీ అదే క్లాసులో ప్రయాణం చేస్తున్నా.

వాల్తేరు స్టేషన్‌లో మెయిలు ఆగింది. కిటికీ లోంచి ప్లాట్‌ఫారం వైపు చూస్తూ కాలక్షేపం చేస్తున్నా. మా కంపార్టుమెంటు కెదురుగా సుమారు యిరవై మంది వలయంలా యేర్పడి నిలబడ్డారు. వారు తమ మధ్య చుక్కల్లో చంద్రునిలా నిలబడివున్న వ్యక్తితో స్నేహ పూర్వకంగా మధ్యలో విధేయత మిళితం చేస్తూ ముచ్చటిస్తున్నారు. ముగ్గురు వ్యక్తులు అతని మెడలో పూలమాలలు వేసారు. "ఆయన" ఒక ఆఫీసరనీ క్రింది వుద్యోగులు వీడ్కోలు యిస్తున్నారనీ ఎవరికైనా అర్థం అవుతుంది. ఆయనది నా వయసే అంటే సుమారు యాభై వుంటుంది. ఫుల్‌సూట్‌లో వున్నాడు. ట్రైన్ కదలబోతూంటే ఎక్కి గుమ్మంలో నిలబడ్డాడు. క్రిందనున్న వారు కొందరు నమస్కరిస్తున్నారు. కొందరు చేతులు వూపుతున్నారు. "ఆయన" ఏ కేబిన్‌లో వుంటారోనని తెల్సుకోవాలన్న కుతూహలం కలిగింది. చివాల్న లేచి బయటికి వెళ్ళా. ఆయన నన్ను తప్పించుకొంటూ "ఇ"లోకి వెళ్ళారు. ఆ "ఇ"లో రెండు బెర్తులు. మరో ఆయన వున్నాడు. తిరిగి నా కేబిన్‌లోకి వచ్చా.

మా కేబిన్ వాతావరణం ముందే చెప్పాను. అంతా మూగవారిలా కూర్చున్నారు. నేనే చొరవ తీసుకొని



పలకరించా ఆంగ్లంలో. ఎదురుగా పై బెర్తులో నున్నాయన హౌరా నుంచి వస్తున్నాడు. మద్రాసు వెళ్తున్నాడు. ఆయన బెంగాలీ. నాపైనున్న ఆయన తమిళుడు. మద్రాసే వెళ్తున్నాడు. తర్వాత నా కెదురుగా అడుగు బెర్తు ఆయన్ని పలకరించబోయా! మద్రాసు వెళ్తున్నానని అడక్కుండానే యింగ్లిషులో చెప్పాడు. భువనేశ్వర్ నుంచి వస్తున్నాడుట. తర్వాత ఎవరూ మాట్లాడ లేదు.

ట్రైన్ అనకాపల్లిలో ఆగింది. "ఇ"లో వున్నాయన కంపార్టుమెంటు దిగి ప్లాట్‌ఫారంపై పాదం మోపాడు. సుమారు పది మంది వుద్యోగులు ఆయన్ను చుట్టు ముట్టారు. ఒకడు పూల మాల వేసాడు. ఒకడు కూల్ డ్రింక్ తెచ్చి అందించాడు. ట్రైన్ బయలుదేరేవరకు వారితో ముచ్చటించి. కదుల్తున్న ట్రైన్ ఎక్కాడు.

తర్వాత స్టేషన్ తుని. మా తమ్ముని కలియడానికి నేనూ దిగాను. ఎప్పటిలాగే ఆయన ప్లాట్‌ఫారం మీద ఓ అయిదుగురితో చిరునవ్వులు చిందిస్తూ మాట్లాడుతున్నాడు. మా తమ్మునితో మాట్లాడుతున్నా నా దృష్టంతా అతని వైపే. రైలు కదలబోతూ వుంటే యిద్దరవూ ఒకేసారి ఎక్కాం. తర్వాత సామర్లకోటలో కొంత మంది ఆయన్ని కల్సి వీడ్కోలు చెప్పారు. రాజమండ్రిలో ఆగింది ట్రైన్. మళ్లీ అదే తంతు. పదిహేను మంది వరకూ వచ్చి కల్సారాయన్ని. అరటిపళ్లు అమ్మకానికి వచ్చాయి. డజను మూడు రూపాయలు. అరడజను తీసుకొని రెండు రూపాయల కాగితం అందించా. పళ్లవాడు జేబులు తడుముకొని చిల్లర లేదన్నాడు. ట్రైన్ కదిలింది. అర్ధ రూపాయికి బదులు మరో రెండు పళ్లు అందించబోయాడా వ్యాపారి. చేయి చాపాను. ఆయన గేటులో అడ్డంగా నిలబడి వున్నాడు. ట్రైన్ స్పీడ్ అందుకొంది. గేటు ముందు నిలబడి వున్న ఆయనకి అందివ్వబోయాడా వ్యాపారి. అయితే ఆయన అందుకోలేదు. తనకు పట్టనట్టుగా చూస్తూ వుండి పోయాడు. చికాకేసింది. ఆయన్ని పక్కకి నెట్టి చేయి చాపా. పళ్లవాడు పరుగెత్తాడు గాని అందించలేక పోయాడు. కనీసం "సారి" అయినా చెప్పకుండా తన కేబిన్‌లోకి వెళ్లాడు ఆయన. మా కేబిన్‌లోని వారు ఎవరిమట్టుకు వారు పత్రికలో పేపర్లో చదువు కొంటున్నారు. రాజమండ్రిలో కొత్తగా యిద్దరెక్కి నా బెర్తుమీద కూర్చున్నారు. నన్ను చూడగానే సర్దుకొని కూర్చొన్నారు. కిటికీ దగ్గర కూర్చున్నా.

"బెజవాడలో దిగుతాం!" అడక్కుండానే చెప్పారు తెలుగులో. బెజవాడ వరకూ తెలుగు వారు దొరికి నందుకు సంతోషం కలిగింది. ముగ్గురవూ చాలా విషయాలు మాట్లాడుకొన్నాం. కూరగాయల ధరల దగ్గర నుంచి రాజీవ్‌గాంధీ విదేశ ప్రయాణం వరకూ!

బెజవాడ చేరేసరికి రాత్రి ఏడున్నరయింది. ఆ యిద్దరూ దిగి పోయారు. నేను కూడా దిగి కాంటీన్‌లోకి వెళ్లా. అక్కడ సెల్ఫ్‌సెర్వింగ్! టిఫిన్ చేయాలంటే పెద్ద క్యూ వుంది. కాఫీ మాత్రం



తీసుకొన్నా. "ఆయన" కూడా అక్కడికి వచ్చి కేవలం కాఫీ తీసుకొన్నారు. ఇరువురవూ ఎదురుపడినా పలకరించుకో లేదు. ఆయన కనీసం "ఎక్కడి కెళ్తున్నారు?" అని అడిగినా బావుణ్ను అనిపించింది. ఆయన అడగలేదు. నేనూ మాట్లాడ లేదు. రాత్రి ఎనిమిదిన్నరకి బెజవాడ వదిలింది. పాసింజర్లు తమ తమ బెర్తుల మీద పక్కలు పర్చుకొన్నారు. నేను కూడా సర్దుకొన్నా. పక్క వేసుకొన్నా. తర్వాత ఎవరిమట్టుకు వారం మాకూడా తెచ్చుకొన్న టిఫిన్ తీసుకోడం మొదలు పెట్టాం. బెంగాలీ ఆయన రెండు రకాల స్వీట్సు మా ముగ్గురికీ యిచ్చాడు. తీసుకొన్నాం. టిఫిన్ కార్యక్రమం అరగంటలో ముగిసింది. తర్వాత అందరూ నిద్ర కుపక్రమించారు. తొమ్మిది గంటలకి తెనాలి దాటింది. అన్ని లైట్లూ ఆఫ్ చేసాం. నీలం రంగు బల్బు మాత్రం వెలుగుతోంది.

నాకు నిద్రపట్టలేదు. ఎయిర్ బేగ్‌లో వున్న ఆంధ్రప్రభ వీక్లీ తీసా. నాతల దగ్గరున్న లైట్ వెలిగించా. కొంత సేపు చదివాక నిద్ర వచ్చింది. లైట్ ఆఫ్ చేసా.

"మాష్టారూ! ఆ ప్రభ వీక్లీ ఓ సారిస్తారా?" మా కేబిన్‌లో అభ్యర్ధన! తెలుగులో!! తృళ్లిపడ్డా. అశరీర వాణి మాట్లాడినట్టనిపించింది. నీలి రంగు వెల్తుర్లో ఆ ముగ్గురి వైపూ తిరిగి చూసా ఆశ్చర్యంగా.

"నేనే అడుగుతున్నా మాష్టారూ!" నా కెదురుగా క్రింది బెర్తులో వున్నాయన నోటిలోంచి వచ్చాయి ఆ మాటలు!

"మీ అసాధ్యం గూల! మీరు తెలుగు వారేనా?" తెలుగులో స్వగతంలో ఆశ్చర్యపోయి.

"మీరు ఆంధ్రులు అనుకోలేద్సార్" అన్నా పుస్తకాన్ని అందిస్తూ.

ఆయన అప్పటికే తన తల వద్ద నున్న బెడ్ లైట్ స్విచ్ ఆన్ చేసారు. నా మాటకి జవాబుగా హుందాగా ఓ చిరునవ్వు విసిరారు అంతే గానీ ఏమీ మాట్లాడలేదు. వీక్లీ పేజీలు తిరగేస్తున్నారు. రాజమండ్రి నుంచి బెజవాడ వరకూ మేం తెలుగులో మాట్లాడు కొంటూ వుంటే, ఆయన మా మాటలు వింటూ భాష తెలీని వానిలా పెదాలు అంటించుకొని రిజర్వ్‌డుగా కూర్చున్నారు మేం జోక్సు కట్ చేసుకొని నవ్వుకొంటున్నా ఆయన కనీసం చిరునవ్వైనా చిందించలేదు నేను చేసిన కామెంట్‌కి కూడా ఆయన నుండి రెస్పాన్స్ లేదు. చిరునవ్వు నవ్వి ఊరుకున్నారు. అటువంటి ఆయనతో ముచ్చటించాలనిపించలేదు. పైగా నిద్రవస్తోంది.

★ ★ ★ ★ ★

"సార్! మరో యిరవై నిమిషాల్లో సెంట్రల్ స్టేషన్

# "వీడ్కోలు"

వస్తుంది!" తలుపు టాప్ చేసి మేల్కొలిపాడు ఎటెండరు. అందరవూ లేచాం. వారపత్రిక నా పక్కలో పడివుంది. మా సామాన్లు సర్దుకొన్నాం. అయిదున్నర గంటకల్లా సెంట్రల్లో దిగాం.

నాకు మద్రాస్ నుంచి కనెక్టింగ్ ట్రైన్ బృందావన్ ఎక్స్‌ప్రెస్. ఏడు గంటల అయిదు నిమిషాలకి బయలు దేరుతుంది. చాలా టైముంది. ప్లాట్‌ఫారం మీద ఒక కొళాయి దగ్గర కెళ్ళా. మొహం కడుక్కొన్నా. బృందావన్ బయలు దేరే ప్లాట్ ఫారం చేరుకొన్నా. చిన్న సూట్ కేసూ ఎయిర్ బేగూ నా సామాను. కాబట్టి కూలీల అవసరం లేదు. కాఫీ కోసం కాంటిన్ దగ్గరకెళ్ళా. అక్కడ నా కొలీగ్ మూర్తి కనిపించాడు. అనకాపల్లి నుంచి వస్తున్నాడు నాతో బాటు ట్రైనింగ్ కోసం. పలకరింపులూ కాఫీలూ అయాయ్.

"వెయిటింగ్ రూంకి పోదామా?" అన్నా అతని సామానుచూస్తూ. నాలాగే సింపుల్‌గా తెచ్చుకొన్నాడు.

"అక్కడికి వెళ్ళే వచ్చా! అక్కడికన్నా ఈ ప్లాట్ ఫారమే బావుంది! మరో ముప్పావు గంటేగా! ఇక్కడే కాలక్షేపం చేద్దాం!" అన్నాడు.

మూర్తి నేనూ అయిదు సంవత్సరాలపాటు ఒకే ఆఫీసులో పని చేసాం పది సంవత్సరాల క్రితం. చాలా విషయాలు ముచ్చటించుకొన్నాం. అంతలో బృందావన్ ప్లాట్ ఫారం మీద కొచ్చింది. నేనూ మూర్తి ఆ ట్రైన్ ముందు నుంచి కొస వరకు చూసాం. ఎక్కడా ఫస్ట్ క్లాస్ కంపార్టు కనిపించలేదు. ఆశ్చర్యం వేసింది. ఆన్‌వర్డ్ రిజర్వేషన్ బృందావన్‌కి కన్ఫర్మయిందని మా విజయ నగరంలో చెప్పారు. సీటు నెంబరు పది హేడు అని కూడా చెప్పారు. తన క్కూడా బృందావన్‌కే రిజర్వేషన్ అయిందని చెప్పాడు మూర్తి. ఆశ్చర్యం! ఆ భోగియే కనబడదు! మరో సారి తిరిగి చూసాం! 'కనిపించలేదు.... ప్రయాణీకులు హడావిడిగా ట్రైన్‌లోకి పోతున్నారు. ఎవరి నడిగినా సమాధానం చెప్పరు. పైగా వాళ్ళ భాష మాకు తెలీదు. మేం అడిగిన వాళ్ళకి యింగ్లీషు వచ్చునో రాదో తెలీదు. ఏం చేయాలో తోచలేదు. ఎంక్వయరి దగ్గరకి పోయి అడిగాం. రిజర్వేషన్ చార్టు చూసుకోమని సలహా యిచ్చాడు రిజర్వేషన్ గుమాస్తా. అతని జవాబుకి చికాకేసింది. ఈ ట్రైన్‌కి ఫస్టు క్లాసు కంపార్టు మెంటే కనబడలేదని చెప్పాం.

అతను మమ్మల్ని ఎగాదిగా చూసాడు.

"బృందావన్‌కి ఫస్టుక్లాసు వుండదని ఫస్టుక్లాస్ పాసింజర్లకే ఎ. సి. చెయిర్‌కార్‌లో ఎకామిడేషన్ యిస్తారనీ, ఎ. సి. చెయిర్‌కార్ చార్టు చూసుకోమనీ చెప్పాడు.

చార్టు చూసుకొన్నాం. మా పేర్లున్నాయ్. అయితే మా యిద్దరవీ చెరొక కంపార్టులో వున్నాయ్. ట్రైన్ బయలు దేరడానికి మరొక పావు గంట టైముంది. నా కంపార్టుమెంటులోకి వెళ్ళా. ఎ. సి. ఆన్ చేసివుంది. ఉదయం కావడం వల్ల బాగా చలిగా వుంది. లోపల చాలా యిరుగ్గా వుంది. రెండు చేతుల్లోనూ సామాను. ఆ యిరుకు దారిలోనే ఎదురుగా వస్తూన్న పాసింజర్లను తప్పించుకొంటూ నా సీటు నెంబరు వెతుక్కుంటూ నడుస్తున్నా. క్రిందపరచి వున్న తివాచీ చెప్పుల్ని కరుచు కొంటున్నాయ్. అడుగులు త్వరగా పడటం లేదు. ఎలాగో తంటాలు పడి నా నెంబరు పట్టుకొన్నా. పక్కనే వున్న పద్దెనిమిదో నెంబరు చేర్‌లో "ఆయన" ఆ ఆఫీసరు కూర్చుని వున్నారు. సామాను సర్దుకొని నా చేర్‌లో కూర్చోబోతూ వుంటే "ఆయన" పలకరించారు.

"వాల్తేరునుంచి చూస్తున్నా! ఎక్కడి కెళ్తారు?"

"మైసూరు!" చెప్పాను పొడిగా.

కొద్ది నిమిషాలు మౌనంగా గడిచాయ్.

కంపార్టుమెంటులోని పాసింజర్లు మాట్లాడు కొంటున్నారు. కన్నడం, అరవం, యింగ్లీషూ తప్ప ఎక్కడా తెలుగు మాట వినిపించ లేదు. ట్రైనింకా బయలు దేరలేదు. ఆయన పలకరించాక కూడా మాట్లాడకుండా వుండటం సభ్యత కాదని పించింది.

"క్షమించాలి! మీ రెవరో తెల్సుకోవాలని కుతూహలంగా వుంది!" అన్నా.

తాను శ్రీకాకుళం జిల్లా నుంచి తూ(ర్పు) గోదావరి జిల్లాల వరకు రీజినల్ ఆఫీసర్‌ననీ, బెంగుళూర్ ట్రాన్సుఫర్ అయిందనీ, ప్రస్తుతానికి ఒక్కడినీ వెళ్తున్నాననీ చెప్పారు.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది. రాజమండ్రి దాటాక ఆయన ఏ స్టేషన్లోనూ దిగలేదు. ఎవరూ వచ్చి ఆయన్ని కలవ లేదు. రాజమండ్రిలో పళ్ళవాడు అరటిపండ్లు అందిస్తూ వుంటే, వాటిని తీసుకొని తోటి ప్రయాణీకునికి సహాయ పడాలనే భావం కూడా లేదాయనకు. కంపార్టుమెంటులో ఎన్నోసార్లు ఎదురైనా పలకరించుకో లేదు. ఆయన ప్రవర్తనకు తగినట్టు గానే నేనూ పలకరించ లేదు.

"ఒకరి అవసరం నాకు లేదు!" అని ఎంతటి వాడైనా ఎప్పుడూ అనుకోకూడదు!" అన్న సూక్తి తెల్సినా నేనూ అలాగే ప్రవర్తించా. మొదట్లో పలకరించాలనుకొన్నా. ఆయన పెద్ద ఆఫీసరులా కన్పిస్తున్నాడు. క్లాస్ కాన్షస్‌నెస్ నన్ను పలకరించనీయలేదు.

ఇప్పుడిరువురవూ పరాయి రాష్ట్రంలో పడ్డాం. తోడు వుండాలనే తహ తహ యిద్దరిలోనూ కన్పిస్తోంది. బృందావన్ కదిలింది. కంపార్టుమెంటులోకి బ్రేక్‌ఫాస్ట్ పేకట్లు వచ్చాయ్. మా వరసలో పందొమ్మిదవ నెంబరు చేర్‌లో కిటికీ దగ్గర కూర్చున్నాయన తమిళుడు. ఒక (కాగితం) పేకట్ తీసుకొన్నాడు. అందులో రెండు యిడ్లీలూ మూడు వడా అతి చిన్న సైజులో వున్నాయ్. ప్లాస్టిక్ కప్‌తో చట్నీ ప్లాస్టిక్ స్పూన్ వున్నాయ్. ఆ పేకట్ వెల మూడున్నర! వాటి క్వాలిటీ, క్వాంటిటీ, చూసాక తీసుకోవాలనిపించలేదు. "ఆయన" కూడా తీసుకో లేదు.

మరొకడు దోశలు తెచ్చాడు. ఆయన

## ధర్మపథం

# ఇరుగుపొరుగులు




మానవుడు సంఘజీవి. సంఘాన్ని విడిచిపెట్టి ఒంటరిగా జీవించడం ఎప్పుడూ సాధ్యంకాదు. ప్రతీదానికీ ఇతరులపై ఆధారపడి ఉండవలసే ఉన్నది. ఒక్క మనుష్యుయొక్క మాత్రమే కాదు; ఇతరాలయిన స్థావర జంగమాల యొక్క సహాయం అతనికి కావలసి ఉంది. అన్న వస్త్రాలూ, నివాసము మొదలైనవి మనకు ఎలా లభిస్తున్నదీ కొంచెం ఆలోచిస్తే యీ విషయం స్పష్టంగా తెలుస్తుంది.

జీవనానికి ఇతరుల అవసరమున్నట్లే సుఖ జీవనానికి ఇరుగు పొరుగుల తోడ్పాటు అవసరమే! నిర్జన ప్రాంతంలో ఇల్లు కట్టుకొని అతడు నిర్భయంగా ఉండలేడు. ఇరుగు పొరుగుల ఇళ్లు ఉన్నప్పుడు ధైర్యం కలుగుతుంది. ఏ దిగులూ ఉండదు.

మనకు కష్టసుఖాల్లో ఆప్త బంధువులు, మిత్రులు సహాయపడుతూ వుంటారు. అది నిజమే; కాని వారు మనకు దగ్గరలో ఉండకపోవచ్చును. కాని ఇరుగు పొరుగుల నున్నవారు సన్నిహితంగా ఉంటారు. వారితోడి పరిచయం ఎక్కువగా ఉంటుంది. కష్టసుఖాల్లో వెంటనే ఆదుకునేవారు వారే! బంధుమిత్రులు రావడానికి కొంత ఆలస్యం కావడం సహజం: అందువల్ల ఇరుగుపొరుగులు అతి ప్రధానులు.

ఇరుగు పొరుగుల నున్నవారు అందరూ సత్స్వభావం కలవారే అయి ఉంటారని చెప్పలేము. అయినా, అట్టివారితో మనం అనుకూలంగానూ, స్నేహంగానూ ప్రవర్తిస్తే వారిలో మార్పు కలుగుతుంది. మనంవారి విషయంలో జోక్యం కలుగ జేసుకోకుండా వుంటే మనపై వారికి ద్వేషం ఉండదు. మనకు కష్ట సమయాల్లో సహాయం చెయ్యాలనే సంకల్పం లేకపోయినా లోకుల నిందకు జడిసి అయినా వారు సహాయపడక తప్పదు. వారికి మనపై ఇష్టం లేకపోయినా ఇలా జరగగలదు. ఒకవేళ ఇరుగు పొరుగుల వారు మనలను ద్వేషించినా, దానిని లెక్క చెయ్యకుండా మనం వారిపట్ల స్నేహభావం చూపి, కోరక పోయినా, వారికి కష్ట సమయాల్లో అండగా ఉంటే ఆ విరోధభావం అంతరించిపోతుంది.

ఇరుగు పొరుగుల సౌహార్దమును సంపాదించినయెడల ఎన్నో విధముల సౌకర్యములు కలుగును. అందువల్ల దానికయి సర్వ విధముల ప్రయత్నించుట ఉచితము.

–బులుసు వేంకట రమణయ్య

---

తీసుకున్నారు. రెండు దోశలూ చట్నీ! వెల మూడున్నరే! నాక్కూడా తీసుకోవాలని పించింది. ఈలోగా ఆయనే అన్నారు.

"బావున్నాయ్ వేడిగా! తీసుకోండి!" అంటూ పేకట్‌ని తీసుకొని నా కందించారు. తర్వాత కాఫీ తాగాం. ఒక్కొక్కరి బిల్లు నాలుగున్నరయింది. అయిదు రూపాయల నోటు జేబులోంచి తీసా. నాకన్నా ముందు ఆయన పది రూపాయల నోటు తీసి బేరర్‌కి అందించి వాడిచ్చిన రూపాయి తీసుకొన్నారు. అయిదు రూపాయల నోటుని ఆయన కందివ్వబోయాను. ఆయన తీసుకోలేదు.

"ఫరవాలేదు! ఉండనియండి!" అన్నారు.

అతి బలవంతం మీద ఆ నోటుని అందుకొని తన చేతిలో వున్న ఆ రూపాయి నోటుని నాకిచ్చారు. నేను తిరిగి అర్ధ రూపాయి ఆయనకి బాకీ. చిల్లర లేదు. తర్వాత యిస్తానన్నా. తర్వాత ఆయన నా ట్రైనింగ్ వివరాలు అడిగి తెల్సుకొన్నారు. తిరుగు ప్రయాణంలో బెంగుళూరులో దిగమన్నారు. టౌను చూపిస్తానన్నారు.

ఆయన విషయాలు కూడా అడిగి తెల్సుకొన్నా. వారి స్వగ్రామం అమలాపురం దగ్గర పుల్లేటికుర్రు. మగ అబ్బాయి లిద్దరూ వాల్తేరు యూనివర్సిటీలో చదువుతున్నారు. మరో నాలుగు నెలలు పోతేగానీ కుటుంబాన్ని మార్చడానికి కుదరదనీ, అంతవరకూ వంటరిగానే వుంటాననీ చెప్పారు. తనకి బెంగుళూరు కొత్త కాకపోయినా తన కోసం– స్టేషన్‌కి తన స్నేహితుడు వస్తాడని చెప్పారు.

"నేను బెంగుళూర్ కంటోన్మెంట్‌లో దిగుతా. మీరు సిటీలో దిగాలి. పావు గంట టైములో "టిప్పు" ఎక్స్‌ప్రెస్ బయలు దేరుతుంది. నాలుగున్నరకల్లా మైసూర్ చేరుకొంటారు!" డైరక్షన్ యిచ్చారు.

బంగారంపేట వెళ్లేవరకూ ఏవో కబుర్లు చెప్పుకొన్నాం. తర్వాత ఆయన పేపరు చదవడంలో నిమగ్నులయ్యారు. వారపత్రిక తీసుకొని చదవడం మొదలుపెట్టా.

ట్రైన్ కంటోన్మెంటు చేరగానే కూలీల చేత సామాను పట్టించుకొని దిగారాయన. చాలా సామానుంది. రెండు వి.ఐ.పి. సూట్ కేసులూ, రెండు ఏయిర్‌బేగులూ, హోల్డాలు, రెండు చిన్న బేగులూ. ఒకరు మానేజ్ చేసుకోవడం కష్టమే. కిటికీ దగ్గరున్న పందొమ్మిదో నెంబరు ఆయన కూడా దిగాడు. గుమ్మం దగ్గర కెళ్లి ఆయనకి టాటా చెప్పి తిరిగి వచ్చి, ఖాళీగా కిటికీ దగ్గర చేర్‌లో కూర్చున్నా. కిటికీలోంచి ఆయన కనబడుతున్నారు. సామాను దగ్గరగా వుంచుకొని వెంకటరావుగారి కోసం చూస్తున్నారు. కాలికి ఏదో తగిలేసరికి ముందుకు వంగి చూసా. ఎయిర్‌బేగ్ కన్పించింది. అది ఆయనదే. కిటికీ అద్దంలోంచి ఆయన కనబడు తున్నారు. కానీ పిలవడానికి కుదరదు. కిటికీ ఓపెన్ చేయబడదు. అద్దం పెర్మనెంట్‌గా బిగించబడి వుంది. చివాల్న లేచా. గుమ్మం దగ్గర కెళ్లా. అప్పటికే ట్రైన్ నెమ్మదిగా కదుల్తోంది. అదృష్టవశాత్తూ ఆయన మా బోగీ వైపే చూస్తున్నారు. నా చేతిలో సంచి చూసి పరుగెత్తుకొని వచ్చారు. బేగ్‌ని అందుకొని థేంక్స్ చెప్పారు.

"విష్ యూ ఆల్ ది బెస్ట్!" శుభాకాంక్షలు తెలియ జేస్తూ చేయి వూపుతూ వీడ్కోలు యిచ్చారు. అప్రయత్నంగా కుడిచేతిని ఎత్తి సాల్యూట్ చేసా. ఆయన చేయి వూపుతూనే వున్నారు. కనుమరుగు అయేంతవరకూ ఆయన వైపు చూస్తూ వుండిపోయా! ☐

## వ్యక్తిగతం



మొజాంబిక్ అధ్యక్షుడు సమోరా మాచెల్ ఇటీవల జరిగిన ఒక విమాన ప్రమాదంలో మరణించారు. ఆయన ప్రయాణం చేస్తున్న విమానం దక్షిణ ఆఫ్రికా భూభాగం మీద కూలి పోయింది. మాచెల్‌తో పాటు ఆయన అనుచరవర్గం లోని ప్రముఖులు 30మంది మరణించారు. ప్రిటోరియా కుట్ర కారణంగానే ఆ విమానం కూలిపోయిందని, దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వానిదే ఈ ప్రమాదానికి బాధ్యత అని ప్రముఖ ఆఫ్రికన్ నాయకులు కౌండా, ముగాబే స్పష్టంగా చెబుతున్నారు. వారి ఆరోపణని అంత తేలికగా తీసి వెయ్యటానికి వీలులేదు. ఆఫ్రికన్ జాతీయ కాంగ్రెసు వర్గాలు కూడా దానిని బలపరుస్తున్నాయి... □



పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ నాయకురాలు కుమారి బేనజీర్ భుట్టో (33) తమ ధోరణిని మార్చుకున్నట్లు కనిపిస్తున్నది. వెంటనే ఎన్నికలు జరపాలన్న ప్రచారాన్ని తాము విరమించుకుంటున్నట్లు ఇటీవల ఆమె ఒక ప్రకటనలో వెల్లడించారు. రక్తపాతం నివారించటానికే తాము అలా చేస్తున్నామని, హింస, కల్లోలం మరో జనరల్ అధికారంలోకి రావటానికి దోహదం చేస్తాయని ఆమె అన్నారు. ఆమె తమ పార్టీలోని పాత వారిని తొలగించి వారి స్థానాలలో కొత్తవారిని నియమించారు. ఆమె చర్య ప్రజాస్వామ్య శక్తులని బలహీనపరుస్తున్నదని అందువల్ల జరిగే పరిణామాలకి ఆమే బాధ్యత వహించాల్సి ఉంటుందని పదవి నుంచి తొలగింపబడిన పార్టీ ప్రముఖు డొకరు అన్నారు. పాకిస్తాన్ పీపుల్స్ పార్టీని సంఘటితం చెయ్యటానికి ఆమె అనేక చిక్కులని ఎదుర్కోవాల్సి వస్తున్నది. తమ వ్యక్తిగత పలుకుబడిని రాజకీయ శక్తిగా మార్చటంలో ఆమె విఫలం అయినట్లు కనిపిస్తున్నది. ఆమెని, ఆమె పార్టీలోని ఇతర నాయకులని గత ఆగస్టులో అరెస్టు చేసినప్పుడు ఆమె కుటుంబానికి పలుకుబడి ఉన్న సింధ్ గ్రామీణ ప్రాంతాలలో, కరాచీలో తప్ప వేరెక్కడా పెద్ద ఎత్తున ప్రదర్శనలు జరగలేదు. ఆరు నెలల క్రితం ఆమె స్వదేశానికి తిరిగి వచ్చినప్పుడు బ్రహ్మాండమైన స్వాగతం పలికిన పాక్ ప్రజలు ఆమె నిర్బంధం తర్వాత మౌనంగా ఉండి పోయారు. ఆమె పార్టీలో చీలికలు వచ్చాయి. ఆమె పార్టీ కంచుకోట అనదగిన సింధ్‌లో పా. పీ. పా. అధ్యక్షుడు ఆమె చెప్పినా వినకుండా రాజీనామా చెయ్యటం జరిగింది. ఇదంతా చూస్తుంటే పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్య పునరుద్ధరణ జరగటానికి తగిన సమయం ఇంకా రాలేదనే అనిపిస్తున్నది. □

## వారఫలం

### 21-11-1986 శుక్రవారం మొదలు 27-11-1986 గురువారం వరకు

★ **మేషం :** చిరు దరహాసంతో మీ పనులు సానుకూలం చేసికోండి. అనవసర వ్యవహారాలలో జోక్యం పుచ్చుకోకండి. మీకు అసలే గుండె బలహీనం, లేనిపోని బరువులు నెత్తిన పెట్టుకోకండి. అప్పులుంటే వసూలు చేసికోండి. ఇప్పుడు చెప్పుకోదగిన ఖర్చున్నది. గ్రహిస్తారుగా! స్త్రీలకు : దూర ప్రయాణాలు నిశ్చయమవుతాయి. గమనించాలి.

★ **వృషభం :** మీ రాశికి 21, 22 తా.లు దిగ్విజయ దినాలు. ఏది చేపట్టినా బంగారు పండించినట్లే, ఆరోగ్యం కొంచెం వెనక త్రొక్కుడు త్రొక్కినా ఆదాయానికి ఏమీ లోపం లేదు. ఇష్ట బంధువులు యింటికి వస్తారు. వివిధ రీతుల మేలైన వారంగా భావించి వ్యాపారంగాని, వ్యవహారంగాని సాంగంగా పూర్తిగావించుకోండి. స్త్రీలకు : స్థితియందు మార్పు, ఉత్సాహవంత సమయం.

★ **మిథునం :** 'అదిగాని, యిదిగాని నెరవేర్చుకొందాం' అంటూ కూర్చోరాదు. ఏదో ఒకటి నిశ్చయించి చేపట్టండి. వృత్తి యందు వికాసమున్నది. శుభ కార్యానుకూలతకు అవకాశం. నూతన బంధుత్వం సమకూడుతుంది. కొందరకు అనారోగ్యత చెప్ప వీలైన వారం. ఏ వ్యాధి వచ్చిన రక్త సంబంధమే అని తెలిసికోండి. అధికంగా ఖర్చున్నది. స్త్రీలకు : వస్తు వాహన సేకరణకు అనుకూలం.

★ **కర్కాటకం :** మీ యింట శుభం జరుగనున్నది. ఎలాగైన నిర్వహించాలనుకోవాలిగాని, ఎప్పటికప్పుడు వాయిదా వేయకండి, అదేమంత శ్రేయం? ఏ నాటి వ్యవహారం ఆనాడే చూచుకోవాలి. అది ప్రాజ్ఞ లక్షణం. వ్యాపారమందు లోపం లేదు. స్త్రీలకు : ఉద్యోగ రీత్యాగాని, వృత్తి రీత్యాగాని అనుకూల సాధనకు సమయం అనుకూలం. ఇరుగు పొరుగు జగడాలతో కాలం వ్యయించకండి. మంచిదా? 23, 24 తా.లందు ధనాదాయం.

★ **సింహం :** మీ మాటను కాదనే వారున్నారు. మీ పని సానుకూలమయ్యే మార్గం లేదు. ఇంటా బయటా ఎదురు దెబ్బలు తినవలసి రావచ్చు. ఏదైనా శుభ కార్యం నిర్వహించాలంటే, యిది ఏ మాత్రం అనుకూలం కాదని, అంతేగాక, అనవసర ప్రస్తావనలకు పోరాదని గ్రహించాలి. స్త్రీలకు : విద్యా వైజ్ఞానిక రంగాలలో శ్రద్ధ వహిస్తే మేలున్నది. గ్రహించాలి.

★ **కన్య :** అన్ని విధాలా మీకు అనుకూల వారమే. అయితే ఒక్క మాట. శారీరకంగా యిబ్బంది కలుగుతుందేమో! గ్రహించుకోండి. మీరు ఇటీవల యిచ్చిన డబ్బు కొరకు యత్నించారా? అందుతుంది, గ్రహించి శ్రమించి మేలు పొందండి. స్త్రీలకు : వృత్తి, రీత్యా అనుకూలం, కళా రంగానుభవం రాణిస్తుంది.

★ **తుల :** మీ మాట ఎలాగైనా నెగ్గించుకోవాలని తాపత్రయం. అదెంత వరకు నెరవేరుతుంది? కష్టమే, కాలం అనుకూలంగాదు. విద్యా విషయ సంపన్నులు కావటంతో కొంతలో కొంత మేలు. గ్రహిస్తారుగా! రాజకీయాల జోలికి పోకండి. అది ఏమంత అనుకూలంగాదు, స్త్రీలకు : రాజకీయాలలో ప్రవేశమున్న వారికి మేలే, 27 తా. లాభదాయకం.

★ **వృశ్చికం :** లాభిస్తుంది వారమని మీరు శ్రమిస్తారు, అందు పొరపాటు లేదుగా! వ్యయం అధికం. దాన్నైనా పూడ్చుకొందామంటే చేతగాని పని అవుతుంది. రాజకీయంగా ఏ మాత్రం మేలుగాదు. గ్రహిస్తారుగా! సుఖశాంతులకు లోపం ఏర్పడుతుంది, అయిన వారితో తగాదాలు రావచ్చు. జాగ్రత్తగా గమనించాలి. స్త్రీలకు : వృత్తి యందు లోపం, ఉద్యోగ రీత్యా అనానుకూలం, వ్యవహారం ఏదైనా ఉంటే ఎదురు తిరుగుతుంది. 26, 27 తా.లు ప్రయాణాలు.

★ **ధనుస్సు :** వస్తు వాహన సేకరణకు అనుకూలం. వివిధ రంగాలలో ప్రతిభ భాసిస్తుంది. అయితేనేం? అధిక వ్యయం జరుగుతుంది. విద్యా విషయంగా పెంపుగల వారం. పోటల్లో మిమ్ము మోసం చేసే వారుంటారు, జాగ్రత్త! విపరీతంగా మిమ్ము వ్యాఖ్యానించే వారుంటారు. గమనించండి. స్త్రీలకు : అన్ని విధాలా మేలు, ఆదాయమున్నది. అనుకూల వర్గం వలన ఏదో మేలుంటుంది. 21, 22 తా.లందు డబ్బు అందుతుంది.

★ **మకరం :** నూతన యత్నాలు కొనసాగుతాయి. విశిష్ట వస్తు సేకరణకు అనుకూలం. నూత్న విధాన ఆదాయమున్నది. కృషి లోపం లేకపోతే అన్ని విధాలా మేలు. వృత్తి యందు మేలుంటుంది. కార్మిక వర్గానికి, పత్రికా రంగాన పని చేసే వారికి మేలైన రోజులు. స్త్రీలకు : కళా రంగాన, పత్రికా రంగాన సదవకాశాలు లభ్యం కాగలవు. మాటకు విలువ పెరుగుతుంది, గమనించాలి. 23, 24 తా.లందు కుటుంబానందం.

★ **కుంభం :** విద్యా విధానాన మేలైన వార్తలు వింటారు. 'అక్టోబరు' ఛాన్సు అనుకూలం. గ్రహిస్తారుగా. ఆటపాటలందు మీ ప్రావీణ్యం వికసిస్తుంది. దూర ప్రాంతాల నుండి మిత్రులు బంధువులో యింటికి వస్తారు. వాహనం ఏర్పాటు గావించుకొనే ప్రయత్నాలు చేస్తారు. అనవసరంగా అపవాదు వస్తుందేమో! స్త్రీలకు : యత్న కార్య సిద్ధి, అన్ని విధాల మేలు.

★ **మీనం :** మీ రాశికి గ్రహ మార్పులు, అంటే గ్రహచనంలో అనుకూల మార్పులు వచ్చాయి. అంతా అనుకూలమే. వ్యవహార రీత్యా మేలే. వ్యాపారం బాహాటంగా చేయవచ్చు. లలిత కళా ప్రావీణ్యం భాసిస్తుంది. చేయండి యత్నాలు, అనుకూలమే. వృత్తియందు మేలైన వారమే. స్త్రీలకు : సర్వే సర్వత్రా అనుకూలం, లాభం చేకూరుతుంది. 26, 27 తా.లందు ఎలాగైనా డబ్బు అందుతుంది, గ్రహించాలి.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# పాలాక్షుని షేర్

## వ్యభిచారంతో పేరున్న గ్రామం!

ఒరిస్సా అంగుల్ గ్రామానికి అరవై కిలో మీటర్ల దూరంలో 'తికర పాద' అనే వో గ్రామం వుందట. అనాదిగా యీ గ్రామానికి ముఖ్యవృత్తి వ్యభిచారమట. పురుషులు తమ కూతుళ్ళను, తమ అక్కచెల్లెళ్ళను, చివరికి తమ భార్యలనూ కూడా తామే దగ్గరుండి యీ వ్యాపారం చేయిస్తూ వుంటారట. ఆ వూరు వెళితే భోజన వసతితో కలిపి సకల వసతులూ వారే కలిగిస్తారట. అమాయకులైన పల్లెపిల్లలు తెలిసీ తెలియని వయస్సు నుంచి, బాగా పాకాన్నబడ్డ వయస్సు వారి వరకూ ఎవరి అభిరుచికి వారు ఎన్నుకుని ఉల్లాసంగా గడపవచ్చునట. అలనాటి బ్రిటిషు కాలం నుంచి యీ వూరు యీ వృత్తికి పేరున్నదట. ఇపుడిపుడే యీ వూరు వొదిలి వ్యాపారం కోసం అమ్మాయిలు అంగూరు కూడా వెళుతున్నారట. వూరిలో మహానది - చక్కని బోటు షికారు. పక్కన ఎన్నుకున్నా చిన్నది!

## ఘూర్ఖా దేశం!

పంజాబు సిక్కులంతా ఖలిస్థాన్ అని ప్రత్యేక దేశం తమ కోసం ఏర్పడాలని గలాటా చేస్తూంటే ఘూర్ఖాలందరూ ఒకటిగా చేరి, తమ పేర ఘూర్ఖా దేశం అని విడి దేశం కావాలని ఆరంభించారట. ఈ సమస్యను గురించి పశ్చిమ బెంగాలు ముఖ్యమంత్రి చర్చించడానికి అన్ని పార్టీల లీడర్లనూ ఆహ్వానిస్తే ఆ మీటింగుకు రేణు లీనా సుభా అనే యం. యల్. ఏ. హాజరు కాలేదట. ఆవిడ గూర్ఖాలీగ్ వోట్లతో యం. యల్. ఏ. అయిన వ్యక్తిట. ఆవిడా రోజు కలకత్తాలోనే వున్నారట కూడా. తమిళనాడు అలనాడు డి. యం. కె. పాలనలో వున్నపుడు అప్పటి ముఖ్యమంత్రి కరుణానిధి తమను "ద్రవిడనాడు" అని విడి దేశం ఏర్పడి తీరాలని అననే అన్నారు. ఇలా అయితే బహు భారద్దేశం చైజారిన గాజు భాండం (!) అవదూ!




## అప్పడాల సంస్థ!

కేరళ త్రిచూరుకు చెందిన చెర్పు అనే గ్రామంలో కొందరు ధైర్యవంతులైన స్త్రీలు అప్పడాలు




చేయనారంభించి తమ సంస్థకు చెర్పు గ్రామ వ్యవసాయ సహకరణ సంఘం అని (!) పేరు పెట్టుకున్నారట అందులోని 80 మంది సభ్యులకు కెనరా బ్యాంకు తలా రెండొందల యాభై రూపాయలూ అప్పు యిచ్చిందట. వారు ఆ డబ్బు టకటకా తిరిగి యిచ్చేసి, మళ్ళీ ఋణ సహాయ మడిగితే యీ సారి బ్యాంకు మనిషికి 1800 యిచ్చిందట. దాంతో లక్షా నలభై నాలుగు వేలు పోగయ్యిందట. ఆ మూల ధనంతో మళ్ళీ బ్యాంకు ఋణ సహాయంతో ఆధునిక మిషన్లు అవీ కొని, ఆంధ్రప్రదేశ్ నుంచి మినుములు విరివిగా తెప్పించుకుని, వాటిని నిలువ చేసుకున్నారట. ఇపుడిది పెద్ద సంస్థట!

## కాలువలో యువకుని శవం!

కేరళ కున్నామ్‌కుళంలోని ఓ కాలువలో 27 ఏళ్ళ కృష్ణకుమార్ అనే అతని శవం దొరికిందట. మెకానికల్ ఇంజనీరుగా కృష్ణకుమార్ హైదరాబాదులోనూ, మద్రాసులోనూ లోగడ పని చేశారట. ఈయన చావులో ఏదో మర్మం వున్నదని పోలీసు అనుమానిస్తున్నది.

## పట్టపగలు బ్యాంకు దోపిడి!

అమృత్‌సర్ పంజాబ్ అండ్ సింధ్ బ్యాంకుకు సాయుధులైన యిద్దరు వ్యక్తులు వచ్చి పట్టపగలు ఎంచక్కా డెబ్బయి వేల రూపాయలు తస్కరించి చక్కా పోయారట.

## అనుమానాస్పదమైన స్థితిలో వివాహిత స్త్రీ మరణం!

త్రివేంద్రంకు చెందిన కొట్టుకున్న గ్రామంలో ఇందిర అనే ఒక వివాహిత అనుమానాస్పదమైన స్థితిలో మరణించిందట పోలీసు ఆమె చావును ఆత్మహత్యగా జమకట్టి, ఫైలు మూసేశారట. పెళ్ళయిన 25 వ రోజులోనే ఆమె ఎందుకు ఆత్మహత్య చేసుకోవాలో అర్థం కాని విషయమని, కట్నం హత్యగా దీనిని ఎందుకు పరిశీలించరాదని భాగ్యవతి తంగప్పన్ అనే యం. యల్. ఏ. ప్రభుత్వాన్ని నిలదీశారట ఇందిర పుట్టింటి వారి రిపోర్టును కూడా పోలీసు పెడచెవిన పెట్టినందు వల్ల కేరళ స్త్రీల సంఘం "ప్రబోదన" యీ విషయాన్ని తన చేతుల్లోకి తీసుకున్నదని కూడా ఆవిడన్నారట.

## ఆడంబరంలో అగ్రస్థానం!

సియోల్ ఏషియడ్ క్రీడలలో భారతీయులు వూహా గెల్చుకొచ్చినదేమీ లేకపోయినా ఆడంబరంలో మాత్రం మనదే అగ్రస్థానమట. భారత క్రీడా మంత్రిణి (!) మార్గరెట్ ఆల్వా గారు యీ క్రీడా నగరానికి సకుటుంబంగా వెళ్ళారట. ప్రపంచ దేశాలలో యీ స్థలానికి ఈ హోదాలో వెళ్ళినది యీవిడ ఒక్కరేనట. అది సకుటుంబంగా. మొత్తం క్రీడాకారుల వెంట వెళ్ళిన వారి సంఖ్య 98 అట. అనగా ప్రతి ముగ్గురు ఆటగాళ్ళకూ ఒక అధికారో, లేక ఓ పొలిటిషియనో అన్న లెక్కలో వున్నారట. వెళ్ళిన వారు ఎప్పుడూ వూరు చూడపోడమే గాని, ఆటలు చూడబోయిన పాపాన్న పోలేదట. దట్సిండియా. ☐






(గత సంచిక తరువాయి)

తన ఉత్తరానికి మంజీర సమాధానం రాయలేదు.

సిగ్గుపడిందా?

ఏమో!

భయపడిందా?

కావచ్చు.

తన ఉత్తరం ఆమెకు నచ్చక..... కోపగించుకుందా?

అసాధ్యం.

తన భావుకతనర్థం చేసుకోగల కెపాసిటీ ఆమెకుంది.

"ఈ రేయి నన్నొల్లనేరవా రాజా...." ఆ పాట.... ఆమె కంఠంలో మృదుత్వం.... ఆర్ద్రత తన మనసునింకా హత్తుకునే ఉంది.

అలాపాడే వాళ్ళంతా భావుకులేనా?

నిస్సంశయంగా కాదు.

మరి?

కొన్ని ప్రశ్నలకు జవాబులు పదరూపంలో ఉండవు. అనుభూతుల రూపంలో ఉంటాయి. వాటిని పదాల్లో అనువదించ గలగటం అసాధ్యం. కళాకారుణ్ణి కోటి కళాకారుడే గుర్తించగలడు.

అలాగే.... భావుకతను భావుకుడే గుర్తించగలడు.

గుళ్ళో నాగస్వరం వాయిస్తున్నారు. పడమటకు జారుతున్న పొద్దు అటూ ఇటూ ఊగుతోంది....

**జరిగిన కథ-2:** ప్రణీత్ తండ్రి వెంకట్రామయ్య పైడిపల్లెకు స్కూలు టీచరుగా వచ్చారు. ఆయన భార్య కామేశ్వరి. పట్నంలో చదువుతున్న వారి కుమారుడు ప్రణీత్ పండక్కి పైడిపల్లెకు వస్తాడు. బాబూరావు, శర్వాణిల కూతురు మంజీర -బాబూరావు మాజీ మున్సిపల్ ఛైర్మెన్. మంజీర, హైమ ప్రాణస్నేహితులు. తల్లిలేని హైమ మేనత్త దగ్గర ఉంటూంటుంది. బావ రాజారావుకి హైమంటే ఇష్టం. మంజీరను ప్రణీత్ ప్రేమిస్తున్నాడని తెలుసుకున్న హైమ అతనిని ఆటలు పట్టిస్తుంది. ఏకాంతంగా మంజీరతో మాట్లాడాలనే కోరిక తీరకుండానే పట్నం వెళ్ళిపోతాడు ప్రణీత్. మంజీర తల్లిదండ్రులు, తాతగారు ఆమెను ప్రణీత్‌కిచ్చి వివాహం చేయాలని నిర్ణయించుకొంటారు. ప్రణీత్ మంజీరకు ఓ ఉత్తరం వ్రాస్తాడు. అందులోని భావుకతకి అచ్చెరువొందుతుంది మంజీర.

చలిగా ఉంది.

ఏ మూల కూర్చున్నా... ఎలాంటి బ్లాంకెట్ కప్పుకున్నా చలిగాలి వదలకుండావచ్చి కావలించుకుని, వెన్నును ఒణికిస్తోంది....

ఇప్పుడు మంజూ ఉంటే?!

చలిగాలి భయపడి వెనక్కు తగ్గేది ఒక్క ప్రేయసి ప్రియుల కౌగిలింతలోకి జొరబడటానికి మాత్రమే!....

"ప్రణీత్! సినిమా కెడదామా?" రూమ్మేట్ రాజన్‌వచ్చి అడిగాడు. గదిలో ఒంటరిగా కూర్చుని, చిత్రకారుని స్వప్నంలా ఉండే మంజూను గురించి ఇంకా తలుచుకోవాలనుంది ప్రణీత్‌కి. కానీ.... రాజన్ అతన్ని వదల్లేదు. బలవంతంగా సినిమాకి లాక్కుపోయాడు.

సినిమా సంగీతసామ్రాట్!

"మిళిత గోపావధూజనా... మీనాంక కోటిమోహనా...." జయప్రద డాన్స్ చేస్తుంటే సినిమాహాల్లో ఒక మూలనుంచి పిల్లికూతలు మొదలయ్యాయి.....

జయమాలిని క్లబ్బుడాన్సుల కలవాటుపడి ఆనందించే వాళ్ళకి జయప్రద కూచిపూడి నాట్యం అసహనాన్ని కలిగించటంలో వింత ఏమీలేదు.

కానీ... ఆ సంగీతాన్ని ఇష్టపడే వాళ్ళుంటారేమో.... మనకూతలు దానికి కలపటం సభ్యతకాదు అనే జ్ఞానం మనవాళ్ళలో ఎప్పటికైనా కలుగుతుందా?

నిస్సంశయంగా కలగదు.

సహజగుణాలనేవి సంవత్సరాలు గడిచినా మారవు......

ఇంటికొచ్చేశాక తిరిగి అతని ఊహల నాశ్రయించి, అంతవరకూ అతనిలో పేరుకుని ఉన్న అసహనాన్ని క్షణంలో ఎగరగొట్టింది మంజీర...

ఇప్పుడేం చేస్తోందామె?

తన గురించి ఆలోచిస్తోందా ఇలాగే!?

ఆమెను చూడాలి అనే కోరిక నిలవనివ్వటంలేదు.

ఎలా ఉంటుంది తమ కలయిక?

మామూలుగా అయితే....

భర్త భావుకుడయితే భార్య అతన్నేమాత్రం అర్థం చేసుకోలేని శూన్యహృదయం కలదిగా ఉంటుంది. భార్య విషయంలో భర్త కూడా అంతే.

సాధారణంగా భార్యాభర్తలు ఒకరి వేవ్‌లెంగ్త్‌ని మరొకరందుకోలేరు.

తామిద్దరూ అలాకాదు.

అందుకే తమ కలయిక నదిసాగర సంగమమంత మనోహరంగా ఉంటుంది.....

ప్రణీత్‌కి నిద్రపట్టటంలేదు.

మనసులో ఉండే టెన్షన్‌కి నిద్రకీ బద్ధవైరం.

మనసు ప్రశాంతంగా ఉంచుకుని, టెన్షన్‌ను పారద్రోలినప్పుడు మాత్రమే నిద్రాదేవి కరుణిస్తుంది.

ఆమెకెంత ఈర్ష్య!

"తను కౌగలించుకోబోయే వ్యక్తి కేవలం తన గురించి మాత్రమే ఆలోచించాలి. ఆ మనసులో తనకొక్కదానికే స్థానముండాలి...." అనుకుంటుందామె."

ప్రణీత్ మంజీరకు సంబంధించిన ఊహలకు దగ్గరవుతూ నిద్రాదేవికి దూరమవుతున్నాడు ప్రతిరాత్రీ. అతన్ని జెలసీగా చూస్తూ దూర దూరంగా పారిపోతోంది నిద్ర....

★ ★ ★ ★ ★ ★

"అత్తయ్యా!" వేళ్ళతో తలుపు తట్టింది మంజీర.

తలుపు వెనక అడుగుల చప్పుడు దగ్గరవుతోంది.

తలుపుతీసిన వ్యక్తిని చూసి ఉద్వేగంతో విపరీతంగా స్పందించిందామె....

అతను ప్ర..... ణీ..... త్ కదూ!

అనుకోకుండా ఆమెను చూసిన అతను అలాగే ఫీలయ్యాడు....

"మంజీ!" అన్నాడు అప్రయత్నంగా!

ఆ పిలుపులో నిండిన ఆర్తి.... అనురాగం.... ఆత్మీయత ఆమె మనసును సూటిగా తాకాయి.

"ఎప్పుడొచ్చారు!?" అన్నట్లు కదిలాయామె పెదవులు.

"సాయంత్రం వచ్చాను. రాగానే చెరువు కట్టదగ్గరకొచ్చి... నువ్వు కనపడక నిరాశతో తిరిగి వచ్చేశాను...."

కామేశ్వరి రాకతో కళ్ళతోనే వీడ్కోలు చెప్పుకున్నారిద్దరూ.

"ఏమిటమ్మా, ఇప్పుడొచ్చావు?" ఆదరంగా అడిగింది కామేశ్వరి.

"రేపు అట్లతద్దెగదా అమ్మ గోరింటాకు రుబ్బించింది. ఫైమకూ మీకూ ఇద్దామని తెచ్చాను. ఇదిగో" అంటూ తన చేతిలో గిన్నె కామేశ్వరి కందించింది మంజీర.

"పొద్దున్నే, తెల్లవారుజామున లేచి ఆటలాడుకుంటున్నారామరి?"

"ఆఁ"

కాసేపు ఆ మాటా ఈ మాటా మాట్లాడి వెళ్ళిపోయింది మంజీర.

"తెల్లవారుజామున చెరువుదగ్గరకొస్తుంది మంజీ, తను అక్కడి కొస్తాడని ఆమె ఊహించగలదు.

ఈ మధ్యలో రెండుసార్లు ఊరువచ్చాడతను. అదేం దురదృష్టమో రెండు సార్లు ఆమెను కలవటం కుదరలేదు. ఓసారి ఆమె మేనమామగారింటి కెళ్ళిందట. ఇంకొకసారి కూడా ఇలాగే ఏదో అడ్డుపడింది.

ఈ సారెలాగైనా మంజూను కలిసి మాట్లాడాలి. తన ఉత్తరాని కెందుకు జవాబు రాయలేదో కనుక్కోవాలి...

అట్లతద్దెరోజు ఆడపిల్లలకన్నా ముందే చెరువువేపు వెళ్ళాడు ప్రణీత్. అక్కడి తోటలోనే వాళ్ళు ఆడుకుంటారు.

ఇంకా వెలుగురేఖలు వస్తున్న జాడలేదు. తామరాకులు నీటిమీద పడుకుని నిద్రపోతున్నాయి....

గాలివచ్చి నెమ్మదిగా ఒకమూల కొంచెం ఎత్తి పలకరిస్తుంటే, అలిసి, కళ్ళు మూతలుపడ్డ ప్రియురాలివలె ప్రేమతో చూసి తప్పించుకుని మళ్ళీ పడుకుంటున్నాయి తామరాకులు.

ఈ అనుభూతి తనకు బావుందన్నట్లు మళ్ళీ మళ్ళీ వచ్చి పలకరిస్తోంది గాలి....

ఆడపిల్లలు వచ్చేసి ఆటలు మొదలెట్టారు.

ప్రణీత్ కళ్ళు ఆ గుంపు మధ్యలో తన ప్రియురాల్ని వెతుక్కునే ప్రయత్నంలో పడ్డాయి.

చంద్రకాంతి సన్నని వెలుతురులో....

సన్నని ఒళ్ళు.... చెంపంతా కళ్ళు... సూదిలాంటి ముక్కు...వెన్నెలని మింగేజడ.... గాలిలో కొట్టుకుపోతున్నట్లనిపించే ప్రియురాలి గురించిన



# రంగుల టి.వి., మీకు బ్రాండు పేరు ముఖ్యమా ?
# నాణ్యత ముఖ్యమా ?



కలర్ టి.విని ఎలా ఎంచుకోవాలి? ప్రస్తుతం మార్కెట్‌లో బడాపేర్లు చాలా వున్నాయి. చాలాకాలంగా ఈలైనులో వుండడంవల్ల టి.విని తయారుచేయడంలో తాము ఆరితేరినట్లు వాళ్ళు చెప్పుకుంటూ వుంటారు. కాని అసలు ఇబ్బంది ఏమిటంటే చాలావరకు కీలకమైన భాగాలు మనదేశంలో అసలు తయారుకావడంలేదు. అందుచేత అందరిలాగే ఈ బడాపేర్ల వారు కూడా వాటిని దిగుమతి చేసుకోవాలి మరి.





క్రిష్ణ రు 2650/-



క్రిష్ణ డీలక్స్ రు.2,800/-



కిన్నెర డీలక్స్ 2.960/-




ఆపెల్ సేల్స్-కమ్-సర్వీస్ సెంటర్స్ :-

# అపెల్ పలికే తుది పలుకులు

ఇక ఇటీవల కొందరు ఎకాయెకీన హోల్ సేల్ లో కిట్లు దిగుమతి చేసుకుని బిగించి 'వరల్డ్ క్లాస్ టెక్నాలజీ' అంటూ హైరేటుకి అమ్మేస్తున్నారు. ఈ సెట్లు బాగానే పనిచేయవచ్చు. కాని కొంతకాలానికి సదరు కిట్లుతాలూకు విదేశీతయారీదారు ఆ మోడల్ ని విరమించుకున్నప్పుడు కస్టమర్ పడే బాధలు ఇన్నీ అన్నీకావు.

అసలు పాయింటుకి వస్తే ఇదీ సంగతి. మనదేశంలోనే అన్ని భాగాలు తయారయే తరుణంవచ్చేవరకూ అన్నిటివీ కంపెనీలు ఒకే పడవలో ప్రయాణం చేస్తున్నట్లు లెక్క– చిన్న చిన్న తేడాలతో.

మీరు టి.వి కొనేటప్పుడు చూడవల్సిందల్లా — దాని చిత్రం నాదం బాగున్నాయా? సర్వీసింగ్ సదుపాయాల భరోసావుందా? సెట్టు చూడడానికి బావుందా? ఇక ధర సరసమైనదా కాదా?

ఇక టి.విని ఎంపికచేసేముందు ఒక్కసారి అపెల్ టి.విని చూడండి. అత్యుత్తమమైన దేశీ విదేశీ భాగాల సమ్మేళనంతో అత్యంత సాంకేతిక నైపుణ్యతతో టి.వి.ని రూపొందించి మీ ముందుంచాం. మనదేశపు టి.వి తయారీరంగంలో హేమాహేమీల ఆధ్వర్యంలో అపెల్ టి.వి రూపుదిద్దుకుంది. ఇది ఏళ్ళతరబడి నమ్మకంగా పనిచేస్తుందని హామీ ఇస్తున్నాం.

అపెల్ ఇదంతా ఇంత ధీమాగా ఎలా చెప్పగల్గుతోంది? అవునుమరి లాభార్జనే పరమావధిగా పెట్టుకుని టి.వీలు చేసి అమ్మేకంపెనీలవలే కాకుండా రాష్ట్రంలో ఎలక్ట్రానిక్స్ పరిశ్రమాభివృద్ధికోసం స్థాపించబడిన ప్రభుత్వసంస్థ అపెల్. ఒక ఉన్నత ఆశయసాధనలో అపెల్ టి.వీ మొదటి మెట్టు మాత్రమే. ఆదిలోనే హంసపాదు అపెల్ ముమ్మాటికీ రానివ్వదు.

**A P E L**

**వట్టి మాటలు కట్టిపెట్టి గట్టినాణ్యత పంచిపెట్టే అపెల్.**

ఆంధ్రప్రదేశ్ ఎలెక్ట్రానిక్స్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ లిమిటెడ్
— ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సంస్థ



కావేరి పోర్టబుల్ 14" B/W రు.1,575/–



గంగమార్క్ II కలర్ రు.7,680/–



యమున కలర్ రు.7,500/–



నర్మద (కలర్) రు. 6794 /–

బయటి ఊర్ల అమ్మకాలపై రవాణా, ఇన్స్యూరెన్స్ ఛార్జీలు అదనం.

హైదరాబాద్:
డోర్ నెం.1–10–67, అశోక్‌నగర్ పార్కు ఎదురుగా,

విజయవాడ:
డోర్ నెం.29–6–32, వార్డు నెం.25

విశాఖపట్నం:

# ఒడిలో చెలి మోహన రాగం

అన్వేషణలో పడ్డాడతను.

కనుపించింది! అతన్ని గుర్తించింది.

కానీ ఆమె అతనివంక కన్నెత్తి చూడటంలేదు.... వాళ్ళతో మాట్లాడుతోంది... నవ్వుతోంది... పరుగులు తీస్తోంది... అప్పుడప్పుడు చూపులతో అతన్ని తడమబోయి, మరుక్షణమే సిగ్గుతో తల తిప్పుకుని పారిపోతోంది.

స్నేహితురాళ్ళతో ప్రత్యక్షంగానూ.... ప్రియుడితో పరోక్షంగానూ దాగుడుమూతలాడుతోందామె.....

మంజీర మొహంలోని మెరుపుకూ, ఉత్సాహానికీ తనే కారణమనే విషయం ప్రణీత్‌కి తెలుసు.

అతనికి తెలుసని ఆమెకూ తెలుసు.

కానీ... తలతిప్పి అతన్ని చూడదు. గుర్తించినట్లు కనపడదు. "నువ్వొచ్చావనీ.... ఎందుకొచ్చావో కూడా నాకు తెలుసులే." అనే భావాన్ని ప్రకటింపదు. తెలియనట్లు నటిస్తుంది.

"ఈ చంచలమేకదూ... ఈ నాన్ డిపెండబిలిటీ వేరియబుల్ క్వాలిటీయేకదూ స్త్రీమీద పురుషునీ ఆగ్రహాన్ని గుమ్మరింప చేసేది?!"

"ఈ దుండ మంటాది..... ఇలుదూరిపోతాది.

మాట, యినబడనట్టే మరియేటో చెపుతాది...."

ప్రియురాలి మనసుకు అద్దం పట్టిన చరణాలివి.

కానీ! ఈ ఆటలే.... ఈ కవ్వింపే... ఈ గుంభనే.... మరు నిముషం ఏం చేస్తుందో ఎలా మారుతుందో తెలీని ఈ మిస్టరియే లేకపోతే స్త్రీమీద పురుషుడికింత వెర్రి ఆకర్షణ ఉండేదా?

స్త్రీ పురుషుని హృదయాన్ని మండిస్తుంది. ఆ మంటలోనే మాధుర్యాన్ని పొందేలా చేస్తుంది.

సాధ్యమైనంతవరకూ ప్రణీత్ చూపులరేంజీలోనే తిరుగుతోంది మంజీర. ఎటు పరుగెత్తినా తిరిగి ఆ పరిధిలోకే చేరుకుంటోంది. మెడలో ఉన్న ఒంటిపేట గొలుసు ఆమె ఎత్తయిన గుండెల మీద ఎగిరెగిరి పడుతూ మెరుస్తోంది...... కిలకిలా నవ్వుతోంది. పెదవులు నవ్వుతుంటే బుగ్గలు స్విచ్ నొక్కినట్లు వెలుగుతున్నాయి....

"ఈ నవ్వులు నీ కోసం కాదులే," అన్నట్లు నిర్లక్ష్యాన్ని ప్రకటించబోతుంది.

ఈపళంగా తనిక్కడ నుంచి మాయమయితే?

తప్పకుండా ఆమె ముఖంలో నవ్వు మాయమవుతుంది. ఉత్సాహం నిట్టూర్పుగా మారుతుంది... ఈ బింకం సడలిపోతుంది... వాళ్ళందర్నీ ఒదిలేసి తప్పకుండా తనను వెతుక్కుంటూ వచ్చేస్తుంది...




దాక్కోటానికన్నట్లు అతనికి సమీపంగా వచ్చింది మంజీర... తన ఫ్రెండ్సుకు దొరకకుండా.. అతని వేపు చూడకుండా వీపు అతని వేపు పెట్టి నిలబడిందామె. ఆ తరవాత కొంచెం పక్కకి తిరిగింది అసంకల్పితంగా అనుకునేలా..

ఆ తరువాత అతి నేర్పుగల ఫెన్సింగ్...

అతని కంటపడకుండా అతన్ని స్టడీ చెయ్యాలని ఆమె ప్రయత్నం....

ఆమె చూపుల్ని తన చూపులతో క్రాస్ చేసి కట్టి పడెయ్యాలని అతని పంతం...

ఇద్దరికీ ఒకరి సైలెంట్ ఎక్స్‌ప్రెషన్స్ మరొకరికి తెలుసు... చివరికతనే గెలిచాడు.

చూపుల్లో... చిన్న కదలికలో భావ ప్రకటన చెయ్యగల నేర్పున్న అతి కొద్ది మంది ఆర్టిస్టుల్లో మంజీర ఒకతి...

కళ్ళెత్తి అతన్ని చూసి సిగ్గుగా నవ్వి లేడిలా దూసుకుపోయిందామె తన వారి మధ్యకు...

ఇహ అతని ఉనికినే మర్చిపోయినట్లు ఆటల్లో లీనమయిపోయింది...

అతనటే చూస్తున్నాడు...

ఆమె నుదుటి మీద... కంఠం కింద, జాకెట్ మెడ భాగంలో ఉన్న అందమైన ఒంపు మీద చిరు చెమటలు, జాకెట్ తడిసిన భాగాలు, కొద్దిగా తొలిగిన పైట... ఎగసిపడే వక్షస్థలం.... సరిగ్గా పైట సర్దుకోకపోవటం వల్ల నడుమునుంచి పొట్ట వరకూ నగ్నంగా కనిపిస్తున్న పచ్చని శరీరం...

స్త్రీ అందాన్ని, ఆమె ఏదో పనిలో.. అన్ కాన్షస్ మూడ్‌లో ఉన్న సమయంలోనే కట్టి పడెయ్యాలి.

అప్పుడామెలో పొంగే అందాలను ఏ మాటలు... ఏ గీతలు.. ఏ కుంచెలు... ఏ కలాలు క్యాచ్ చెయ్యగలవు!? గోరింటాకుతో పండిన ఆమె అర చేతుల్ని... పారాణి ఎరుపుతో కూడిన ఆమె పచ్చని పాదాలనీ పెదవులతో తాకాలనుంది.

ఆ ఏకాంతం తమ మధ్య ఎప్పుడేర్పడుతుంది?

ఒక్కసారామెను కలుసుకోవాలి. తన ఉత్తరానికెందుకు సమాధానమివ్వలేదని అడగాలి. ఇంక ముందయినా రాయమనీ.. ఆ మౌనం వీడమనీ వేడుకోవాలి...

తనకంటే ఇష్టమేనా అని అడగాలి.

అదేం ప్రశ్న?

తనంటే ఆమె కిష్టమే...

తను ప్రేమించే మగాడిని చూసినప్పుడుమాత్రమే ఆడపిల్ల మొహంలో ఆ మెరుపు.. బుగ్గల్లో ఎరుపు.. కళ్ళలో చిలిపితనం... పెదవి కదలికలో పెంకెతనం... గడ్డం ఒంపులో గర్వం ఒక్కుమ్మడిగా కనిపిస్తాయి.

వాటినా మగాడు గుర్తించగలడు కూడా.

అప్పుడే ఆమె అతనితో ఇలాంటి చెలగాటాలు మొదలెడుతుంది. అతనితో ఏకాంతాన్ని భయపడుతూ భయపడుతూనే కోరుకుంటుంది.

మంజూని తప్పక ఓసారి కలవాలి.

సూర్యుడు లేచి తూర్పు తెరలను తొలగించుకుని బయటకు రావటం ప్రారంభించగానే అమ్మాయిలు ఆటలాపేసి చెరువు దగ్గరకొచ్చారు..

వాళ్ళతో వెడుతూ వెడుతూ ఆఖరుసారిగా తల తిప్పి ప్రణీత్ వేపు చూసింది మంజీర.

అతని పెదవులు కొంటెగా నవ్వాయి. కళ్ళు స్నేహంగా పలకరించాయి..

నవ్వుతూ గాలిలో తేలిపోతున్నట్లు ముందుకు సాగిందామె.. ప్రణీత్‌కి చాలా ఉత్సాహంగా ఉంది. అంత వరకూ అస్పష్టంగా పెనుగులాడుతున్న తన భావాలకో ఆధారం దొరికింది. ఆమె మొహంలో కనిపించే ఆత్మీయత.. కంటి కొసల్లో నుంచి జారే మెరుపుల్లో గల అనురాగం తనవే. ఆమెతో మాట్లాడకపోయినా.. ఆమెను స్పృశించకపోయినా ఆ అనుభూతి ప్రణయావేశం కన్నా తీవ్రమైన అనుభవాన్ని స్తోందతనికి....

"అయిందిగా చూడటం? ఇహ ఇంటికి పద."

ఉలిక్కిపడి చూశాడు ప్రణీత్.

## ఒడిలో చెలి మోహన రాగం

షైమ!

"నువ్వు వాళ్ళతో వెళ్ళలేదా?!" ఆశ్చర్యంగా అడిగాడు ప్రణీత్.

"ఎవరో ఒకరొచ్చి నిన్ను ఇంటి దాకా గెంటుకెళ్ళకపోతే... ఇలాగే ఊహల్లో తేలిపోతూ ఎన్ని యుగాలైనా అక్కడే ఉండిపోతావనిపించి మధ్యలో వెనక్కొచ్చేశాను మళ్ళీ పెద్దమ్మ ఖంగారుపడుతుంది ఆడపిల్లలతో పాటు ఆటలకెళ్ళిన కొడుకు, వాళ్ళొచ్చేసినా ఇంకా కొంప చేరలేదేమిటా అని..."

"ఛత్! నోర్ముయ్యి," షైమను నవ్వుతూ కసురుకున్నాడు ప్రణీత్.

"లే మరి " అన్నది షైమ.

అతను లేచి ఆమెననుసరించాడు ఈ ఆత్మీయతలో ఒక రకమైన చల్లదనం, నిశ్చింత.

నరాల్ని కాల్చేసే ఉద్వేగం వేరు! మనసుకు స్వాంతననిచ్చే ఈ చల్లదనం వేరు

అయినా . మగాడు ఆ ఉద్వేగానికే ఎక్కువ ప్రాధాన్యతనిస్తాడు ఆ సమరాన్నే ఇష్టపడతాడు అందులో నే కాలిపోవాలనుకుంటాడు

ఇదే సృష్టి రహస్యం.

వాళ్ళ బావ సమక్షంలో షైమ ఇంత ప్రశాంతంగా ఉంటుందా?

ఉండదు

కన్నులలో చంచలత్వం... మాటల్లో తడబాటు. చేతలలో అనురాగం వాటంతటవే వచ్చేస్తాయి .

షైమ చెపుతున్న కబుర్లు వింటూనే తన ఆలోచనలు కొనసాగిస్తున్నాడు ప్రణీత్ ..

*          *          *          *          *

"మంజూను వాళ్ళ ప్రణీత్‌కిచ్చే సంగతి మనం గట్టిగా అనుకుంటే బావుంటుందిగదూ?" అన్నది శార్వాణి, తాతగారూ, భర్త ఇద్దరూ ఉన్న సమయం చూసి-

"గట్టిగా అనుకోటమేమిటి?" అన్నాడు బాబూరావు.

"ఊరికే మనం అనుకోటమేగాని విషయం ఖచ్చితంగా వాళ్ళ చెవిన వెయ్యలేదు గదా. మన పిల్లకి కూడా అతనంటే ఇష్టం. వాళ్ళు మంజూను కోడలుగా చేసుకోవాలని తహ తహలాడుతున్నారు. వాళ్ళ కుటుంబం మంచిది అతను చదువుకుంటున్నాడు. బుద్ధిమంతుడు. ఈడూ జోడూ బావుంటుంది. పెళ్ళి కాగానే "మీ నాన్న ఆస్థి మొత్తం రాయించుకొస్తావా... లేకుంటే నీ మీద డబ్బాడు కిరసనాయిలు పోసి తగలెట్టమంటావా" అనే అత్త మామల సంఖ్య ఎక్కువైపోతున్న ఈ రోజుల్లో వెంకట్రామయ్యగారు, కామేశ్వరమ్మలాంటి వాళ్ళు దొరకటం అదృష్టం నే వెళ్ళి, సాంప్రదాయం ప్రకారం వాళ్ళను మనింటికాహ్వానిస్తాను. నలుగురి సమక్షంలో ఔను అనుకుంటే బావుంటుంది.

గట్టిగా అనుకోటమంటే ఇది "అని వివరించాడు తాతగారు

"సరే మీ ఇష్టం" అన్నాడు బాబూరావు.

ఈ మాట వినగానే మంజీర మోహం విచ్చిన తామరల లే ఎరుపునద్దుకుంది.

తాతగారు వాళ్ళింటికెళ్ళారు .

"మాకెలాంటి అభ్యంతరమూ లేదు. కానీ... ప్రణీత్ చదువయి, ఉద్యోగస్థుడయాక పెళ్ళి చేస్తే బావుంటుందని మా ఉద్దేశ్యం " అన్నాడు వెంకట్రామయ్య.

"అలాగే, కానీ .. ముందుగా తాంబూలాలు పుచ్చేసుకుందాం," అన్నారు తాతగారు.

"ఇంత అడ్వాన్స్‌డ్‌గా ఎందుకు?"

"ఏదో, మా ముచ్చట, అతని చదువు త్వరలో నే పూర్తవుతుంది, అప్పుడు పెళ్ళి చేస్తే... ఉద్యోగమొచ్చాకే కాపరానికి పంపిస్తాం మా అమ్మాయిని."

లోపలికెళ్ళి భార్యతో సంప్రదించి, ప్రణీత్ అభిప్రాయమడిగి బయటకొచ్చాడు వెంకట్రామయ్య.

"మీ ఇష్టంమొచ్చినట్లే కానివ్వండి" అన్నాడాయన..

"పెద్దలంతా కలిసి ముక్త కంఠంతో 'మంజీర నీది' అని చెపుతారు కాబోలు, ఈ తంతు జరిగిన తరువాత, ఆమెను కలుసుకోటానికిగల అభ్యంతరాలు ఇప్పటంత కఠినంగా ఉండవు" ఈ ఆఖరు విషయమే ప్రణీత్ మనసునాకర్షించి అతను ఓకే అనేలా చేసింది

ఆ రోజు నిశ్చితార్థం!

ఓ యాభై మందిని భోజనాల కాహ్వానించారు తాతగారు షైమను తోడు తీసికెళ్ళి పేరంటం పిలుస్తూ "మీ బావ వస్తే .. మంజూతో పాటు నీకు కూడా ఈ తంతు జరిపించేద్దాం" అన్నది శార్వాణి.

"తమకిలాంటి తంతులవసరం లేదు బావ ఎప్పటికి తనవాడే" అనుకుంది షైమ

"మరి.. ప్రణీత్ నమ్మకస్తుడు కాడా?"

"వాళ్ళు ఈ చర్యను నమ్మకం కోసం చేసుకోటం లేదు. ఒక్కతే కూతురని... వేడుక కోసం... ఒక ఆచారాన్ని పాటించటం కోసం మాత్రమే దీన్ని జరుపుతున్నారు" అనుకుందామె. నిజం కూడా ఇదే.

నిండు ఎరుపుకు జరి బార్డర్... చీరంతా జరి బుటా ఉన్న బెనారస్ పట్టుచీర, ఉంగరం కొన్నాడు వెంకట్రామయ్య. బొట్టు పెట్టి, తాము తెచ్చిన వస్తువుల్ని మంజీరకందించింది కామేశ్వరి..

ఆ చీరా, జాకెట్టూ వేసుకుని, తలంటుకున్న జడ నిండా, కనకాంబరాలు, దవనం కలిపి కట్టిన మాల పెట్టుకుని, ఎర్రటి గాజులు నిండుగా వేసుకుంది మంజీర..

ప్రణీత్ ఎదురుగా తల దించుకుని కూర్చుందామె...

హారతి పళ్ళెం పట్టుకుని పాటపాడుతున్నారు ముత్తయిదువులు. తల తిప్పి మంజీర వేపు చూశాడు ప్రణీత్.

ఒంచుకున్న ఆమె తల మీద పచ్చని అక్షింతలు పాపిటలో చిక్కుకుని ఉన్నాయి... పెదవుల చివర్లు సిగ్గు, సంతోషాల కలగలుపుతో చలిస్తున్నాయి ..

ఆ పెదవుల నొక్కసారి చూపుడు వేలుతో తాకితే!

అరచేతి మీద చెంప ఆనించుకుని ప్రణీత్ వేపు చూసి, చప్పున తల తిప్పుకుందామె. ఆ విసుర్శుకు చెవులకున్న రాళ్ళ జూంకిలు, చెవులను కప్పిన జుట్టు సందుల్లో నుంచి తళుక్కున మెరిసాయి.

అతని ఒళ్ళు ఝల్లుమన్నది.

ఎంత అద్భుతమైన విన్యాసం!

ఆ కదలికలో ప్రతిఫలించిన భావాన్ని వర్ణించటం ఎవరితరం? ఎర్రని చీర మధ్య ఒదిగి ఉన్న ఆమె పచ్చని శరీరం ఇంకా పచ్చగా... చేమంతి మడి మధ్య తాజాగా విరిసిన గుండ్రని బిళ్ళ చేమంతి పువ్వును గుర్తుతెస్తోంది...

"లేచి, పెద్దలకు నమస్కరించమ్మా, పెళ్ళి కుమారునికి కూడా," అన్నాడు

---

## పెద్ద పద్దులు!

పార్టీ టిక్కెట్టు మీద గద్దెక్కి

ప్రజాభిప్రాయం అనే కట్టుబాటు వదలి

పార్టీ ఫిరాయించే ప్రబుద్ధులు.

కట్నం బాగా ముట్టాక తాళికట్టి

పెండ్లాడిన భార్యలను బాధలు పెట్టి

వదల గొట్టాలనుకునే సుబుద్ధులు...

ఒకే పట్టికలో వ్రాసి పెట్టదగిన పెద్ద పద్దులు!

ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

పురోహితుడు.

అందరికీ నమస్కరించి నెమ్మదిగా ప్రణీత్ సమీపానికొచ్చింది మంజీర.

"ఏనీల మధుకర విలాస బంధుర తనూలతిక చంచలించిపోగా..." అన్నట్టుంది ఆమె నడక అప్పుడు.

ఒంగి తన పాదాలను తాకబోతున్న మంజీరను మధ్యలో నే బుజాలు పట్టి ఆపాడు ప్రణీత్. ఆమె కళ్ళలోకి అనురాగంగా చూస్తూ "ఒద్దు" అన్నట్టు తల తిప్పాడు.

కళ్ళు వాల్చుకుని చిరునవ్వుతో దూరంగా జరిగిందామె....

"ఓ యబ్బ! ఏం అపురూపమే తల్లీ! కాస్త నడుం ఒంచితే పిల్లాం కంది పోతుందని కాబోలు!" అన్నది ఫ్రేమ మంజీర చెవిలో.... అటు వేపోసారి చూశాడు ప్రణీత్.

ఏమంటున్నది ఫ్రేమ? మంజీర మొహం ఎందుకలా కుంకుమ అద్దినట్టుంది? ఏదో వింత భావనతో మెరిసి పోతోంది. చిరునవ్వు ఒత్తిడికి తట్టుకోలేని ఆ లేలేత పెదవులు సిగ్గుతో చలిస్తున్నాయి....

ఏమిటన్నట్టు కళ్ళతో అడిగాడు ప్రణీత్.

రహస్యం అన్నట్టు తిరిగి అలాగే సౌంజ్ఞ చేసింది ఫ్రేమ వెక్కిరింపుగా....

ఆ రాత్రి అక్కడే భోజనాలు చేసి ఇంటికొచ్చారు.

తిరుగుతున్నారు. మంజూను బయట కెళ్ళకుండా చూడు అని చెపుతా నాయనతో."

"నీ కెందుకంత ఉక్రోషం?"

"ఉక్రోష మేమిటీ? తప్పుకాదూ? పెళ్ళికాని అమ్మాయినలా ఇష్ట మొచ్చినట్టు తిప్పొచ్చా?"

"నువ్వయితే మీ బావ వెంట తిరగొచ్చా?"

"నేను తిరుగుతున్నానా?"

"ఫ్రేమా! నిజంగా.... మీ బావా, నువ్వూ సరదాగా మాట్లాడుకోరా? అతను నీతో ప్రేమగా ఉండడా? నీతో కలిసి తిరగాలనీ, నీ సమక్షంలోనే గడపాలనీ కోరుకోడా? అదేమిటి ఫ్రేమా! అతనికి నువ్వంటే అంత ఇష్ట ముండదా?!" హఠాత్తుగా ప్రణీత్ కంఠంలో ఆర్ద్రత తొంగి చూసింది.

"భలేవాడివిలే నువ్వు! అదేం ఆలోచన? బావకు నేనంటే ప్రేమలేక పోవట మేమిటి? అతను నా కోసం ఎంత తహతహలాడతాడో తెలుసా? అత్తయ్యకు దడిసి బయట కెళ్ళంగానీ.... మా ఇంట్లోనే మాకు బోలెడు ఏకాంతం. అత్తయ్యకు మోకాళ్ళు నెప్పులని మేడపైకి ఎక్కదు. బావ మేడదిగి కిందికి రాదు చాలావరకూ. నేనే అతనికన్నీ అమర్చాలి...." తన్మయంగా అన్నది ఫ్రేమ.

## గడుసులోకం —బాబు




మంజీర తనది. ఈ విషయం అందరికీ తెలిసి పోయింది. ఇప్పుడు తను ఆమె నోసారి ఒంటరిగా కలుసుకున్నా...! ఆ చర్య నెవరయినా చూసినా ఇదివరకటంత గొడవ జరగదు. అభ్యంతరాలు కొంతవరకూ సడలి పోయినట్లే.

* * * *

"ఫ్రేమా! ప్లీజ్! మంజూను ఈ రోజు సాయంత్రం వాళ్ళ తోట దగ్గరకు రమ్మని చెప్పవూ?!" బ్రతిమాలుతున్నట్టుగా అడిగాడు ప్రణీత్.

"మొదలెట్టావూ అప్పుడే! "జై పాతాళభైరవీ" అంటూ అప్పుడే తోట దగ్గర సమావేశాలు, సరసాలు ప్రారంభించాలా? నేను చెప్పను." అన్నది ఫ్రేమ టీజింగ్‌గా.

"ప్లీజ్ ఫ్రేమా!"

"ప్లీజూ లేదు గీజూ లేదు."

"అంతేనా?"

"అంతే!"

"ఛా! నేనే వెళ్ళి పిల్చుకుంటాను."

"బాబూరావు మామయ్యతో చెపుతాను. వీళ్ళిద్దరూ అప్పుడే ప్రేమ ప్రేమని పలవరిస్తూ దేవదాసూ పార్వతిల్లాగా తోట లమ్మట దొడ్లమ్మట

"ఆ ఒంకతో గంటలు గంటలు మాట్లాడేసుకుంటూ ఉంటారా?"

"ఊఁ!"

"చుప్పనాతీ! నువ్వయితే దర్జాగా గంటల తరబడీ హస్కు వేసుకోవచ్చా! ఇంట్లో నీలాగా వీలులేక, కాసేపు ఏకాంతంగా గడపటం కోసం మేము తోట కెడతామంటే మమ్మల్ని పట్టుకు తిట్టి, మామయ్యతో చెపుతానని బెదిరిస్తావా! నిజంగా నువ్వు శూర్పణఖవి!"

ప్రణీత్ తన నెక్కడికి లాక్కెళ్ళాడో.... ఎందుకా ప్రశ్న లడిగాడో అప్పటికి అర్థం చేసుకున్న ఫ్రేమ తన ఓటమికి తనే విరగబడి నవ్వింది.

"చెప్పవా ఫ్రేమా?" ఆమె ప్రసన్నతను కనిపెట్టి మళ్ళీ అడిగాడు ప్రణీత్.

"చెపుతాలే!"

"నిజం?"

"నిజం!"

"థాంక్యూ ఫ్రేమా! థాంక్యూ వెరిమచ్! నీలాంటి చెల్లెలు దొరకటం నిజంగా నా అదృష్టం! ఆ అదృష్టం ఎంత గొప్పదంటే...."

"ఇహ ఆపెయ్యి వందిమాగధా!" అని ఆమె అదుపుపడగానే తనూ నవ్వేశాడు ప్రణీత్.

(ఇంకావుంది)




ఎస్. వి. కె. ఆర్. గుంటూరు

★ ప్చ్. పాపం ఆరుద్రగారు ఎందుకాగడ్డం పెంచేసుకున్నారు?

● దీట్లో పాపం ఏముంది సార్, గెడ్డం పెంచుకునే హక్కు మగవారికి లేదా?!

కె. ఎస్. ఎల్లందు

★ నేను ఎన్నో ఉత్తరాలు రాస్తున్నా. ఒక్కదానికి మీరు సమాధానం యివ్వడం లేదు.

● దీనికేమనివ్వను? అన్నీ యిదే అయి వుంటుంది!

కె.వి.ఎస్.ఆర్. తణుకు

★ విత్తు ముందా? చెట్టు ముందా? కర్మ ముందా? జన్మ ముందా? అని ఎవరూ నిర్ణయించ లేక పోతున్నారు. దీన్ని మీరు నిర్ణయించ కలరా?

● కాలయాపనకి శుష్కతర్కం.... ఏది ముందు ఏది వెనక అని తల బద్దలు కొట్టుకోవడం దేనికో?!

ఎల్.ఎమ్.ఆర్. కోటబొమ్మాళి

★ రాజారామ్మోహనరాయి వంటి వారు మహిళల కెంతో చేస్తే మీరు మగవారి నెందుకు వేలెత్తి చూపుతారు?

● ఒక్క రాజారామ్మోహనుడు మగజాతికి ప్రాతినిధ్యం వహించడు- ఒక్క ఇందిర స్త్రీ జాతికి ప్రాతినిధ్యం వహించనట్టు!

ఎన్. హైదరాబాదు

★ ఆరుద్రగారు ఎంతో మంచివారు. అటువంటి మంచి వ్యక్తికి మీరు దొరకడం మీ అదృష్టమే. నోటిలో వేలు పెడితే కొరకలేని మా ఆరుద్రకు గడగడ వాగే రామలక్ష్మి దొరికిందేమిటా అని మేం ఆశ్చర్య పోతున్నాం.

● మీరంత ఆశ్చర్యపడి పోకండి! ఆయన చాలా తెలివైన వారు-. ఇద్దరికీ కలిపి నేను వాగుతాను. ఆయన హాయిగా కూర్చుంటారు!

★ మీరు, ఆరుద్రగారు మద్రాసులో వుంటా రెందుకు. హాయిగా మన తెలుగు తల్లి ఒడిలో వెచ్చగా ఉండవచ్చుకదా?

● ఏదీ ఎక్కడుందా తెలుగు తల్లి!? చిరునామా చెప్పకలరా?

డి. ఆర్. బళ్లారి

★ నేనొక అందమైన నిరుద్యోగిని. నన్నొక బ్యాంకులో పని చేసే అమ్మాయి పెళ్లి చేసుకోమని బ్రతిమాలుతోంది....

● కొయ్! పగటి కలలు మాని ఏదో ఉద్యోగ ప్రయత్నం ప్రారంభించవయ్యా. అందంగా వుండడం కంటే- శ్రమించి ఆరోగ్యంగా వుండడంలో అందం ఎక్కువ వుంటుంది.

కె.వి.ఆర్. భిలాయి

★ మీ అమ్మాయికి ఎంత కట్నంతో పెళ్లి చేశారు.

● కట్నం యివ్వలేదు. అది మా నమ్మకాలకి విరుద్ధం.

పి.వి.ఆర్. ఖర్గపూరు

★ రచయిత్రిగా మిమ్మల్ని ఆకట్టుకొన్న మీ జీవితంలో జరిగిన ముఖ్యమైన సంఘటన తెల్పుతారా?

● నా జీవితం అంత కలర్‌ఫుల్ కాదు తమ్ముడూ. బొత్తిగా- సాదా సీదా!

జె. ఎన్. విశాఖపట్నం

★ నాకు చిన్న తనంలో నే పెళ్లి అయింది. మాకు బాబు వున్నాడు. మా వారు ఎన్ని తిట్లు తిట్టినా యిదివరకు భరించకల్గేదాన్ని. కాని ఇప్పుడు భరించలేకుండా వున్నాను. సమాధానం యిస్తే యింకా నోటికి వచ్చినట్టు తిడుతున్నారు. రోజూ తాగి వస్తారు. నేను ఉద్యోగం చేస్తున్నాను. అక్కా యిక నాలో ఓపిక నశించింది.... ఏం చేయాలి? చనిపోదామంటే బాబు. దినదినగండం భరించ లేకుండా వున్నాను. మీరు సలహా యివ్వండి.

● మీ మనోవ్యథ నేను అర్థం చేసుకో కలను. పిల్లలు వుంటే ఆడది చచ్చినట్టు ఏం చేసినా పడి వుంటుందని మగవారి భావన. ఇన్నాళ్ళు పడ్డదానికి యిప్పుడేం వచ్చిందనుకుంటారే గాని యింకోలా ఆలో చించలేని అహంకారం వారిది. ఉద్యోగం వుంది. ధైర్యంగా మీరు లాయరుని సంప్రదించండి. బాబు పన్నెండేళ్ల వాడు. వాడికి యింటి విషయం అర్థం అవుతూనే వుంటుంది. ఎదిగీ ఎదగని మనస్సుపై యిటువంటి గృహ వాతావరణం దారుణమైన ప్రభావం చూపుతుంది. మీరు ధైర్యంగా వుండడమే కాదు, వాడు ధైర్యంగా వుండేలా చేయండి. తిరగబడే దాకానే యీ మగవారి ధైర్యం. పెద్దల ముందు యీ వ్యవహారం పెట్టండి. పరిష్కార మార్గం చూసుకోండి. పడి వుండి మానసికంగా ఛస్తూ బ్రతకమని నేను- సలహా చెప్పలేను. ఐయామ్- సారి.

ఎన్.వి.పి. తెనాలి

★ ఇరవై సంవత్సరాలు నాకు. పది దాకా చదివాను. విజయం వరించక చదువు నిలిపాను. ఇన్ని సంవత్సరాలు సుఖంగా పెరగడం వల్ల శారీరక శ్రమ చేయలేను. ఏ చేతి విద్యా నేర్వలేదు. ఇప్పటికీ నేను తండ్రి పోషణలో జీవిస్తున్నాను. నాకు కొద్ది నెలల క్రిందట వివాహం కూడా జరిగింది. ఇప్పుడు ఇద్దరం. మానసికంగా కృంగి పోతున్నాను.....

● శుభం. చేజేతులా జీవితంతో ఆటలాడే వారి బ్రతుకిలాగే వుంటుంది. మిమ్మల్ని కాదు మీకు పెళ్లి చేసిన వారినీ కాదు, మీకు పిల్ల నిచ్చిన వారి ననాలి.... జీవితంలో ఏ రకంగానూ సెటిల్‌కాని మీకెలా వచ్చింది- పెళ్లి చేసుకునే ధైర్యం? ఇప్పటికీ మించి పోయింది లేదు- బ్రతుకు దారి వెతకండి. కూలీ నాలీ చేసినా భార్య సంతోషిస్తుంది- దేహీ అని కన్నవారినేనా అడిగి అన్నం పెట్టే భర్త కంటె.

వి. వి. ఎస్. అల్హాబాదు

★ దేశంలో పేదరికం పోవాలంటే ప్రజలలోను, ప్రభుత్వంలోను నీతి నిజాయితీ వుండాలంటా.

● నిజమే. అది కుదరదు కనుక- అంతదాకా పేదరికాన్నే పెంచి పోషించి- విస్తరింప చేసే పని చేస్తున్నారు రాజకీయ నాయకులు.

ఎల్.ఎల్.డి. రాయగడ

★ రామలక్ష్మిగారూ, ప్రతి ప్రశ్నకి జవాబు రాస్తూంటే- విసుగ్గా వుంటుందా! ఆనందంగా వుంటుందా?

● ప్రతి ప్రశ్నా రాయను. ఒకటి రాస్తే ఓ అయిదారు బుట్ట దాఖలు! అంచేత విసుక్కి ఆనందానికి చెల్లు. □






బాలరంజని పిల్లల పత్రికని చదవండి!

బాలరంజని పిల్లల పత్రికని చదవండి!

బాలరంజని పిల్లల పత్రికని చదవండి!

బాలరంజని పిల్లల పత్రికని చదవండి!

బాలరంజని పిల్లల పత్రికని చదవండి!

ఆ తరువాత....

మీకు మీరే చదువుతారు!

అంతేకాదు అందరినీ చదవమని చెబుతారు కూడా!!

దీని వెల కేవలం రెండు రూపాయలే!

ఇది ఆంధ్రపత్రిక ప్రచురణ!!

Kari

# అభిమాన తారలపై అభిప్రాయం

అతి తక్కువ కాలంలోనే ఎవరెస్టు శిఖరాలంత ఎత్తుకు ఎదిగి ఆంధ్రుల గుండెల్లో కలకాలం చిరంజీవిలాగా ఉండి, వరద వలన నష్టపోయిన పేదప్రజలకు ఏ సినీ నటుడు ఇవ్వక ముందే తన వంతుగా 2 లక్షల రూపాయలను ముఖ్యమంత్రి నిధికి అందజేసిన అగ్రశ్రేణి నటుడు, తాను చివరి క్షణాలలో మూత్రపిండములను, నేత్రాలను దానము





చేస్తానన్న భారత పౌరుడు, పసి పాపాల గుండెల్లో కలకాలం గుర్తుండే చంటబ్బాయి చిత్రంలో అద్భుతంగా నటించిన సుప్రీం హీరో చిరంజీవి నా అభిమాన నటుడు. ఆయన్ని అభిమానిస్తున్న ప్రేక్షకుల కొరకు ఇంకా ఎన్నో మంచి చిత్రాలలో నటించి విజేతగా కలకాలం చిరంజీవిలాగుండాలని ఆశిస్తున్నాను.

–ఓ. విజయలక్ష్మి,
మచిలీపట్నం

* * *

నా అభిమాన నటుడు యువ కథా నాయకుడు "దగ్గుపాటి వెంకటేష్" మొదటి చిత్రం "కలియుగ పాండవులు" లో నే అద్భుతమైన నటనను ప్రదర్శించి, తన కంటూ ఒక ప్రత్యేకమైన బాణిని ఏర్పరచుకొని అటు పరిశ్రమలోను, ఇటు ప్రేక్షక లోకములోను అగ్రనటుల జాబితాలోకి వెళ్ళిపోయారు. రానున్న చిత్రాలలో "బ్రహ్మరుద్రులు, అజేయుడు", విజయఢంకా మ్రోగించాలని కోరుకొంటున్నాను.
కేవలం మాస్ చిత్రాలకే పరిమితం కాకుండా





కథాపరమైన, సెంటిమెంట్ చిత్రాలలో నటించి "సూపర్ స్టార్" కావాలని నా కోరిక.... నా ఆకాంక్ష.

–డి. యస్. చక్రవర్తి,
మంగళగిరి

* * *

ఉత్తమ నటుడంటే హీరోనే అనే అపప్రథ ఉన్న ఈ రోజుల్లో, ఏ పాత్రనైనా అవలీలగా పోషించగల సత్తా ఉన్న నటుడు శరత్‌బాబు అంటే అతిశయోక్తి కాదేమో! 'ప్రతిధ్వని' చిత్రంలో అంత బాగా చేసినా టైటిల్స్‌లో అతని పేరు మొదట పడలేదనే బాధని, 'అరుణకిరణం' చిత్రం ఉపశమింపచేసింది. 'ఏకలవ్య'లో అర్జునుడిగ పౌరాణిక పాత్రను, 'నోము'లో పాలిష్‌డ్ విలన్‌గా 'నిప్పులాంటి మనిషి' (కొత్తది)లో స్నేహితుడిగా 'సీతాకోకచిలుక'లో మాట పట్టింపున్న అన్నగా, 'సాగర సంగమం'లో ఆప్తమిత్రుడిగా, సాంఘిక పాత్రలను, ఇంకా 'స్వాతి ముత్యం, సంసారం ఓ సంగీతం, 47 రోజులు' వంటి ఎన్నో చిత్రాలలో ఉదాత్తమైన పాత్రలను పోషించి శహభాష్ అనిపించుకున్న ఈ స్ఫురద్రూపి 'సంసారం ఓ చదరంగం' చిత్రంతో తెలుగునాట





గూడ హీరోగ ఢంకాబజాయిస్తాడని ఆశిస్తాను.

–పొత్తూరి రాఘవేంద్రరావు, హైదరాబాద్.

* * *

నా అభిమాన నటి కె. విజయ. "బొమ్మరిల్లు" చిత్రంలో ఆమె నటనను మరువలేకపోతున్నాను. ఆమె అగ్ర నటీమణుల కోవకు చెందకపోయినా తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకొని





నటించడం ఆమె ఔన్నత్యానికొక నిదర్శనం. ఆమె కుటుంబ కథా చిత్రాలలోనే నటించడం ఒక గొప్ప విశేషం. వస్త్ర ధారణలో నిండుదనం, నటనలో సహజత్వం ఆమె ప్రత్యేకత. విజయ నటనలో చురుకుగాను, నిజ జీవితంలో సౌమ్యంగాను ఉండడం గమనార్హం. ఆమె యేనాటికైనా గొప్ప నటిగా విరాజిల్లుతుందన్న నమ్మకం నాకున్నది. వచ్చిన చిన్న పాత్రలనైనా ప్రేక్షకులు మెచ్చేటట్టు చేయడం ఈమె ప్రత్యేకత. ఆంధ్ర ప్రేక్షకులు ఆమెను అతి త్వరలో గుర్తించి ఒక ఉన్నత స్థానాన్ని ఆమెకు కల్పిస్తారని ఆశిస్తూ–

–యం. రాజు, నాగలాపురం, (చిత్తూరు)

చిత్ర రంగంలో నలభై ఏళ్ళకు పైగా ఎన్నో విజయవంతమైన చిత్రాలలో నటించిన, నటిస్తున్న ఎవర్‌గ్రీన్ హీరో అక్కినేని నాగేశ్వరరావుగారి అభిమానిని నేను. ఎన్నో చిత్రాల్లో ఆయన నటనా సామర్థ్యము ఎనలేనిది. ఎంత క్లిష్టతరమైన పాత్రలకైనా, అఖిలాంధ్ర ప్రేక్షకులను సులభంగా ఆకట్టుకునే తన హావభావాలతో, అతి సమర్థ





వంతంగా పోషించగల మహానటుడు. అక్కినేనిగారు ఇంతకు ముందులాగా డ్యూయెట్లు పాడకుండా, ఆయన వయసుకు తగ్గ పాత్రల్లో నటించటం హర్షించదగినది. ఇంకా ఆయన కీర్తిని పెంచే పాత్రలలో, గౌరవంగా ఉన్న పాత్రలు నటించాలి.

–డాక్టర్ పి. ఎ. సత్యనారాయణ,
పెందుర్తి, విశాఖపట్టణం.

* * *

నా అభిమాన నటీమణి 'శారద'. ఊర్వశి శారదగా పాపులర్ అయిన ఈమె పలుమార్లు ఉత్తమ నటిగా అవార్డులు గెలుపొందడం గమనార్హం. ఈమె నాటి 'సతీ అనసూయ' నుంచి నేటి 'అనసూయమ్మగారి అల్లుడు' వరకు విభిన్న తరహా పాత్రలకు జీవం పోసి మెప్పించింది. 'అనసూయమ్మగారి అల్లుడు' చిత్రంలో ఉట్టిపడే హుందాతనంతో అత్తగారి పాత్రను మెప్పించిన తీరు శ్లాఘనీయం. న్యాయవాది, న్యాయమూర్తి, పోలీసాఫీసర్ వంటి పాత్రలకు హుందాతనం చేకూర్చి వాటిలో జీవించి





పూర్తి న్యాయం చెకూర్చిన ఘనత ఈమెకు దక్కుతుందని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఇక శోక పాత్రలకు ఈమె పెట్టింది పేరు. రాకెట్ వేగంతో దూసుకుపోతున్న మన చలన చిత్ర రంగంలో ఇక ముందు కూడా ఈమె కళాత్మకతను సంతరించుకున్న ప్రతిష్ఠాకరమైన పాత్రలు ధరించాలని మా ఆకాంక్ష.

–పొట్నూడి చక్రరావు, విశాఖపట్నం.

ఒకనాడు తెలుగు చలనచిత్ర పరిశ్రమను ఉర్రూత లూగించి ఈనాడు తెలుగునాడును మకుటంలేని మహారాజులా ఏలుతున్న గౌ. నందమూరి తారక రామారావుగారి కుమారుడు నందమూరి బాలకృష్ణ గారంటే నాకు చాలా అభిమానము. నటనలో తండ్రిని మించిన తనయుడు కావాలని నా అభిలాష. ఎక్కువగా ఫ్యామిలీ టైపు చిత్రాలలో మరియు పోలీస్ ఆఫీసర్ పాత్రలో, ఛత్రపతి శివాజీ పాత్రలో, రాణా ప్రతాప్‌సింగ్ పాత్రలలో చూడాలని ఉంది. కాబట్టి మంచి ఫ్యామిలీ స్టోరీ ఉన్న చిత్రాలలో




నటిస్తే చాల బావుంటుంది అని నా అభిప్రాయం. నాటి "దాన వీర శూర కర్ణ" నుంచి నేటి "కలియుగ కృష్ణుడు" వరకు నటనలో ప్రత్యేక స్థానం సంపాదించారు. ముమ్ముందు మంచి పాత్రలలో నటించాలని నా కోరిక.

-నాగండ్ల వెంకటేశ్వరరావు, అమ్మాపాలెం, డోర్నకల్.

★ ★ ★

ఎర్రగులాబిగా బడిపంతులు వద్ద చదువు నేర్చుకుంటు పదహారేళ్ల వయస్సు అమ్మాయిగా ఖైదీ రుద్రయ్యను వివాహమాడి, ఘరానా దొంగ వేటగాళ్లపై బాబులుగాడి దెబ్బ కొట్టి, కంచు కాగడా చేపట్టి, పచ్చని కాపురం చేసుకుంటూ బంగారు భూమి యందు వసంత కోకిలై, చుట్టాలొస్తున్నారు జాగ్రత్త అని హెచ్చరిస్తూ, రాణికాసుల రంగమ్మగా మారి, అందరి పాలిట దేవతై వజ్రాయుధం వలె జయం మనదే అని చాటి చెప్పిన అంద చందాల ఏకైక నటి నెం.1 హీరోయిన్ శ్రీదేవి నా అభిమాన నటి




అని చెప్పుటకు సంతోషిస్తున్నాను. అర్ధ నగ్నంగా దుస్తులు ధరించక, కేవలము హింది చిత్రములలో నే కాక తెలుగు చిత్రాలలో కూడా ఎక్కువగా ఆమె నటించాలని నా కోరిక.

-కె. భాగ్యలక్ష్మి, జమ్మలమడుగు, (కడప)

★ ★ ★

నవరసాలను నటనలో ఒలికించి 'దేవాలయం'లో దేవతలా నా హృదయంలో చోటు చేసుకొన్న అందాల తార విజయశాంతి నా అభిమాన నటి. 'నేటి భారతం'లో "భారత మాతను నేను, బందినై పడి వున్నాను". అన్న భరత మాత సంకెళ్లను త్రెంపి ఈ




ధుర్యోధన దుశ్శాసన దుర్వినీతి లోకంలో 'సమాజంలో స్త్రీ'కి జరుగుతున్న అన్యాయాన్ని 'ప్రతిఘటన' ద్వారా ఎదిరించి 'వందేమాతరం' అని ఎలిగెత్తి చాటింది. 'అరుణకిరణం' ద్వారా నీతిని బోధించి నేటి బాలలను 'రేపటి పౌరులు'గా తీర్చి దిద్దింది. తెలుగు నాట తిరుగు లేని కథానాయికగా వెలుగొందాలని నా ఆశ... ఆకాంక్ష.

-ఐ. ఉమారాణి, నరసరావుపేట.

★ ★ ★

నా అభిమాన నటి బ్యూటీ క్వీన్ 'భాను ప్రియ.




'సితార' చిత్రం ద్వారా తెలుగు చలనచిత్ర రంగానికి పరిచయమై నేటి మేటి అగ్ర కథానాయికలలో ఒకరై వున్నది. నటనలో నే కాక నాట్యంలో కూడ సమర్థవంతమైన నటి. 'ఆలాపన, అమెరికా అల్లుడు' దీనికి తార్కాణాలు. నేడు హింది చిత్రాలలో కూడా నటిస్తుందంటే ఆమె నటనే దీనికి కారణం. 'శ్రావణ మేఘాలు' చిత్రంలో ఆమె నటన ప్రశంసనీయం.

-యస్. జానిబాష, పి.డబ్ల్యు.డి. కాలనీ, దూపాడు.

★ ★ ★

సినీ గగనాన వెలసిన ధృవతార జయసుధ. సినీ పరిశ్రమలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని




ఏర్పరుచుకున్న జయసుధ నా అభిమాన నటి. ఎలాంటి పాత్రనైనా అతి సునాయాసంగా నటించి అటు దర్శకులను, ఇటు ప్రేక్షకులను మెప్పించే నటన జయసుధది. నాటి 'జ్యోతి' నుండి నేటి 'ధర్మ పీఠం దద్దరిల్లింది' వరకు అన్ని తరహా పాత్రలు వేసి సినీ పరిశ్రమలో సాటి లేని మేటి నటిగా గుర్తింపు పొందింది. ఇక మీదట కూడా అభిమానుల అభిరుచులకు తగ్గట్టు నటించి సినీ పరిశ్రమలో, ప్రేక్షకుల హృదయాలలో తన స్థానాన్ని చిరస్థాయిగా నిలుపుకోవాలని కోరిక.

-యం. యస్. కృష్ణకుమారి, కొంగారెడ్డిపల్లి, చిత్తూరు.

★ ★ ★

ఆరు భాషల చిత్రాలలో ఆరితేరి, తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకున్న అందాల నటుడు 'కమలహాసన్' నా అభిమాన నటుడు. అనుకోని




పరిస్థితులలో 'మరో చరిత్ర' చిత్రం చూసి నన్ను నేనే మైమరిచాను. ఆనాటి నుండి అతని చిత్రాలను చూస్తున్నాను. 'వసంత కోకిల' చిత్రం ముగింపులో అతని నటన ఎంతటి వారికైన కంట తడి పెట్టేట్టు వుంది. ఆకలి రాజ్యం, సాగర సంగమం, స్వాతి ముత్యం చిత్రాలు అతని నటనకు చక్కని ఉదాహరణలు. ఎప్పుడూ నవ్వుతూ వుండే పెదాలు, చిలిపిగ వుండే మొహం కమల్ ప్రత్యేకత. ఆంధ్రుల హృదయాలలో 'మరో చరిత్ర' సృష్టించిన కమల్‌హాసన్ ఇక ముందు కూడ మంచి చిత్రాలలో నే నటించాలని నా ఆకాంక్ష.

-కొల్లి శ్రీదేవి, భీమునిపట్నణం.

★ ★ ★

చిరంజీవిగారిని అభిమానించే లక్షలాది అభిమానులలో నేనొక చిన్న అభిమానిని. అతని డాన్సు అన్నా, ఫైట్సు అన్నా నేను ఎక్కువగా ఇష్టపడతాను. 'పున్నమి నాగు' చిత్రం చూచి నేను చిరంజీవిగారి అభిమానినయ్యాను. "ఖైదీ, జ్వాలా విజేత, అడవి దొంగ, మగధీరుడు" మొదలుగు




చిత్రాలలో చిరంజీవిగారి పాత్రలు ఎంతో బాగున్నవి. 'విజేత' చిత్రంలోని పాత్ర అందరిచేత ప్రశంసలు అందుకున్నది. అదే విధంగా కటుంబ కథా చిత్రములలోను, పౌరాణిక చిత్రములలో కూడా నటించినట్లయితే చిత్రసీమలో గొప్ప పేరు తెచ్చుకోగలరని నా అభిప్రాయము.

-దువ్వాడ శ్రీకాంత్, కాశీబుగ్గ, రైల్వేకోలనీ.



"దొంగోడొచ్చాడు"లో కృష్ణ, రాధ

## సినిమా విశేషాలు

– జి.వి.జి.

### కృష్ణ సమర్పించే పద్మాలయ వారి "ప్రజారథం"

"ఇది ఫామిలీ సెంటిమెంట్ ఉన్న మరో రాజకీయ సంచలన చిత్రం," అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన దర్శకత్వంలో కృష్ణ నాయక పాత్ర నిర్వహిస్తూ, సమర్పించే పై చిత్రానికి ఎం. వి. ఎస్. హరనాథరావు సంభాషణలు రాస్తున్నారు.

పై చిత్రంతో పాటు రమేష్ హీరోగా ఎం. ఎ. నయూమ్, పి. కమలాదేవి నిర్మించే చిత్రానికి, కృష్ణతో ఎస్. వి. సుబ్బరాజు నిర్మించే చిత్రానికి, బాలాజీ ఫిలిమ్స్ "ముద్దుబిడ్డ", ధర్మవిజయ పిక్చర్స్ వారి కొత్త చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నట్టు పి. చంద్రశేఖరరెడ్డి తెలిపారు. ఇంతవరకు ఈయన అర్ధశత చిత్రాలను పూర్తి చేశారు. విడుదల కానున్న ఈయన చిత్రాలు : "ఖైదీ నాగమ్మ, ఉక్కు సంకెళ్ళు, పరాశక్తి"

### "అల్లుడి కోసం"

"హైద్రాబాద్‌లో నవంబర్ 25 నుంచి డిసెంబర్ 10, జనవరి 9 నుంచి 25 వరకు జరిగే రెండు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు ఎం. ఎస్. కోటారెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బత్తుల రమణయ్య నిర్మించే పై వినోదాత్మక చిత్రంలో చంద్రమోహన్, కల్పన, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, రాళ్ళపల్లి, వేలు, రావి కొండలరావు ప్రభృత నటవర్గం. కాశీ విశ్వనాథ్ రచన, సత్యం సంగీతం, డి. డి. ప్రసాద్ ఛాయ, బాలు శిల్పం, సి. నారాయణరెడ్డి గీతాలు, రావుశ్రీ సంయుక్త దర్శకత్వం, కొంతిబాబు ప్రొడక్షన్, రమేష్ రెడ్డి కూర్పుతో రఘునాథ్ కళాచిత్ర వారి పై చిత్రాన్ని బి. వి. రెడ్డి సమర్పిస్తారు.

### చంద్రోదయా మూవీ క్రియేషన్స "ప్రతిస్పందన"

"మొదటి షెడ్యూల్ అక్టోబర్ 18 తో పూర్తయింది. తదుపరి షెడ్యూల్స్ నవంబర్, డిసెంబర్‌లలో," అన్నారు అనిల్ కుమార్. ఈయన దర్శకత్వంలో జి. పార్థసారథి నిర్మిస్తున్న పై చిత్రంలో అర్జున్, శోభన, శరత్‌బాబు, రాజేష్, గొల్లపూడి, చలపతిరావు, హేమసుందర్, సుమిత్ర, బేబీ సీత నటిస్తున్నారు. పూసల మాటలు, కృష్ణ చక్ర సంగీతం, శరత్ ఛాయ, రామచంద్రసింగ్ శిల్పం, ఆదుర్తి భాస్కర్ సంయుక్త దర్శకత్వం, డి. భాస్కర్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు.

## కృష్ణ, విజయనిర్మల కాంబినేషన్‌లో "దంపతులారా వర్ధిల్లండి!"

"తల్లి మీద అన్యాయంగా మోపబడిన అపనిందను తొలగించడానికి హీరో ఎస్టేట్‌లోకి ఆడిటర్‌గా ప్రవేశించి, ఆ ఎస్టేట్ వ్యవహారాలు చక్కదిద్దుతూ, తల్లి మీది నిందను తొలగిస్తాడు. ఎన్నో మలుపులు గల కథ. నవంబర్ 1 నుంచి 20 వరకు జరిగిన షెడ్యూల్‌లో మైసూర్ పాలెస్‌లో నాలుగు పాటలు చిత్రీకరింపబడ్డాయి. ఉగాది విడుదల" అన్నారు విజయనిర్మల. ఈమె స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి. పద్మనాభం నిర్మిస్తున్న మక్కళ్ తిలకం మూవీస్ వారి పై చిత్రంలో కృష్ణ, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, కోట శ్రీనివాసరావు, గిరిబాబు, సుధాకర్, త్యాగరాజు, వేలు, కె. ఆర్. విజయ, నిర్మల, అనూరాధ పాత్రధారులు. గిరిజశ్రీ భగవాన్ కథకు సత్యానంద సంభాషణలకర్త. వేటూరి గీతాలు. శంకర్ – గణేష్ సంగీతం, లక్ష్మణ్‌గోరే ఛాయ, బి. చలం శిల్పం, ఎం. శేషు, జి. సత్యం సహకార దర్శకత్వం, శ్రీనివాస్ నృత్యాలు, సూపర్ సుబ్బరాయన్ సాహసాలు, ఆదుర్తి హరనాథ్ కూర్పుతో సత్యనారాయణ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్.

## ముగ్గురు నాయకానాయికలతో టి. సుబ్బరామిరెడ్డి చిత్రం

"నవరసాలూ సమపాళ్ళలో ఉన్నాయి గనుకే 'నసీబ్' హిందీ చిత్రం గొప్ప హిట్ అయింది. ఇది మన వాళ్ళను మరింత ఆకర్షిస్తుంది. ఆ దృఢ నమ్మకంతోనే తెలుగులో తీస్తున్నాను. రెండు పాటలను మద్రాసులో రికార్డ్ చేశాం. మిగతా నాలుగు పాటలు బొంబాయిలో రికార్డయ్యాయి. నవంబర్ 15 నుంచి షూటింగ్. పతాక సన్నివేశాల కోసం ఆరు లక్షల వ్యయంతో ఒక బ్రహ్మాండమైన సెట్ వేయిస్తున్నాం. చివరి షెడ్యూల్ ఫిబ్రవరిలో హాంకాంగ్‌లో ప్లాన్ చేశాం," అన్నారు ప్రముఖ పారిశ్రామికవేత్త, కేంద్ర సెన్సార్ బోర్డ్ సభ్యులు, వితరణశీలి; కళాబంధు టి. సుబ్బరామిరెడ్డి. ఈయన సమర్పించే మహేశ్వరి పరమేశ్వరి ప్రొడక్షన్స్ ప్రతిష్ఠాత్మకమైన చిత్రంలో వెంకటేశ్, అర్జున్, కార్తీక్, శోభన, కుష్బు, రమ్యకృష్ణ, రావు గోపాలరావు, సత్యనారాయణ, నూతన్ ప్రసాద్, సుధాకర్, అల్లు రామలింగయ్య, రాళ్ళపల్లి, వేలు, బాలాజీ, మాడా, రమాప్రభతో పాటు హిందీ నటుడు అనుపమ ఖేర్, అలనాటి ప్రసిద్ధ నర్తకి పద్మిని నటిస్తున్నారు. పరుచూరి సోదరులు సంభాషణకర్తలు. బప్పిలహరి స్వరకల్పనలో ఆత్రేయ, సి. నారాయణరెడ్డి, వేటూరి, సీతారామశాస్త్రి గీతాలు రాశారు. ఎస్. గోపాలరెడ్డి ఛాయ, భాస్కరరాజు శిల్పం, విజయన్ సాహసాలు, రఘురాం నృత్యాలతో కె. మురళీమోహనరావు దర్శకుడు. మార్చి విడుదల. పి. శశిభూషణ్ నిర్మాత.

"సామ్రాట్"లో బాలకృష్ణ, విజయశాంతి



# ఆంధ్రసచిత్రవారపత్రిక



## పాఠకులకు అభినేత్రి భానుప్రియ సమాధానాలు!

### త్వరలో ప్రారంభం!

తెలుగు సినిమా ప్రేక్షకుల ఆదరాభిమానాలని విశేషంగా చూరగొన్న ప్రముఖ నటీమణి భానుప్రియ ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారని తెలియచేయటానికి సంతోషిస్తున్నాము. త్వరలో ప్రారంభం కాబోయే ఈ శీర్షికకి పాఠకులు అర్ధవంతమైన ప్రశ్నలని మాత్రమే పంప గోరుతున్నాము. వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో ప్రతివారం భానుప్రియ ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నని పంపిన వారికి ఆటోగ్రాఫ్‌తో ఉన్న ఆమె అందమైన ఫోటో బహుమతిగా లభిస్తుంది. ప్రశ్నలు పంపేవారు తమ ప్రశ్నని ఈ కింది కూపన్‌లో స్పష్టంగా సిరాతో లేదా బాల్ పాయింట్ పెన్‌తో రాసి తమపేరు, పూర్తి చిరునామాతో - సహా "భానుప్రియ సమాధానాలు" శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ –520003 అన్న చిరునామాకి పంపాలి. ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాయాలి. విడిగా రాసి పంపినవి పరిశీలింప బడవు.

పాఠకులు ఈ అవకాశాన్ని ఉత్సాహంతో వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము.

కూపన్.

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ______________________________

______________________________

______________________________

పంపిన వారి పేరు ______________________________

పూర్తి చిరునామా ______________________________

______________________________

## సినిమా

### "భార్గవరాముడు"

"షూటింగ్ దాదాపు పూర్తయినట్లే. నవంబర్‌లో పాచ్ వర్క్ ఊటీలో. బాలకృష్ణ, విజయశాంతిల మీద రెండు పాటలు పిక్చరైజ్ చేస్తాం. అందులో ఒకటి "మన్మథనామ సంవత్సరం." రెండవ పాటలో పరూధిని, ప్రవరాఖ్యులుగా అభినయిస్తారు," అంటూ ఆ రెండు పాటలనూ 'జె. బి. ప్రొడక్షన్స్' అధినేత ఎస్. జయరామారావు వినిపించారు. సంగీత సాహిత్యాలలో చక్రవర్తి, వేటూరి పోటీ పడ్డారా అనిపించేంత మధురంగా ఉన్నాయి. పతాక సన్నివేశాల ముందు ఫైట్‌లో హెలికాప్టర్స్, ఒక ప్లేన్ కూడా పాల్గొంటాయని డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డి తెలిపారు. అక్టోబర్‌లో మురుగాలయ



మేమదు వాపు మీద సినిమా తీస్తున్నాం. దానిలో నటించటానికి పది పందులు కావాలయ్యా!

స్టూడియోలో అత్యధిక వ్యయ ప్రయాసలతో నిర్మించిన భారీ సెట్‌లో ఒక పాటను బాలకృష్ణ, మందాకినిలపై నయనానందకరంగా చిత్రీకరించారు. ఇంకా రావుగోపాలరావు, చంద్రమోహన్, రంగనాథ్, జగ్గయ్య, కోట శ్రీనివాసరావు, వేలు, చలపతిరావు, రచయిత హరనాధరావు, అరుణ, అన్నపూర్ణ, రమణారెడ్డి ప్రభృతులు కూడా నటించారు. కొమ్మనాపల్లి గణపతిరావు కథకు పరుచూరి సోదరులు సంభాషణలు రాశారు. నందమూరి మోహనకృష్ణ ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, సదాశివరావు సంయుక్త దర్శకత్వం, సలీమ్ నృత్యాలు, సాహుల్ సాహసాలు, వై. ఆనంద్ సహకార దర్శకత్వం, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో రావు గోపాలరావు సమర్పణ. సంక్రాంతి కానుక.


నవంబర్
14
విడుదల
ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్
ఈ ప్రశ్నకు బదులేది?
కె.రాఘవ
ఆదిత్య


రాఘవేంద్ర సినీ క్రియేషన్స్
సక్కనోడు
స్క్రీన్‌ప్లే: దర్శకత్వం
నిర్మాత

# జానపద కవిబ్రహ్మ కొసరాజు అస్తమయం

ప్రముఖ చిత్ర రచయిత, జానపద కవి బ్రహ్మ శ్రీ కొసరాజు రాఘువయ్య చౌదరి (80) 1986 అక్టోబరు 27వ తేది రాత్రి మద్రాసులోని ఆయన స్వగృహంలో గుండెపోటుతో హఠాత్తుగా మరణించారు.

శ్రీ కొసరాజు స్వగ్రామం గుంటూరుజిల్లా అప్పికట్ల గ్రామం. ఆయనకు చిన్న వయస్సులోనే 'బాలకవి' బిరుదు లభించింది. 15 ఏళ్ళకే ఆయన అష్టావధానాలు, నేత్రావధానాలు చేసారు.

కొసరాజు పేరుతో పాటలు రాసిన శ్రీ రాఘువయ్య చౌదరి 1937లో గూడవల్లి రామబ్రహ్మంగారు తీసిన 'రైతుబిడ్డ' చిత్రం ద్వారా నటుడుగా, పాటల రచయితగా సినిమా రంగంలో ప్రవేశించారు. ఆ నాడు ఆయన నటించిన "రైతు బిడ్డ" చిత్రం ఎంత సంచలనం కలిగించిందో, అందులో ఆయన రాసిన పాట "నిద్ర మేలుకోరా తమ్ముడా" అంతే సంచలనాన్ని సృష్టించింది.

రైతు కుటుంబంలో జన్మించిన శ్రీ కొసరాజు గత నాలుగు దశాబ్దాలుగా చిత్రసీమలో ఆణిముత్యాలనదగిన ఎన్నో హిట్ చిత్రాలకు పాటలను రాసారు. ముఖ్యంగా "రోజులు మారాయి" చిత్రంలోని



"ఏరువాకా సాగారో రన్నో చిన్నన్నా" అన్నపాట, "కులగోత్రాలు" చిత్రంలోని "అయ్యయ్యో చేతిలో డబ్బులు పోయనే, జేబులు ఖాళీ ఆయనే", అన్న పాట, "ఇల్లరికం" చిత్రంలోని "నిలువవే వాలు కనులదానా వయారి హంస నడకదానా," మొదలైన ఎన్నో పాటలు నేటికీ ప్రేక్షక హృదయాలలో చెరగని ముద్ర వేసుకున్నాయి.

నాటి చిత్రాలకు, నేటి చిత్రాలకు గల వ్యత్యాసాన్ని ప్రస్తావిస్తూ 'ఇప్పటి చిత్రాలలో వేగం పెరిగింది. ఈ వేగానికి మా బోటి పాతతరం వాళ్ళం అలవాటు పడలేకున్నాం,' అని అన్నారు ఆయన.

శ్రీ కొసరాజులో ప్రత్యేక వ్యక్తిత్వం ఉంది. గెలుపు, ఓటములను ఆయన సమానంగా తీసుకునేవారు.

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు 1984లో ఆయనను సత్కరించారు. అప్పుడే ఆయనకు రఘుపతి వెంకయ్య అవార్డు లభించింది. 'గండికోట యుద్ధం' 'కొండవీటి వైభవం' 'కొసరాజు విసుర్లు', 'ఆంధ్ర గీత', 'మిత్ర నీతి' 'నవభారతం' ఆయన గ్రంథాలలో పేర్కొనదగినవి.

ఆయనకు భార్య, ఒక కుమారుడు, కోడలు, ఒక మనుమడు, ఇద్దరు మనుమరాళ్ళు ఉన్నారు. ఆయన కుమారుడు శ్రీ కొసరాజు భానుప్రసాద్ ప్రముఖ చిత్ర నిర్మాత.

శ్రీ కొసరాజు మృతివలన చలనచిత్ర జగత్తులో తీరని వెలితి ఏర్పడింది.

## 1987 లో టి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారి మూడు చిత్రాలు

"జయంమనదే" అనంతరం టి. వెంకటసుబ్బయ్య మూడు చిత్రాల నిర్మాణానికి సన్నాహాలు చేస్తున్నారు. ఎస్. ఎస్. రవిచంద్ర దర్శకత్వం వహించే చిత్రానికి పరుచూరి సోదరులు రచన సాగిస్తున్నారు. కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో అర్జున్ హీరోగా తయారయ్యే చిత్రానికి ఎం. వి. ఎస్. హరనాథరావు స్క్రిప్ట్ తయారు చేస్తున్నారు. రేలంగి నరసింహారావు దర్శకత్వం వహించే చిత్రంలో

## సినిమా

కల్యాణచక్రవర్తి హీరో.

### జి. జి. కృష్ణారావు దర్శకత్వంలో విజయ మాధవీ పిక్చర్స్

"అక్టోబర్ 29 నుంచి నవంబర్ 30 వరకు ఒకే షెడ్యూల్లో రాజమండ్రి పరిసరాలలో గ్రామీణ నేపథ్యంలో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు ప్రముఖ సంకలనకర్త జి. జి. కృష్ణారావు. ఈయన తొలిసారిగా స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఫై సంస్థ చిత్రం వడ్డే శోభనాద్రి సమర్పణలో తయారవుతోంది. 'పెళ్ళి మీకు అక్షింతలు నాకు' చిత్రంలో నటించిన గణేష్ హీరో. బాలాజీ, ప్రభాకరరెడ్డి, రామకృష్ణ, వీరభద్రరావు, చిత్ర, జయంతి, జయభారతి, వరలక్ష్మి, అనూరాధ ఆదిగా గల వారు పాల్గొంటున్నారు. సి. ఎస్. రావు సంభాషణలకర్త. జె. వి. రాఘవులు సంగీతం, పి. ఎల్. రాయ్ ఛాయ, బాబ్జీ శిల్పం, కె. సాంబశివరావు సహకార దర్శకత్వం, సీను నృత్యాలు, మాధవన్ సాహసాలు, వడ్డే కిశోర్ నిర్వహణతో వడ్డే రమేష్ నిర్మాత.

"సంసారం ఒక చదరంగం"లో సుహాసిని, శరత్‌బాబు



"ప్రతిస్పందన"లో శోభన, అర్జున్





''దొంగ మొగుడు''లో చిరంజీవి, రాధిక



''సంకెళ్ళు''లో రాజా, రమ్య

## రాఘవేంద్రరావు, వెంకటేశ్‌లతో ప్రకాశ్ స్టూడియోస్ చిత్రం

"నిరాశా నిస్పృహల మధ్య కొట్టుమిట్టాడుతున్న యువతరానికి ఈ చిత్రం కొంత వరకైనా వెలుగు చూపించగల్గితే మా కృషి అంతా ఫలించినట్టే. అక్టోబర్ 16 నుంచి 30 వరకు మొదటి షెడ్యూల్ జరిపాం. నవంబర్, డిసెంబర్, జనవరిలో ప్రతి నెలా 9–20 తేదిల మధ్య జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు కె. రాఘవేంద్రరావు. ఈయన దర్శకత్వంలో ఈయన తండ్రి కె. ఎస్. ప్రకాశరావు నిర్మిస్తున్న ప్రకాశ్ స్టూడియోస్ వారి చిత్రంలో వెంకటేశ్, కుష్బు, రావు గోపాలరావు, రంగనాథ్, నూతన్‌ప్రసాద్, పి. ఎల్. నారాయణ, వేలు, చలపతిరావు, సంయుక్త, తాతినేని రాజేశ్వరి, నిర్మలతో పాటు ఈ చిత్ర రచయితలు పరుచూరి సోదరులు కూడా పాల్గొంటున్నారు. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, రఘు నృత్యాలు, విజయన్ సాహసాలు, వి. ఎస్. రెడ్డి సంయుక్త దర్శకత్వం, అనిల్ కిశోర్ – స్వామాట్ సహకార దర్శకత్వం, శరత్ – రాజేష్ సహాయ దర్శకత్వం, సత్యం – చంద్రశేఖర్ ప్రొడక్షన్, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు తెరవెనుక హంగులు.

## ''శ్రీ తాతావతారం''లో నరేష్



## "శ్రీ బాల రామాయణం"

శ్రీరామ జననం నుండి సీతారామ కల్యాణం వరకు ఉంటుందీ చిత్రంలో", అన్నారు ఎస్. సాంబశివరావు. ఈయన దర్శకత్వంలో పి. నాగేశ్వరరావు, కె. నాగేశ్వరరావు నిర్మించే గజానన మూవీస్‌వారి పై పౌరాణిక చిత్రంలో సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, గుమ్మడి, కాంతారావు, రఘు, ప్రకాష్‌రాజా, చలపతిరావు, చామర్తి, కుమార్‌బాబా, మాస్టర్ అజయ్, మాస్టర్ కల్యాణ్, కె. ఆర్. విజయ, జయంతి, కృష్ణా ప్రియదర్శిని, సాయి ప్రియదర్శిని, శ్రీవాణి, మరికొందరు నవనటీనటులు పాల్గొంటారు. ఎస్సెస్సార్ కథ, స్క్రీన్‌ప్లే, సంభాషణలు రాశారు. విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి, ఆకొండి విశ్వనాథం, కొడాలి గోపాలరావు కథా విభాగంలో కృషి చేశారు. వేటూరి, సి. నారాయణరెడ్డి, రావుల సూర్యనారాయణమూర్తి, కోట సత్యరంగయ్య శాస్త్రి గీతాలను, శ్లోకాలను రాశారు. ఎం. ఎ. రెహమాన్ ఛాయాగ్రహణ దర్శకత్వం, ఎం. ఎ. దత్ చిత్రీకరణ, ప్రకాశరావు శిల్పం, పసుమర్తి కృష్ణమూర్తి నృత్యాలు, ఉదయశంకర్ సహకార దర్శకత్వం, జయరాం కూర్పుతో దాసరి పార్థసారథిరావు ప్రొడక్షన్ డిజైనర్. □

# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



**అలహరి పద్మావతి, కోట**

సినిమాలు చూసి చెడిపోతారు అని కొందరంటారు. కాని వారి వారి మనస్సు చంచల స్వభావం అంటాను. మిరేమంటారు?

సినిమాలు చూసి చెడిపోతారు అనే భావన మనసులో వున్న వాళ్ళకి ఎన్ని చెప్పినా. ఎంత చెప్పినా వారు మారరు. వారి అభిప్రాయాలు మారవు. మారని వారని మార్చాలని ప్రయత్నించడం చాలా కష్టం.. వృధా ప్రయాసే అవుతుంది.

**వక్కలంక రామారావు, మానేపల్లి**

"సావిత్రి" తర్వాత అంతటి మహానటి ఇంకా పుట్టలేదని అంటాను. మరి మిరేమంటారు.

మీ అభిప్రాయమే నా అభిప్రాయం.

**యన్. రాజ్యలక్ష్మి, విశాఖపట్నం**

జీవితమనే నాటకానికి దర్శకుడు ఎవరు?దర్శకురాలు ఎవరు?

మీకు పెళ్ళి అయి వుంటే సమాధానం మీ దగ్గరే వుంది. కాకుంటే 'భార్యాభర్తలు' అని అంటాను.

**ప్రఖ్యా దాక్షాయణి శర్మ, హైద్రాబాద్**

ఓ వ్యక్తి విజయానికి మానవ ప్రయత్నం, దైవకృప, అదృష్టం, సత్ సంకల్పం కావాలి. మరి మీ విజయానికి ఇందులో ఏది కారణం అయి వుంటుంది.

మీరు చెప్పినవన్నీ కల్సి నా విజయానికి కారణాలై మీ అభిమానం పొందడమే అసలైన కారణం.

**పి. భారతి, కుందేరు**

మా అభిమాన నటి అయిన మీరు కె. విశ్వనాధ్ దర్శకత్వంలో ఏదన్నా చిత్రంలో నటిస్తున్నారా?

ఆ మహాతపస్వి దర్శకత్వంలో నటించే అవకాశం యింతకు ముందు కొన్ని సార్లు కల్గినా కొన్ని అనివార్య కారణాల మూలకంగా చేయలేకపోయాను. అతిత్వరలో ఆ మహా దర్శకుని దర్శకత్వంలో మీ అభిమానాన్ని పొందిన ఓ ప్రముఖ సంస్థ నిర్మిస్తున్న చిత్రంలో నటించనున్నాను. 87 లో ఆ చిత్రాన్ని మీరు చూస్తారు.

## ఉత్తమ ప్రశ్న

**జి. హరిప్రసాదరాజు, మావందికలాన్**

అక్కా! పాదాల పారాణి ఆరకుండానే ఎందరో కన్నెలను బలి తీసుకుంటున్న యీ 'వరకట్న దురాచారం' అంతం అయ్యే మార్గం లేదా?

ఎందుకు లేదు. తప్పకుండా వుంది. మీలాంటి నవయువకులంతా ఏకమైతే వరకట్న రక్కసి కోరలను పీకొచ్చు. నామరూపాలు లేకుండా సమూలంగా నాశనం చెయ్యొచ్చు. ఆ రోజు అతి త్వరలో నే రావాలని, మీరంతా యీ కార్యక్రమానికి పూనుకోవాలని అభిలషిస్తున్నా!

**యస్. రంగనాధ అయ్యంగారు, శివకోడు**

ఈ నాటి మేటి నటి అయిన మీరు మీ చిత్రాల్లోని నృత్యాల్లో శృంగారం శృతి మించుతోందని నా భావన. నాతో ఏకిభవిస్తారా?

నటి అన్నాక అన్ని తరహా పాత్రల్ని పోషించాలి. ఒకే తరహా పాత్రలకు మాత్రమే పరిమితం కాకూడదని నా అభిప్రాయం. చిత్రంలోని సందర్భాన్ని బట్టి వస్త్ర ధారణ జరుగుతుంది. ఆ పాత్రను బట్టి నటించాల్సి వుంటుంది. నేను నటించే పాత్రను చూసే ప్రేక్షకుడు ఆ పాత్రలో లీనమై రసాస్వాదన చేస్తాడు.

నవరసాల్లో శృంగార రసం అతిముఖ్యమైనది. శృంగారం కదా అని పాత్ర పరిధిని దాటి నటించడం జరగదు.

**పుష్పానంద్, యానాం**

మీరు సూపర్ స్టార్ కృష్ణగారితో నటిస్తున్నారా?

నటిస్తున్నాను.

**యం. గిరిప్రసాద్, అమలాపురం**

భార్యాభర్త లిద్దరూ ఉద్యోగం చేస్తే నిరుద్యోగ సమస్య ఎక్కువ అవుతుంది అంటాను.

1960 లో నే మీరు వున్నారని అంటే ఏమనుకోరుగా!

**వి. పి. వ్రతుడు, భూర్గుంపహాడ్**

ప్రేమ పేదరికాన్ని ఆదరిస్తుందా?

ప్రేమికులకు పేద – ధనిక వర్గ భేదాలుండవు.

**యస్. కె. ఆజాబ్, ఖమ్మం**

ఇటు విప్లవాత్మక చిత్రాల్లోనూ ... అటు శృంగారభరిత చిత్రాల్లోనూ మీరు ఎలా నటించగల్గుతున్నారు.

నవరసాల్ని పోషించి మిమ్మల్ని ఆనందపరిచి మీ అభిమానాన్ని అందుకుంటున్నాను కాబట్టే అన్ని రకాల చిత్రాల్లోనూ నటిస్తున్నాను.

**టి. రాజేష్, మచిలీపట్నం**

నటించేటప్పుడు ఆ పాత్రను బట్టి మీరు నటిస్తారా? లేక దర్శకుని ఆదేశానుసారం నటించడం జరుగుతుందా?

పాత్రను మనసులో పెట్టుకుని దర్శకుని సూచనల మేరకు నటిస్తాను.

**మాకర్ల లత, సికింద్రాబాద్**

మన చిత్రాలకు, మన నటినటులకు "ఆస్కార్" వంటి ఇంటర్‌నేషనల్ అవార్డులు రావెందుకని?

కళాతపస్వి కె. విశ్వనాధ్ రూపొందించిన "స్వాతిముత్యం" ఆస్కార్‌కు ఎంపిక అయింది. ఆ చిత్రంలో తప్పక ఏదో ఒక 'ఆస్కార్' అవార్డ్ మనకు వస్తుంది. మీకు కల్గిన అభిప్రాయం తొలగిపోతుంది.

**టి. కృష్ణమోహన్, తాడిపత్రి**

టి. కృష్ణ దర్శకత్వంలో మీ తదుపరి చిత్రం పేరు ఏమిటి?

"భారతనారి" □


హెల్మెట్ B.V.R
నరుడా- ఏమి నీ కోరిక ?
నాకో మాంచి హెల్మెట్ ఇప్పవ స్వామి!!
హెల్మెట్ బరువుగా గాని వుందేవిటండీ!!
మీ తలకి ఏ హెల్మెట్ సరిగ్గా ఫిట్ కావట్లేదు సార్! జుట్టు కట్ చేసుకోవలిసిందే!!
స్కూటర్ తో పాటు హెల్మెట్ కూడా కొనివ్వండి మావయ్య గారు!!
B.V.R
హెల్మెట్ బ్లాకులో కూడ దొరకటం లేదని దీన్తో సరిపెట్టుకొంటాను అంటే ఎలాగయ్యా?
ఇంత ఆలస్యంగానా ఇంటికి రావడం? ముందు ఆ హెల్మెట్ తీసేసి ఇలా దగ్గిరికి రండి!!

# వందనోటు

## వేదుల వెంకట రమణమూర్తి

"కరెక్ట్ టైంకు రోజూ ఆఫీసుకి వెళ్ళామని ఎంత ప్రయత్నించినా అవ్వదు రోజూ ఏదో ఒక ఆటంకం కలగడం ఆఫీసుకి లేటుగా వెళ్ళడం అయిపోతోంది అక్కడకు వెళ్ళాక ఆఫీసరుకి అడ్డమైన సాకులు చెప్పాల్సి వస్తోంది ఛీ! ఛీ! వెధవ బ్రతుకు" తనలో తనే విసుక్కుంటూ ఆఫీసుకి తయారవుతున్నాడు శ్రీనివాసరావు టైం చూసుకున్నాడు తొమ్మిదీ నలభై

ఆఫీసుకి బయల్దేరబోతూ అలవాటు ప్రకారంగా ఆఫీసు తాళాలు, రుమాలు, పర్సులో డబ్బులు వున్నాయో లేవో చూసుకున్నాడు 'అరే! యిందులో రెండొందల రూపాయలుండాలి వందే వుందేమిటి చెప్మా, ఏమిటీ నిన్న ఖర్చు చేయలేదే అవును నిన్న సాయంకాలం ఆఫీసు నుండి యింటి కొచ్చే ముందు కూడా చూసాను. వంద నోట్లు రెండుండేవి. యిప్పుడు ఒక్కటే వుంది" అనుకుంటూ జేబులన్నీ వెదికాడు కనిపించక పోయేసరికి,

"ఏమేవ్! నా పర్సులో డబ్బులు గాని తీసావా?' భార్యను కేకేసాడు శ్రీనివాసరావు

"ఇంత వుదయాన్నే నాకేమిటవసరం, నేనేమీ తీయలేదండీ, అయినా ఎంత వుండాలందులో ' వంటింట్లోంచి వస్తూనే అంది శారద

"రెండు వంద రూపాయల నోట్లు పెట్టానిందులో, యిప్పుడు చూస్తే ఒకటే వుంది మరోటి ఏమైనట్లు?' భార్య కూడా తీయలేదనే సరికి గుండెలో రాయి పడింది శ్రీనివాసరావుకి

"సరిగ్గా గుర్తు తెచ్చుకోండి మర్చిపోయి యింకెక్కడైనా పెట్టేసి వుంటారు.

నీ మొహం! మర్చి పోవడమేమిటి? నిన్న మధ్యాహ్నం నువ్వే కదా చూసావ్, రెండొంద లుండేవా నిన్నంతా నేనేమీ ఖర్చే చేయలేదు అదీ కాక నిన్న సాయంత్రం యింటి కొచ్చే ముందు కూడా చూసాను నాకు బాగా గుర్తు '

"పోనీ! పెద్దబ్బాయి నడగండి తీసేడేమో! అంది శారద

"వాడెందుకు తీస్తాడే నిక్షేపంలా వాడు వుద్యోగం చేస్తుంటే. అయినా నన్నడక్కుండా వాడలా తీయడు ఒకవేళ తీసుంటే మిగిలిన యిద్దరిలో ఎవడో ఒకడు తీసుంటాడు" అన్నాడు శ్రీనివాసరావు సాలో చనగా

'ఒరేయ్! బుచ్చీ!. చంటీ!.." కేకేసాడు శ్రీనివాసరావు పక్క గదిలో స్కూలుకి తయారవుతున్న పిల్ల లిద్దరూ తండ్రి పిలుపుకి గదిలోకి వచ్చారు

"ఎందుకు నాన్నా పిలిచారు "

"నా పర్సులో డబ్బులు ఎవరు తీసార్రా?' అడిగాడు శ్రీనివాసరావు.

'నాకు తెలియదు నాన్నగారూ!' యిద్దరూ ఒకేసారి అన్నారు

"నిజం చెప్పండి! మెల్లగా అడుగుతున్నాను. అబద్ధం ఆడేరంటే మాత్రం వూరుకునేది లేదు! చెప్పండి!" మెల్లగా అన్నా గంభీరంగా అన్నాడు శ్రీనివాసరావు

"నిజంగా నాన్నగారూ! నేనేమీ తీయలేదు భయ భయంగా అన్నాడు తొమ్మిదో తరగతి చదువుతున్న బుచ్చి

"నువ్వు?" చంటి వేపు తిరిగి అడిగేడు శ్రీనివాసరావు.

"నాకెందుకు నాన్నగారూ! అడిగితే మీరే యిస్తారుగా! నిజంగా నేనూ తీయలేదు బిక్కమొహం వేసి అన్నాడు ఏడవ తరగతి చదువుతున్న చంటి

"చూడండి! ఇంట్లో వున్నది మనమే! ఇంకెవ్వరూ రాలేదు అన్నయ్య వుద్యోగం చేసుకుంటున్నాడు కాబట్టి వాడికి తీయాల్సిన అవసరం లేదు, అమ్మ కూడా తీయలేదు ఇంకెవరు తీస్తారు ఇకపోతే మీ యిద్దరూ మీ యిద్దరిలో ఎవరో ఒకరు తీసి వుండాలి. ఆఖరి సారిగా అడుగుతున్నాను చెప్పారా సరే సరి! లేకపోతే ' అంటూ బెల్టు బయటికి తీసాడు శ్రీనివాసరావు.

బెల్టుని చూస్తూనే వులిక్కి పడ్డారిద్దరూ ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు 'నాన్నగారండీ! కొట్టకండి! నిజంగా చెబుతున్నానండి నేను తీయలేదండి ప్రాధేయ పడ్తూ అన్నాడు బుచ్చి

'నాన్నగారూ! నిజంగా నేనూ తీయలేదండి నన్ను వట్టారండి అన్నాడు చంటి ఏ క్షణంలో బెల్టు దెబ్బ మీద పడుతుందోనని భయ భయంగా చూస్తూ

శ్రీనివాసరావు కళ్ళు ఎరుపెక్కాయి బెల్టు పట్టుకున్న చేయి బిగుసుకుంది బెల్టుకి చలనం వచ్చింది. ఒకటి . రెండు మూడు. బెల్టు పిల్లల చర్మాలను తీవ్రంగా తాకుతోంది.

"వద్దండీ! వాళ్ళను కొట్టకండి . . నిజంగా వాళ్ళు తీయలేదేమోనండీ" శారదలోని మాతృ హృదయం తీవ్రమైన బాధకి గురవుతోంది. భార్య మాటలు చెవికెక్కడం లేదు శ్రీనివాసరావు అపర నరసింహావ తారం ఎత్తాడు

'నాన్నగారండీ . కొట్టకండి. నిజమండీ. నేను తీయనే లేదండీ . నాన్న ." పిల్లల అర్థింపు లెక్కడా వినే స్థితిలో లేడు.

ఫ్రెండ్ దగ్గర ఏదో పనుందని వెళ్ళిన పెద్ద కొడుకు కుమార్ యింట్లోకి అడుగు పెడ్తూనే అక్కడి దృశ్యాన్ని చూసి "నాన్నగారూ! ఆగండి! ఏమైంది?, ఎందుకు వాళ్ళనలా కొడుతున్నారు? ఏం చేసారు వాళ్ళు? చెప్పండి?' ఆతృతగా, ఆవేదనగా అడిగాడు

'చూడరా! వీళ్ళు ఏదడిగితే అది యిస్తూ ముద్దుగా చూస్తుంటే యీ రోజు నా పర్సులో వంద రూపాయలు కాజేసారు పైపెచ్చు తీయలేదని దబా యిస్తున్నారు' అంటూ రొప్పుతూ మరో దెబ్బ వేయబోయాడు శ్రీనివాసరావు

'ఓ మై గాడ్! నాన్నగారూ! ఆగండి! మీ పర్సులోంచి వంద రూపాయలు నేను తీసాను " కొట్టబోతున్న తండ్రి చేయి పట్టుకుని ఆపాడు కుమార్

ఆ మాట విన్న శ్రీనివాసరావు నిశ్చేష్టుడై పోయాడు చేత లుడిగిన వాడిలా కళ్ళప్పగించి నిల్చుంది



పోయాడు అంతవరకు కొట్టి కొట్టి అలసి పోయిన, బెల్ట్, చేతిలోంచి జారి కింద పడింది

"అవును నాన్నగారూ! నేనే తీసాను ఈ రోజు వుదయాన్నే మా ఫ్రెండ్‌కి అర్జంటుగా మూడొందలు కావల్సి వచ్చింది నా దగ్గర రెండొంద లుంటే మరో వంద కోసమని మిమ్మల్ని అడుగుదామను కున్నాను. మీరు బాత్రూంలో వున్నారు తరువాత మీకు చెప్పొచ్చు అనుకుని వంద నోటు మీ పర్సులోంచి తీసి మా ఫ్రెండ్ కిచ్చి వస్తున్నాను నేనిప్పుడు అక్కడి నుంచే వస్తున్నాను కానీ నేను మీకు చెప్పేలోగా. మీరు యింత పని చేసారు" అంటూ తమ్ముళ్ళ వైపు తిరిగి 'ఏ పాపం ఎరుగని వీళ్ళని అనవసరంగా కొట్టారు చూడండి ఎలా తట్లు తేలాయో అయినా యింట్లో వున్న అందరినీ అడక్కుండా ఎందుకింత తొందర పని చేయడం? అంటూ తన బాధను, కించిత్ కోపాన్ని తండ్రి ముందు వ్యక్తం చేసాడు కుమార్

ఎంతపని చేసానురా! నువ్వు తీసుంటావని అమ్మ చెప్తున్నా వినిపించుకో లేదు అయినా నువ్వు తీస్తావని కలలో కూడా వూహించ లేదు," అంటూ చిన్న పిల్ల లిద్దర్నీ దగ్గరకు తీసుకుని బుచ్చీ! చంటీ! అనవసరంగా నిర్దాక్షిణ్యంగా మిమ్మల్నిద్దర్నీ కొట్టేసాను బాబూ! మీరు మనసులో నా మీదెంత కోపాన్ని పెంచుకుంటున్నారో మణిపూసల్లాటి మిమ్మల్ని అనుమానించాను మళ్ళీ ఎప్పుడూ యిలా కొట్టను లెండి నా తొందరపాటు యింత పని చేసింది" పశ్చాత్తాపం పడుతున్న శ్రీనివాసరావుకి అప్రయత్నంగా కళ్ళ నీళ్ళు వచ్చేసాయి



# ఇవీ వేమన పద్యాలు




మాటలెల్లఁగల్ల మనసెల్ల మఱి దొంగ
యేటి ప్రాణమింక నేటి నిజము
మాట సత్యమైన మనుశతాయుష్యంబు
విశ్వదాభిరామ వినురవేమ.

## వందనోటు

విషయం తెలిసిన శారదమ్మ కూడా ఎల్లల్నిద్దరినీ దగ్గరకు చేర్చుకొనే, ముద్దాడి వాళ్ళని ఓదార్చింది

శ్రీనివాసరావు అన్యమనస్కంగా ఆఫీసుకి బయలు దేరాడు దారిలో తను చేసిన తొందరపాటు పనికి తిట్టుకుంటూ ఆఫీసుకి చేరుకున్నాడు

రిజిష్టరులో సంతకం చేసి ముభావంగా సీట్లో కూర్చొని ఫైళ్ళు తీయ బోయాడు

నమస్కారం! శ్రీనివాసరావు గారూ! పలక రించాడు కొలీగ్ కృష్ణారావు

నమస్కారం! బుర్రెత్తకుండానే ముబావంగా సమాధానం చెప్పాడు

ఏమిటీ, యీ రోజు చాల సీరియస్‌గా కనిపిస్తున్నారు

'ఏమీ లేదు ఏదో అలా చెప్పటానికి యిష్టం లేక వూరుకున్నాడు

సర్లెండి! మీ స్వంత విషయాలు నా కెందుకు, ఇవిగో మీరు నిన్న సాయంత్రం నా కిచ్చిన వంద రూపాయలూ సరియైన టైంలో ఆదుకున్నారు నిజంగా మీ మేలు మర్చి పోను మెనీ మెనీ థాంక్స్!' అంటూ వంద రూపాయలు శ్రీనివాసరావు చేతిలో పెట్టి వెళ్ళి పోయాడు కృష్ణారావు

అంతే! మరోసారి తల తిరిగి నట్లయింది శ్రీనివాసరావుకి అచేతనంగా చాలాసేపు వుండి పోయాడు అవును! నిజమే! నిన్న సాయంత్రం అర్జంటు అవసరం వుందంటే కృష్ణారావుకి వంద రూపాయ లిచ్చాను, అదే అతడు యిప్పుడు వాపసు యిచ్చాడు మరి మరి కుమార్ నా పర్సులోంచి వంద తీసానన్నాడు అదెక్కడిది వున్నవి రెండొందలే కదా! అలా ఆలోచిస్తున్న శ్రీనివాసరావుకి అంతా అగమ్య గోచరంలా వుంది ఎంత బుర్ర కొట్టుకున్నా అర్థం కావడం లేదు ఇదేదో యింటి కెళ్ళి తెలుసు కోవాలని, పర్మిషన్ తీసుకుని యింటి ముఖం పట్టాడు

ఆలోచిస్తూ యిల్లు చేరుకుని గదిలోకి అడుగు పెట్టబోతూ ఆగిపోయాడు! గదిలో నుండి పెద్దబ్బాయి బుచ్చి, చంటీలతో అంటున్న మాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి

చూడండి! నాన్నగారు మిమ్మల్నిద్దరినీ ఎంతగానో కొడుతుంటే అది చూసి చాల బాధనిపించి నేనే ఆ వంద నోటును తీసానని అబద్ధం చెప్పాను నేను తీసానని తెలిస్తే నాన్నగారు నన్ను ఏమీ అనరని అప్పటికప్పుడు కట్టుకథ అల్లి చెప్పాను నిజానికి నేనూ ఆ డబ్బు తీయలేదు పాపం! నిజంగానే నాన్నగారి డబ్బులు పోయాయి చూడండి! మిమ్మల్ని నేను కొట్టను

కానీ నాకు నిజం తెలియాలి మీలో నిజంగా ఎవరైనా ఆ డబ్బు తీసి వుంటే చెప్పేయండి మీరు తీసినట్లుగా మళ్ళీ నేను నాన్నగార్కి చెప్పను దొంగతనం చేయడం చాలా నీచమైన పని అందులోనూ నాన్నగారు ఎంతో కష్టపడి సంపాదించి మిమ్మల్ని చదివిస్తున్నారు నాన్నగారి జేబులో నుండి డబ్బులు తీయడం తప్పుకాదా? నేను యిలా అబద్ధం చెప్పానని నాన్నగార్కి తెలిస్తే, నా మీద ఎంత కోప్పడతారో తెలుసా? మిమ్మల్ని యిలాటి దొంగపనులు చేయడానికి ప్రోత్సహిస్తున్నానని అంటారు చెప్పండి ఎవరు తీసారు?' బుచ్చి, చంటీలను సముదాయిస్తూ విషయం రాబట్టటాన్కి ప్రయత్నిస్తున్నాడు కుమార్

"నిజంగా అన్నయ్యా! నేనా డబ్బులు తీయ లేదు బుచ్చీ చంటీ అంటూ ఎదురుగా శ్రీనివాసరావుని చూసి ఆశ్చర్యంతో చూస్తుండి పోయారు తండ్రిని చూసి కుమార్ కూడా కొయ్యబారి పోయాడు

కానీ ఆ మాటలు విన్న శ్రీనివాసరావుకి తన పిల్లల్లో వున్న సత్ప్రవర్తన, నిజాయితీలకు చలించి పోయాడు

అవును కుమార్! నిజంగా నా డబ్బు ఎవ్వరూ తీయ లేదు నిన్న సాయంత్రం ఆఫీసు నుండి వస్తుంటే నా కొలీగ్ ఆ డబ్బడిగి తీసుకున్నాడు ఇప్పుడే నాకిది తెలిసింది నా మతిమరుపు యీ రోజు ఎవ్వరికీ మనశ్శాంతి లేకుండా చేసింది ' అంటూ చిన్న వాళ్ళిద్దరి వైపు తిరిగి,

బుచ్చీ! చంటీ! ఇవాళ మనమంతా కలిసి హాయిగా సాయంత్రం సినిమాకు వెళ్ళిపోదాం" అన్నాడు శ్రీనివాసరావు వాళ్ళను సంతోష పరచడానికి

అసలు నిజం తెలిసి నందుకు అందరి కళ్ళల్లోనూ ఆనందంతో కొత్త వెలుగు నింపుకుంది □


సీక్రెట్ ఏజెంట్ విక్రమ్
మోహన్ * దిలీప్‌కదమ్
12
పోలీస్ స్టేషన్‌లో –
మీకీ సమాచారం ఎక్కడ నుంచి వచ్చింది?
టెలిఫోన్ ద్వారా
తప్పకుండా ఆకాశరామన్నదే అయి ఉంటుంది
అవును
డామిట్! నాకు శత్రువులు ఎంతో మంది ఉన్నారు వాళ్ళల్లో ఎవరో చేసి ఉండవచ్చు నింద నా మీద వేస్తున్నారు మీరు పని చేసే తీరు ఇదేనా పోలీస్ ప్రధానాధికారిగారూ?
చాలు ఇక ఆపు మిస్టర్ విక్కీ
పోలీసు ప్రధానాధికారి వెళ్ళిన తర్వాత –
మిస్టర్ విక్కీ ఆ డబ్బుని మరి ఆలస్యం లేకుండా మీరు మా పేర మార్చాలి లేదా బలవంతంగా మమ్మల్నే అది చెయ్యమంటారా?
నాకో రెండు రోజులు గడువివ్వండి
తర్వాత హోటల్‌లో –
రోసి చనిపోయింది హత్య చెయ్యబడింది
అయ్యో! ఎవరు చేసి ఉంటారు?
నాకు తెలియదు రేణూ ఈ వ్యవహారం అంతా వాలా గందరగోళంగా ఉన్నది
ఎవరో మీ కదలికలని చాలా జాగ్రత్తగా గమనిస్తున్నారనిపిస్తున్నది
రేణూ! నువ్విక్కడే ఉండు నేను ఓ గంటలో వస్తాను
విక్రమ్ రోసీ ఇంటి దగ్గరకు వెళ్తాడు –
వెనుక వైపుకి వెళ్ళాలి
నీడల చాటుగా నడుస్తూ పెరటి గోడ దూకి లోనికి ప్రవేశిస్తాడు విక్రమ్
ఇప్పుడు ట్రాన్స్‌మిటర్ కోసం వెతకాలి
(ఇంకా ఉంది)

సీరియల్

# పావని



సి. విమలా గణేశ్

## (గత సంచిక తరువాయి)

ఒకప్పటి కాలేజీ బ్యూటీ పావని అప్పటికీ యిప్పటికి పోలికలే మారిపోయాయని చెప్పవచ్చు. చూస్తున్న దినేష్‌కే చాలా ఆవేదన కలిగింది పావని జీవితం, ఎందుకిలా అయింది? విధి ఎందుకిలా భయంకరంగా ఆడుకుంది? ఆమె గురించి ఆలోచించని క్షణం లేదు. ఆశ చావక విజయ్ కొరకు యింకా వెదికిస్తూనే వున్నాడు. జరుగవలసిన కర్తవ్యం మరువనూ లేదు

ఏనాడూ లేనిది పావని బిడ్డల్ని విసుక్కొని కొట్టడం కూడా మొదలు పెట్టింది అదే సమయంలో దినేష్ లోనికొచ్చాడు

"పావనీ యేమిటీపని?' పిల్లల్నిద్దర్ని దగ్గరకు తీసుకున్నాడు

'అంకుల్!' అంటూ అతుక్కుపోయారు

"పావనీ! నీ కోపం అభం శుభం తెలియని పిల్లల మీదనా?" దినేష్ బాధగా అన్నాడు

నేనే నష్టజాతకురాలి ననుకుంటే నాకంటే ఎక్కువయ్యారు వీళ్ళు నేనెందుకు బ్రతకాలి? ఎవరి కోసం బ్రతకాలి? వీళ్ళు లేకపోతే నేనెప్పుడో యీ అవమానాలకూ, బాధలకూ అతీతంగా వెళ్ళిపోయే దాన్నిగా?"

"అదే పావనీ అదే వద్దన్నా జీవితం సుఖాలతో సంతోషంగా పండుగ చేసుకోవట మొక్కటే గొప్ప కాదు. కష్ట సుఖాల కలయికే జీవితం రెంటినీ అనుభవించక తప్పదు "

కష్ట సుఖాలు రెండూ వుంటే యింకేం? నా జీవితంలో కష్టాలు మాత్రమే కాపురం చేస్తున్నాయి. సుఖమనేది ఎక్కడున్నదో ఎలా వున్నదో కూడ నాకు తెలియదు."

"పావనీ! ప్లీజ్! అలా మాట్లాడకు" అంటూ పిల్లల్ని బుజ్జగించి ముఖం తుడిచి తాను తెచ్చిన స్వీట్సు అందించి, 'పావనీ! నేనొక మాట చెబుతాను, కాదనకు పిల్లలిద్దర్ని నాతో తీసి కెళతాను నా బిడ్డలే అనుకుంటాను నీ చికాకుల్లో నీవు వాళ్ళను సరిగ్గా గమనించడం లేదు అంటున్న దినేష్ ముఖంలోకి అదోలా చూచింది పావని "నిన్ను కూడా వచ్చేయమని ఎంతగా బ్రతిమాలినా వినిపించుకోక పోతివి" బాధతో అన్నాడు

> **జరిగిన కథ-10 :** రైలు యాక్సిడెంట్‌లో విజయ్‌కి చూపు పోయింది దినేష్ ఆనందరావు పెద్ద చెల్లెలు జానకిని వివాహం చేసుకున్నాడు జానకి, దినేష్‌ల దాంపత్య జీవితం సుఖంగా గడిచిపోతోంది బాస్ ట్రాన్సుపోర్టు కంపెనీకి ఇంటర్వ్యూకి వెళ్ళిన పావనికి ఆ కంపెనీ బాస్‌గా మదన్ తారసపడ్డాడు అక్కడ మదన్ చేసిన అవమానం భరించలేక పావని రైలు క్రింద పడి ఆత్మహత్య చేసుకోబోతే దినేష్ ఆమెని రక్షించి ఇంటికి తీసుకువస్తాడు. విజయ్ ఇల్లు వదలి వెళ్ళిపోయాడు.

అన్నయ్యా! నీకంటే నా కింకెవ రున్నారు? తప్పని పరిస్థితుల్లో నీ దగ్గరకు రాక నేనింకెక్కడ తలదాచు కుంటాను?"

"పావనీ!

'కాలం రానీ!"

'అన్నట్టు చెప్పడం మరిచాను విజయ్ ఫోటో పేపర్లో వేయించాను, అతని ఆచూకీ తెలిపిన వారికి మంచి బహుమతి కూడా యిస్తానని" వింటున్న పావని పేలవంగా నవ్వింది

"అన్నయ్యా! మా కోసం నీ వెంతో శ్రమ తీసుకుంటున్నావు కాని అదంతా వ్యర్థం "

అంటే?'

'ఆయన బ్రతికుంటే గదా రావడానికి! గొంతు నిండుకుంది

"అదేం మాట పావనీ!"

'ఔనన్నయ్యా! ఆయన ప్రాణంతో లేరనే నా మనసు గట్టిగా చెబుతూంది

'అలా అనకమ్మా నేనది భరించలేను '

వైరాగ్యంతో కూడిన నవ్వు

అన్ని సరుకులూ తెచ్చానమ్మా!"

'అన్నయ్యా! నీకు చాలా కష్టం కల్గిస్తున్నా కదూ?

"అలా మాట్లాడకమ్మా నేనెంత కష్టపడ్డా నా చెల్లి ముఖంలో మళ్ళీ మునుపటి సంతోషం చూడగలగాలనే కదా?"

సంతోషం!"

పావని! యింకా నీ విక్కడుండటం మంచిది కాదు నీ నిర్ణయం మార్చుకొని నాతో వచ్చెయ్యి"

"అలాగే అన్నయ్యా తప్పక వస్తాను కాస్త టైంపడుతుంది అంతే!"

"త్వరగా రావాలి!"

అలాగే!'

'మరి పిల్లల్ని?"

"నేనంట్లూ వస్తే వాళ్ళూ నాతో నే వస్తారు

"అదో మళ్ళీ!"

"బాధ పడకు వస్తానన్నాగా?

"మరి నే వెళ్ళిరానా?'

"అలాగే?"

"బాబూ, పాపా, అమ్మను విసిగించ కూడదు రేపు మనందరం వెళ్ళిపోదాం ఎంచక్కా కార్లో సరేనా?" అంటూ చెప్పాడు.

"అలాగే అంకుల్!"

"వెళ్ళిరానా?"

"సరే" వెళుతున్న దినేష్‌ను చూచి, "ఎంత మంచి మనసు యింకా ఎంత

కాలం నీకు భారంగా బ్రతకను అన్నయ్యా బాధగా మూల్గింది పావని మనసు

జీవితంలో సర్వమూ కోల్పోయిన పావని నిర్వీర్యంగా కూలబడిపోయింది అప్పుడే యింటి ఓనరు కేశవయ్య లోనికొచ్చాడు

'కేశవయ్యగారా?"

"ఓనమ్మా నేనే ప్రాణంకన్నా మానమే విలువయినదని నమ్మే కేశవయ్యను!"

. . ..

"పావనీ నీ పరిస్థితికి జాలిపడాలో లేక కోపగించుకోవాలో అర్థం కావటంలేదు. యిది సాంప్రదాయిక మయిన, గౌరవమయిన కుటుంబీకులుండే లోగిలి. తర తరాలుగా మచ్చలేనిది మా వంశం నాకు డబ్బుకాదు ముఖ్యం గౌరవం మంచితనం ఒక్కరోజు దాటినా అద్దె కాగని కేశవయ్యగారి వుపోద్ఘాతం

"మీరేమంటున్నారు ? అర్థంగాని పావని.

"నువు వెంటనే యిల్లు ఖాళీ చేయాలి

"ఖాళీయా ఎందుకండి?"

"అదంతా నా నోటితో నే చెప్పించకు!"

"అంటే నేను కాని పనులు చేస్తున్నానా?

"చేస్తున్నావో లేదో నీ మనసుకు తెలుసు, చూస్తున్న లోకానికి తెలుసు

లోకానికేమిటండీ తెలిసేది కాస్త అర్థం అయేటట్లు చెప్పండి

"నీతో వాదించడానికి నేను రాలేదు వెంటనే యిల్లు ఖాళీ చేస్తే మంచిది ఆడపిల్లలు కలవాడిని నాకు మర్యాద ముఖ్యం" కేశవయ్య ముఖంలో భావాలు మారాయి

"కేశవయ్యగారూ మీరు మాట్లాడ్తేది అర్థంలేని ప్రసంగం'

"కావచ్చు. నీ పరిస్థితులు నిన్ను తారుమారు చేసి వుండవచ్చు కాదనను అంత మాత్రాన యిలా పచ్చిగా "

"అంటే?'

'ఆ పోలీసాయనతో నీకు సంబంధం లేదా?"

"కేశవయ్యగారూ" భూమిదద్దరిల్లేలా అరచింది

"ఎందు కలా అరుస్తావ్?'

"ఔను అన్నా చెల్లెళ్ళకే అక్రమ సంబంధం అంటగట్టే పెద్ద మనుషులు మీరు'

"నేనే కాదు లోకమే కోడై కూస్తున్నది '

"ఏమని?"

"నువ్వొక వ్యభిచారివని"

"అలాగా లోకం చూసిందా? లేక మీరు చూశారా?'



# పావని

పిల్లి కళ్ళు మూసుకొని పాలుతాగుతూ లోకమంతా గుడ్డిదని అనుకొంటుందట'

'నిజమే లోకానికి కళ్ళు లేవు అందుకే అన్నారు లోకులు కాకులని'

'పావనీ, నీతో వాదన నాకనవసరం'

మీకు కావలసింది యిల్లు ఖాళీ చేయడం అంతేగా కేశవయ్య ముఖంలోకి బాదగా చూసింది

"ఔను

'కేశవయ్యగారు మీరు నాకో తండ్రిలాంటివారు నోట్లో మాట చెప్పుకోడానికి కూడా యెవరూలేని అనాధను గత అయిదేండ్లుగా నా గురించి తెలుసు మీకు అటువంటి మీరే యిలా మాట్లాడటం అవునులెండి నా పరిస్థితులిలా పలికిస్తున్నాయి భర్తలేనిదాన్ని ఎన్నయినా అంటారు" కన్నీరు కారుతుంది

ఎందుకా కన్నీరు? నీ భర్త నీ భాగోతం వినలేకేగా పారిపోయాడు కళ్ళు లేవుగదా అని యిష్టం వచ్చినట్టు ఆడావు

కేశవయ్యగారూ మరోసారలా అనకండి నేను రాక్షసిగా మారతాను"

మారి ఏం చేస్తావ్

"ఏమయినా చేస్తాను'

అన్నిటికి తెగించిన దానివి పోలీసువారిని లోబరచుకున్నావ్

'నే నెంత మొత్తుకున్నా వ్యభిచారిననే అంటారు అంతేగా" అతనివైపు అసహ్యంగా, అసహనంగా చూచింది

లోకాన్నడుగు

'లోకం' యెదండి లోకం? మీరంతా మనుషలు? ఔనా? తప్పు చేయకూడదు పరపురుషుడితో మాట్లాడితేనే వ్యభిచారి మీ షరువు మర్యాద గౌరవం మంటగలిశాయి ఎందుకు? నేను మీ యింట్లో అద్దెకున్నాను కాబట్టి అంతేనా? నేను తప్పు చేస్తే దండించే అధికారం ఈ సంఘానికి మనుషులకూ వుంది కానీ నేను తిన్నానో లేదో? నా పరిస్థితులేమిటో తెలుసుకునే వాళ్ళున్నారా? కనీసం పట్టె డన్నం పెట్టేవాళ్ళున్నారా? నా మంచి చెడులేమిటో నిజం గ్రహించడానికైనా ప్రయత్నించారా? అటువంటి మీరూ మీ సంఘమూ యెద్దీనిందంటే గాటకట్టమన్నట్టు నా చెడును గురించి అవాకులూ చవాకులూ ప్రేలి హీనంగా చూడటం సబబేనంటారు ఔనా? అయినా నాకు తెలియక అడుగుతాను తప్పు చేస్తే నా శరీరం, నేనూ బాధ పడాలి అంతేగాని మీకు దేనికి బాధ? ఒకటిమాత్రం తెలుసుకొండి కేశవయ్యగారూ మీరనుకున్నట్టు నేను తప్పు చేయదలచుకుంటే యిలా యీ యింట్లో వుండాల్సిన అవసరమూ, మీతో మీ సంఘంతో యిలా కాని మాటలు అనిపించుకోవల్సిన ఖర్మ కలిగి వుండదు'

నీ వుపన్యాసం వినేందుకు కాదమ్మా నే వచ్చింది"

మీ యిల్లు ఖాళీ చేయించడానికంటారు అంతేగా చేస్తానండి తప్పక చేస్తాను, ఎందుకో తెలుసా మీకూ మీ సంఘానికి భయపడి మాత్రం కాదు మంచి మనసున్న ఒక నిర్దోషి నామూలంగా దోషికావడం, సహించలేక అంతే వెళ్ళిపోతాను దూరంగా వెళ్ళిపోతాను

విధి ఘోరంగా విషంకక్కి విషపు కోరలతో వికటంగా నవ్వి విందు భోజనం. చేసింది ప్రతివ్యక్తీ తన్ను దోషిగా చూపి వ్యభిచారి అనే బిరుదిచ్చి సత్కరించారు ఓ మంచి మనిషిని నీచంగా చూపించి వెగటు కలిగించి మంచిని మంటగలపడమే ఘనకార్యంగా భావిస్తుడమే పావని భరించలేక పోయింది

ఆవేదన నిండిన పావని మనసు కకావికలై పోయింది బుద్ధి పనిచేయడం మానేసింది తలా తోకాలేని ఆలోచనలు స్థిరత్వాన్ని కోల్పోయి పిచ్చి పట్టినట్టయి పోయింది తానింతకాలం నీతి మార్గంలో నడచి అనేక యెదురుదెబ్బలు తగులుతున్నా లెక్కచేయక ఓర్పుతో ఆశతో జీవించింది కాని యీనాడు తన ఆశల కన్నిటికీ తిలోదకం వదిలివేసింది తననీ తన సంసారాన్నీ సంవత్సరాల తరబడి చూస్తున్నవారే యీనాడు నిరాశ్రయురాలైన







తనపై నీతిలేనిదనే ముద్రవేసి హేళన చేస్తున్నారంటే యీ సంఘం యెంత బూటకమయినదో అర్థం అయిపోయింది అందుకే రోజీ యీ సంఘాన్ని లెక్క చేయక తృణీకరించి తనదారి తను చూచుకున్నది అమెరికాలో ఎలా వున్నదో యేమో? వెళ్ళిం తరువాత ఒక్క లెటరూ రాయలేదు యీనాడు తనకు మిగిలిన అప్తుల్లో ఒకరు రోజీ, రెండవవారు దినేష్ నాకోసం నా ఆనందం కోసం యేమిచేయడానికయినా వెనుదీయనివారు అలాగని నేనూ నా యిద్దరి పిల్లలతోటి వారి జీవనానికి గుదిబండలాగా తయారవడం మనస్కరించతంలేదు కాలేజీలో చదువుకునేటప్పుడు ఎన్నెన్ని వూహలూ, ఆశయాలూ వుండినవి కాలేజీ బ్యూటిగా పేరు తెచ్చుకుంది అందరికంటె ఫస్టుక్లాసులో పాసయింది అందమయిన, అంతస్తు గలిగిన విజయ్‌తో వివాహము, మంచి వుద్యోగమూ ఆదర్శమయిన సంసారమూ, ఓహ్ యీనాడూ చూచుకుంటే అదంతా గాలిమేడల క్రింద తయారయినవి తుదకు సాధారణ జీవితం కూడా తనకు లభించలేదు. యిలా యీ నిర్భాగ్య జీవితాన్ని యింకా పొడిగించి సాధించగలిగే దేముంది? తన నిజాయితీని నిర్మలత్వాన్ని గుర్తించని సంఘం రేపు తన బిడ్డలు పెద్దవారయితే వారికి గూడా యీ బూటకమయిన అవినీతిని అంటగట్టక వదిలిపెడుతుందా?యిక భరించలేక పోయింది పావని తనతో పాటు పిల్లల జీవితమ్మూ అంతం చేసుకోవడమే గతి వేరుమార్గంలేదు దృఢ నిశ్చయం చేసుకున్న పావని చివాలున లేచి తానెప్పుడో ఎలుకలబాధకొరకు కొనిపెట్టిన మందు బయటికి తీసి మూడుగ్లాసుల పాలలో కలిపింది కండ్లల్లో నీరు ధారాపాతంగా కారుతూంటే మెదడు స్థంభించిపోయి నీరసం ముంచుకొనిరాగా తట్టుకోలేక కండ్లు మూసింది

* * * * *

పావని నిన్నే' పిలిచాడు విజయ్

ఏమిటండి' నిద్రమత్తులో కదిలింది పావని

నిద్రవస్తుందా?'

"ఆ, మీకు రావటంలేదా?

వూహు రావటంలా కొంచెంసేపు యేదయినా చెప్పు పావని

'మీకేం పనిలేనట్లుంది!'

ప్లీజ్ రా పావని" లేచి విజయ్ మంచంపై కూచుంది ఆమె వడిలో తలపెట్టి ఆమె ముఖంలోకి అదే పనిగా చూస్తున్నాడు విజయ్

యేమిటలా కొత్తగా చూస్తున్నారు

యీ అందం అనుభవించడానికి యీ జన్మ చాలుతుందా?' అని

యింకా ఏం మిగిలింది? చిన్నగా నవ్వింది

'భలే ప్రశ్న యింకా చవిచూడవలసింది చాలావుంది

అలాగా కండ్లు చక్రాల్లా తిప్పింది

పావనీ మనకు మంచికాలం తప్పక వస్తుంది"

రాదని ఎవరన్నారు?'

"పరిస్థితులు కాస్త మెరుగు పడగానే పిల్లల్ని మంచి కాన్వెంట్‌లో చేర్పించి యిప్పట్నుంచి తయారు చేయాలి బాబును పెద్ద యింజనీరును చేయాలి పాపను డాక్టరు చదివించి విదేశాలకు పంపి వాళ్ళిద్దరు మంచి పేరు ప్రఖ్యాతులు పొందేటట్లు చేయాలి

'అబ్బో ఆశ చాలా అధికంగా వుందే పావని చిరునవ్వుతో అంది

యిది ఆశకాదు

మరి

'చూడు పావనీ జీవితం చాలా స్వల్పం ఎందరో పుడుతున్నారు పోతున్నారు వారిని గుర్తుంచుకోవలసిన అవసరంలేదు అలాగే మనమూ కాకూడదు

అంటే?

మనకో ప్రత్యేక చరిత్ర మనబిడ్డల గురించి పదిమంది గొప్పగా చెప్పుకోగలిగేటట్లు చేయడమే నా ధ్యేయం ఏమంటావ్

భలేవారే అతనిపై వాలింది పావని

* * * * *

కళ్ళ ముందు లీలగా కదలి పోయింది గతం విజయ్ పలుకులు చెవుల్లో మార్మోగుతున్నవి బిడ్డల విషయంలో తామిద్దరూ వూహించుకున్న కలలు కల్లలు కావల్సిందేనా? పావని సంకల్పం సడలిపోయింది కలిపిన పాలు కాలువలో పోసి చేయికడుక్కుంది 'చావను పిరికిగా చావను పిల్లల్ని చంపను నా విజయ్ కోరిక నెరవేర్చేందుకు యింకెన్ని కష్టాలు కలిగినా సహిస్తాను ఎన్ని అపవాదులొచ్చినా భరిస్తాను" అంటూ బిడ్డల్ని దగ్గరకు తీసుకొంది బిడ్డల ముఖాలు వాడిపోయి వున్నాయి అప్పుడే జ్ఞప్తికి వచ్చింది అప్పటివరకూ వంటచేయలేదని ఆ నీరస స్థితిలోనే లేచి కాస్త అన్నంవండి మజ్జిగతో పిల్లలకు పెట్టింది తనూ కాస్త ఎంగిలిపడి నడుంవాల్చింది కాని నిదురెలావస్తుంది? తన నాదుకొనే వారిలో రోజీ తన కందుబాటులో లేదు దినేష్‌- దినేష్‌కు తను దగ్గరవకూడదు కండ్లులేని కబోదిలోకం అరిచే కారుకూతలు దినేష్‌ కటుంబం చెవులబడితే దినేష్ బ్రతుకు నరకమై పోతుంది అంతేగాక బాధ్యత గలిగిన వుద్యోగంలో వుండి పైకి రావాల్సిన అతనికి తను మచ్చవచ్చేలా ప్రవర్తించకూడదు గనుక మిగిలింది తన కాళ్లపై తానే నిలబడి జయించుకొని రావాలి ఏ నీతికొరకు నిలబడి యిన్ని కష్టాలు అనుభవించిందో ఆ నీతి నన్నుద్ధరించ లేకపోయింది యికపైన నీతీలేదు నియమమూలేదు యెవరికోసం బ్రతుక దలచానో వారికొరకు యీ శరిరం అర్పణ చేసుకుంటాను నీతో అవినీతో యెలాగయితేనేం డబ్బు నిండుగా వున్నవాళ్ళకే యీ లోకం జేజేలు పలుకుతుంది నీతిగావుండి నిరాధార మయిన తనను యీలోకం యే మాత్రం ఆదరించిందో ఋజువయిందిగదా తను కాలేజీ బ్యూటిగా ప్రదమ స్థానంలో వుండి సాధించిందేమిటి? రెండవస్థానంలో వుండి రోజీ సాధించని దేమిటి? రోజీ తను సుఖపడి తన చుట్టూ వున్న వారిని సుఖపెడుతూ తగినంత హోదాలో వుంది విదేశాలకు సయితం వెళ్ళగలిగే స్తోమతులో వున్నది అంటె ఏమిటి దినర్థం బూటకమయిన యీ నీతి కవాటల్ని ధ్వంసం చేసి కాస్త కాలు జారితే తనూతన బిడ్డలు సుఖప్రదంగా జీవించగలుగుతారు

(ఇంకాఉంది)



ఆ రోజు ఆదివారం సాయంత్రం నాలుగు గంటల సమయం ఆఫీసర్ రాజశేఖరం తన బంగళాలో మేడమీద ఆరుబయట కూర్చుని ఫైళ్ళు చూస్తున్నాడు దఫేదారు రమణయ్య 'పక్కన నిల్చుని ఫైళ్ళు అందిస్తున్నాడు తన పనికి అంతరాయం కలిగిస్తూ అడుగుల చప్పుడు కావడంతో అటు తిరిగి చూచాడు రాజశేఖరం. ఎదురుగా ఓ పాతిక సంవత్సరాల యువతి నిల్చుని వుంది రాజశేఖరం దృష్టి తన మీద పడగానే ఆమె వినమ్రతతో నమస్కరించింది

"ఎవరూ?" అడిగాడు రాజశేఖరం హుందాగా చూస్తూ

"మన డ్రైవర్ జోగినాథం భార్య సార్" చెప్పాడు రమణయ్య

తన కింద పనిచేసే డ్రైవర్‌కు ఇంత అందమైన భార్య వుండడమా? మనసులోనే ఈర్ష్య చెందాడు రాజశేఖరం

'ఏం కావాలి?' తన భావాలను అణచుకుంటూ అడిగాడు

'మా వారు జ్వరంతో పడుకొని వున్నారు అయ్యగారిప్పుడెక్కడికో వెళ్లాలని జీపు సిద్ధం చెయ్యమన్నారట రాలేనని చెప్పి రమ్మన్నారు" మెల్లగా చెప్పిందామె

"ఫర్వాలేదులే నేనే జీపు తీసుకెళ్లగలను.' తన మంచితనం ప్రదర్శించుకొన్నాడు రాజశేఖరం

ఆమె మళ్ళీ నమస్కారం చేసి వెళ్ళిపోయింది

రాజశేఖరం ఫైలు తెరిచాడు చారడేసి కళ్లతో, బారెడు వాలు జడతో, సన్నని నడుముతో, ఎత్తైన విగ్రహంతో, చిత్రకారుడు అతి పొందికగా గీచిన చిత్రంలా ఆ యువతి రూపం కాగితాలమీద కనిపిస్తుంటే, బ్రహ్మచారి రాజశేఖరానికి ఫైలులోని అక్షరాలు కనిపించడంలేదు చాలాసేపు ఫైలు అలాగే వుంచుకుని, కళ్ల ముందు మెదులుతున్న ఆ మూర్తిని స్మరించుకుంటున్నాడు రాజశేఖరం

ఆ క్షణం నుండి అతనిలో పైత్యం ప్రకోపించింది

'రమణయ్యా! జోగినాథానికి పిల్లలెందరూ?" మెల్లగా అడిగాడు రాజశేఖరం

"ఒక అబ్బాయి సార్" బదులిచ్చాడు రమణయ్య

ఆ రాత్రి రాజశేఖరానికి చాలా భారంగా గడిచింది మరు రోజు ఉదయం నిద్ర లేస్తుండగానే కిటికీ నుండి జోగినాథం క్వార్టర్స్ కేసి చూచాడు నడుముకు పమిట బిగించి, కళ్లాపు చల్లుతూ కనిపించిందామె ఆమె పేరు నిర్మల.

"ఎంత ముగ్ధ మనోహర రూపం?" తనలో తాననుకొన్నాడు రాజశేఖరం

ఆమెను ఆమెనొక్కసారయినా పొందకపోతే తన జీవితం వ్యర్థం అనుకొన్నాడు పైగా ఆఫీసరంతటివాడు అడిగితే కాదంటుందా?"

కిటికీ వద్ద చేరి దీర్ఘాలోచనలో పడిపోయాడు

"ఏమిటన్నయ్యా? అంత దీర్ఘాలోచనలో పడిపోయావు?" వెనకనుండి చెల్లెలు సౌజన్య పల్కరించే వరకు ఈ లోకంలోకి రాలేకపోయాడు రాజశేఖరం.

ఏం లేదమ్మా" అని జరజర బాత్ రూమ్ వైపు నడిచాడు

ఆ రోజు నుండి ప్రతి ఉదయం నిద్రలేవగానే, కిటికీ నుండి నిర్మలను చూడడంతో ప్రారంభిస్తున్నాడు తనదినచర్య రోజులు గడిచేకొద్దీ రాజశేఖరంలో కాంక్ష ఎక్కువైంది

ఒక రోజు పకడ్‌బందీ అయిన ఏర్పాటు చేసుకున్నాడు రాజశేఖరం రోజూ సాయంత్రం వేళలందు చెల్లెలు సౌజన్యను జీపులో ట్యూషనుకు తీసుకెడతాడు జోగినాథం ఆమె ట్యూషన్ పూర్తయ్యేవరకు అక్కడ వుండి, ఆమెను తిరిగి తీసుకొస్తుంటాడు, ఆనవాయితీ ప్రకారం ఆ రోజు కూడా జోగినాదం జీపులోనే సౌజన్యను ట్యూషన్‌కు తీసుకెళ్లాడు దఫేదారు రమణయ్యను ఇంటికెళ్లమని పర్మిషన్ ఇచ్చేశాడు ఇప్పుడు బంగళాలో రాజశేఖరం ఒక్కడే వున్నాడు ఇదే మంచి అవకాశం అనిపించింది రాజశేఖరానికి డాబా మీది తన పడకగది కిటికీ నుండి జోగినాథం క్వార్టర్సుకేసి చూశాడు ఆరుబయట చాపమీద కూర్చుని మల్లెపూలు అల్లుకుంటోంది నిర్మల

'ఏమండీ?' ధైర్యం చేసి పిలిచాడు.

ఆమె కిటికీ వైపు చూచింది రాజశేఖరం కళ్లలోని మెరుపును చూచి, తొట్రుపాటుతో పైకి లేచి నిల్చుంది

ఒక్కసారిలా వస్తారా?' అడిగాడు రాజశేఖరం

ఆమె చేతిలోని పూల చెండు చాపమీద విడిచి బయలుదేరింది

ఆమె పైకి రావడం, కొయ్య మెట్లమీద టకటక శబ్దం చేస్తుంది ఆ అడుగుల చప్పుడు రాజశేఖరం గుండెలలో ప్రతిధ్వనిస్తుంది

పిలిచారా సార్!" ఆమె ఎదురుగా నిల్చుని అడిగింది

అవును నీతో కొంచెం పని వుంది నీవు కాదనవద్దు నీ అందం నన్ను పిచ్చివాడిని చేస్తుంది ఒక్కసారి నాకు పొందు కావాలి కాదనకు ' చెప్పదల్చుకున్నది స్పష్టంగా సూటిగా చెప్పాడు రాజశేఖరం

'బాబుగారూ!' ఆమె ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేసింది అతనలా అడుగుతాడని ఆమె వూహించలేదు

'నేను తప్పు చేస్తున్నానని నాకు తెలుసు కానీ తప్పదు. నేనీ మనోవ్యాకులత భరించలేను ఒక్కసారి ఒకే ఒక్కసారి నన్ను కరుణించు " రాజశేఖరం అడిగాడు

అతనొక ఉన్నతోద్యోగి అనే స్పృహ కోల్పోయాడా క్షణంలో ఆకలిగొన్నవాడు, వాకిట ముందు చేరి అర్థించినట్లు అడిగాడు

నిర్మల మౌనంగా తల వంచుకుంది

చూడు' నీవంగీకరించకుంటే నీ భర్తను దూరంగా ట్రాన్స్‌ఫర్ చేస్తాను"' రెండవ అస్త్రం' ప్రయోగించాడు రాజశేఖరం

ఆమెలో కదలిక లేదు.

'కాల యాపన చేయకు నిన్ను బలవంతంగా అనుభవించడం నాకిష్టంలేదు నీకెంత డబ్బు కావాలన్నా ఇస్తాను నీవేది కోరినా తీరుస్తాను . " అర్థించాడు



అప్పటికీ ఆమె మాట్లాడలేదు

"మౌనం అంగికారానికి సూచన అని భావించ మంటావా? అంటూ ముందుకు నడిచాడు రాజశేఖరం అతనిలోని ఉద్వేగాన్ని అణుచు కోలేకున్నాడు

ఆమె గుండెలు దడ దడలాడాయి భూమి క్రుంగిపోతే బాగుణ్ణనిపించింది అతను ఆమెకు దగ్గరగా, అతి దగ్గరగా వచ్చేశాడు. తనేం చెయ్యాలి? వెను తిరిగి మెట్లు దిగి పరుగెడితే ! కానీ ఆమె కదలలేకపోతూంది. బయంతో మొద్దుబారి పోయింది

అతని చెయ్యి ఆమె భుజంమీద పడటానికి కొన్ని సెకెండ్ల వ్యవధిలో బంగళా కాంపౌండులోకి ప్రవేశిస్తూ జీపు హారన్ వినిపించింది

నిర్మలకు ఆ హారన్ విష్ణుమూర్తి శంఖారావంలా అనిపించింది రాజశేఖరానికి సింహగర్జనలా తోచింది ఉవ్వెత్తున లేచిన కెరటం చప్పున అణగారిపోయింది

'నీవు త్వరగా ఇక్కడినుండి వెళ్ళు' గాబరా నణుచుకుంటూ అన్నాడు రాజశేఖరం

నిర్మల ఒక్క పరుగున కింవకు దిగి వెళ్ళిపోయింది

తొట్రుపాటును, అలజడిని అణుచుకుంటూ మంచంమీద బొక్కబోర్లా పడుకొన్నాడు రాజశేఖరం.

కొంత తడవుకు ఎవరో మెట్లెక్కుతున్న చప్పుడు మరికొంత సేపటికి ద్వారం ముందు నిల్చున్న అలికిడి

'రాస్కెల్సు' చదువుకోగానేసరా? బుద్ధి జ్ఞానం వుండద్సా ఆడదాన్ని చూస్తే ఒళ్ళు అంత తిమ్మిరెక్కుతుంది కాబోలు ' కోపంతో వూగిపోతున్న జోగినాధం గొంతు అది

రాజశేఖరం పై ప్రాణాలు పైనే పోయాయి వీడింత అర్ధాంతరంగా వస్తాడనుకోలేదు ఇప్పుడు తన పరువేంగాను? తన హోదా ఎక్కడ, తను తెచ్చుకున్న అప్రదిష్ట ఎక్కడ?? ఛీ ఛీ క్షణికావేశం' తనను తాను నిందించుకున్నాడు

'సార్' ' జోగినాధం గొంతు స్థాయి పెరిగింది

ఇక తప్పదన్నట్లు పైకి వేచి, ప్రశ్నార్ధకంగా డ్రైవర్‌కేసి చూచాడు రాజశేఖరం అతని కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి

మీరొచ్చి ఆమెను సముదాయించాలి జోగినాధం డిమాండ్ చేశాడు

ఎవర్ని' రాజశేఖరం గొంతు తడబడింది

'అమ్మాయిగార్ని

జోగినాధం జవాబుకు మంచంమీద నుండి ఎగిరి గంతేసినట్లు లేచాడు రాజశేఖరం

ఏమైంది?

"వాడు ఆ ట్యూటర్ ఎవర్తూ లేకుండాచూచి, అమ్మాయిగారి మీద చెయ్యేసేడట ఆమె భయంతో గావు కేక వేసింది నేను లోపలికి వెళ్ళి చూస్తే వాడు . ఆ రాస్కెల్ . . అమ్మాయిగార్ని బలవంతంగా తన కౌగిలిలోకి తీసుకుంటున్నాడు వాడి మెడమీద రెండిచ్చి అమ్మాయిగార్ని ఇంటికి తీసుకొచ్చేశాను వాడిమీద కేసు పెట్టాలి పోలీసులకు ఫోను చెయ్యండి ముందు అమ్మాయిగార్ని సముదాయించండి." గుక్క తిప్పుకోకుండా చెప్పాడు జోగినాధం

రాజశేఖరం పరుగున మెట్లు దిగి, సౌజన్య గది వైపు నడిచాడు సౌజన్య ఏడుస్తూ, దిండులో. తలదూర్చికొని వుంది ట్యూటర్‌మీద పళ్ళు కొరకబోయాడు కానీ నాలుక కసుక్కున కొరుక్కున్నాడు

తన చెల్లెలు మానం జోగినాధం కాపాడాడు గానీ, తను తను' అతని భార్య మానాన్ని దోచెయ్యాలని చూచాడు ట్యూటర్‌లాగే తనూ నేరస్తుడే

ఏం చెప్పాలో, ఎలా సమాధానపర్చాలో తెలియక మౌనంగా సౌజన్య భుజం తట్టి, బుజ్జగించి, లేచి వచ్చేశాడు రాజశేఖరం అతని ప్రవర్తన వింతగా తోచింది జోగినాధానికి

ఆ తరువాత రాజశేఖరం మరెప్పుడూ కిటికీ నుండి డ్రైవర్ క్వార్టర్స్‌కేసి చూడలేదు. □



# 'శాంతి కాగడా'తో క్రీడాకారుల భూప్రదక్షిణ పరుగు!



అమ్‌స్టర్‌డామ్‌లో
భారతీయ అగ్రగామి ఎథెల‌ట్ మిల్కాసింగ్

"ప్రపంచానికి ఒక అవకాశము యివ్వండి, పిల్లలకు శాంతి కావాలి' అనే నినాదము నేడు ప్రపంచం అంతా వినిపిస్తూంది ఈ ఏడు 'అంతర్జాతీయ శాంతి సంవత్సరము గా ఐక్యరాజ్యసమితి దీనిని ప్రకటించినది అంతేగాక యీ ఏడు యునైటెడ్ నేషనల్ చిల్డ్రన్స్ ఫండ్ (యూనిసెఫ్) 40 వ వార్షికోత్సవము ఈ సందర్భముగా తొలిసారిగా శాంతిని కోరుతూ భూప్రదక్షిణ పరుగు సెప్టెంబరు 16న న్యూయార్క్ లోని ఐక్యరాజ్యసమితి కేంద్రము నుండి బయలుదేరింది 45 దేశములలోని 65 నగరముల ద్వారా శాంతికాగడా పుచ్చుకొని అనేక మంది క్రీడాకారులు, యువకులు రిలే పరుగు చేస్తున్నారు 'శాంతికాగడా'కి అనేకచోట్ల ఘనస్వాగతం లభించింది ఐర్లాండ్ పశ్చిమ ఆసియా దేశాలలో పిల్లలు తల్లితండ్రులు పెద్దల యిష్టమునకు వ్యతిరేకముగా యీ రిలే పరుగులో పాల్గొన్నారు యునైటెడ్ నేషన్స్ ఎథెలిటిక్ క్లబ్‌కు చెందిన 30 మంది క్రీడాకారులు యీ ప్రపంచ రిలే పరుగులో పాల్గొని 31 గంటలు పరుగెత్తి 400 కి మీ దూరము గల బోస్టన్ చేరారు ఒట్టావాలో కెనడా ఆయుధ నిరాయుధీకరణ శాఖామాత్యులు డగ్లస్ రోబ్ స్వాగతము పలికారు రెండవ ప్రపంచ యుద్ధ కాలములో పూర్తిగా నాశనమై కాబడిన వార్సా నగర వీదుల గుండా శాంతికాగడా ని తీసుకు వెళ్ళారు పోలెండ్ హాలెండులలో ప్రజలు ఎంతో ఆసక్తిగా యీ పరుగులో పాల్గొన్నారు హేగ్ నగరములోని అంతర్జాతీయ న్యాయ పీఠము కేంద్రము శాంతి భవనం' లో ప్రిన్స్ క్లాస్ ఆహ్వానించారు అంతర్జాతీయ న్యాయస్థానము అధ్యక్షుడు నాగేంద్రసింగ్ 'శాంతి దూతల'ను కలుసుకొన్నారు బర్మింగ్‌హాం, లండన్ నగరములకు 'శాంతి కాగడా' వెళ్ళినప్పుడు ఎంతో ఆదరణ లభించినది లాయన్‌లో రెండవ పోప్ జాన్‌పాల్ శాంతికాగడ అందుకున్నారు

న్యూయార్క్‌లోని అయిక్యరాజ్య సమితి కేంద్ర కార్యాలయంలో
శాంతి కోసం ప్రదర్శన




మాస్కో 'రెడ్ స్కేర్వ్' లో అనేక వేల మంది సంతోషము వ్యక్తం చేసారు అక్టోబరు 11 న నలభై మంది ఐస్‌లాండ్ క్రీడాకారులు కౌత్‌ద్రన్‌లో అమెరికా అదినేత రీగన్, సోవియట్ రష్యా ప్రధమ కార్యదర్శి, గోర్బచేవ్ సమావేశ స్థానమునకు తెచ్చి యిద్దరు నాయకుల సమావేశము జరిగినంత కాలము అచ్చట వెలిగించి యుంచారు ఎంతో కాలముగా ఎలాంటి స్నేహమూ లేని ఉత్తర ఐర్లాండ్, ఐరిష్ రిపబ్లిక్‌ల గుండా 'శాంతి కాగడా వెళ్ళి సంచలనం సృష్టించినది అక్టోబరు 16న నెవిషాలంలో అరబ్ జూయిష్ శాఖకు చెందిన ఐరిష్ బాలబాలికలు ఎంతో ఆనందముగా యీ పరుగులో పాల్గొన్నారు. టెల్ అవివ్, జెరూసలం అరబ్, యూదులు పలికిన స్వాగతము వారు శాంతి కోరుతున్నారన్న దానిని స్పష్టం చేసింది

ఢిల్లీలో రాష్ట్రపతి జైల్‌సింగ్ శాంతి పరుగును ప్రోత్సహించారు అక్టోబర్ 2 న గాంధి జయంతి నాడు ఢిల్లీ పాఠశాల పిల్లలు రాజఘాట్‌లో శాంతిని కోరుతూ ప్రార్ధనలు చేసారు 86 రోజులలో 23 000 కి మీ ప్రయాణం చేసి 'శాంతి కాగడా భూప్రదక్షిణ పరుగు చేసి డిసెంబరు 11న, యూనిసెఫ్ 40 వ వార్షికోత్సవం రోజున న్యూయార్కులో గల యునైటెడ్ నేషన్స్ కేంద్రమునకు తిరిగి చేరుతుంది

ఈ పరుగులో అగ్రగామి భారతీయ క్రీడాకారులు మిల్కాసింగ్, రంజిత్‌భాటియా తదితరులు పాల్గొన్నారు

'శాంతి కాగడా పుచ్చుకొని ప్రపంచ ప్రదక్షిణ చేసి, పిల్లలు, పెద్దలు శాంతి కావాలి అని కోరినంత మాత్రాన యుద్ధ పిశాచ మిత్రుల హృదయంలో మార్పు వస్తుందా? వస్తుందనే ఆశిద్దాం'

క్రీడాకారులు యీ శాంతి ప్రచారములో ముఖ్య పాత్ర వహిస్తున్నారు మన రాష్ట్రములోని క్రీడామండలులు కూడా యీ కార్యక్రమాన్ని చేపట్టాయి — ముకరమ్



# నిరుపేదకంటె హీనుడు

పులిగడ్డ విశ్వనాథరావు

"క్లాసులు మొదలయి రెండు నెలలైంది నీ వద్ద ఇంగ్లీషు పాఠ్య పుస్తకమే లేదా? అని ఆ కుర్రాణ్ణి కోప్పడ్డాను

లేదు సార్ వచ్చేవారం

వచ్చేవారం, వచ్చేవారం విని విని విసిగిపోయాను క్లాసులో పుస్తకం లేని దౌర్భాగ్యుడివి నువ్వొక్కడివే, తెలిసిందా?

ఆ కుర్రాడి పేరు చలం పల్చగా ఉంటాడు చదువులో సుమారుగా ఉంటాడు తుంటరి బాపతు కాదు శాంతుడు

చలం ఏం బదులు చెప్పలేదు

సరే ఇవాళ సోమవారం వచ్చే సోమవారం నీ వద్ద పుస్తకం ఉండాలి అని చెప్పాను

గిర్రున సోమవారం వచ్చింది పుస్తకం ఏదని చలాన్ని అడిగాను తేలేదండి అన్నాడు నాకు వళ్ళు మండింది క్రమశిక్షణ పాటించే మాస్టారుగా నాకు పేరుంది అటువంటిది ఈ కుర్రాడు పాఠ్య పుస్తకం లేకుండా నా క్లాసులో హాజరవుతున్నాడంటే నాకు ఎంత తలవంపు

చూడు నువ్వు రేపు పుస్తకం తీసుకువస్తేనే క్లాసులోకి రానిచ్చేది తెలిసిందా?" అన్నాను కఠినంగా చలం తల ఊపాడు

మర్నాడు చలం స్కూలుకు రాలేదు ఆ మర్నాడు కూడా రాలేదు మూడవ రోజు వచ్చాడు అతణ్ణి చూడగానే, ఊఁ, పుస్తకం తెచ్చావా? అని గదమాయించాను అతడు మాట్లాడ లేదు చేయి వాచిపెట్టి చెంప ఛెళ్ మనిపించా చెంప తడుముకోసాగాడు కళ్ళలో నీళ్ళు తిరిగాయి సెన్సిటివ్ కుర్రాడు కాబట్టి ఈ పాటి డోస్ చాలు అనుకొన్నా

ఇదేం స్కూలనుకున్నావ్ లేక మజాకా లనుకున్నావా? ఇంటి కెళ్ళు పుస్తకం తీసుకొస్తేనే క్లాసులోకి రానిచ్చేది అని అన్నాను చలం సంచి తీసుకుని బైటకు నడిచాడు

మర్నాడు చలం రాలేదు చలం ప్రక్కగా రాముం కూర్చుంటాడు రామం, చలం ప్రాణ స్నేహితులు రామాన్ని స్టాఫ్ రూములోకి పిలిచి చలం గురించి ప్రశ్నించా

చలం ఇంగ్లీషు పుస్తకం ఎందుకు కొనుక్కోడు? ఇంట్లో డబ్బిస్తే పుస్తకం కొనక డబ్బు తగలబెడు తున్నాడా?

లేదండి చలం అటువంటి వాడు కాదు మరేనండి, వాడు రెండు నెలలై ఫీజు కూడా కట్టలేదు మొన్ననే కట్టగలిగాడు

మరి పేద విద్యార్థిగా ఫీజు మాఫు చేయమని, పుస్తకాల కోసం ధన సహాయం చేయమని కోరవచ్చుగా!

అది వీలు లేదండి ఎందుకంటె వాళ్ళ నాన్న ప్రభుత్వోద్యోగి వాళ్ళకి పచ్చకార్డు లేదండి

ఐతే మరి పది, పన్నెండు రూపాయల పుస్తకం కొనుక్కోవడానికేం?

వాళ్ళ కుటుంబం పెద్దది కదండి ఖర్చులు ఎక్కువట

అంటే!

చలానికి నలుగురు అప్పచెల్లెళ్ళు, ముగ్గురు అన్నదమ్ములు ఇద్దరి అప్పలకి పెళ్ళి అయింది ఒక అప్పని మొగుడు వదిలేశాడు ఆమె పుట్టింట్లోనే ఉంటోంది రెండవది పురిటికి వచ్చింది ఒక అన్న ఆస్పత్రిలో దీర్ఘరోగంతో పడున్నాడు ఇద్దరు అప్పలు, ఇద్దరు తమ్ములు చదువు కుంటున్నారు ఇంకా చలం తాత, నాయనమ్మ కూడా ఉన్నారు

మరీ ఒక పుస్తకం కొనుక్కోవడం అంత కష్టమా? ఖర్చుల్లో ఇదొక ఖర్చు కదా!

వాళ్ళ నాన్న రోజూ పుస్తకం కొని తెస్తానంటాడటండి కాని తీరా తెచ్చేవేళకి మందుకని, మాకుకని, ఇతర ఖర్చులకి డబ్బు అయిపోతుందట రెండు నెలలయి అలాగే జరిగిపోతోందిట వాళ్ళ నాన్నని పుస్తకం తెమ్మంటే బడి మానేయి, నేను చదువుకుని ఏమి బావుకున్నానని కంరాదట కూలీనాలీ చేసుకుని బతకడం మేలని అన్నాడట

ప్రభుత్వం కటికపేదలకు ఉచితంగా పాఠ్యపుస్తకాలు సరఫరాచేస్తుంది చలం అంత నిరుపేదకాదు బడుగు వర్గాలు, అట్టడుగు కులాలకు చెందిన విద్యార్థులకు ప్రభుత్వం సదుపాయాలు కల్పిస్తుంది చలం ఆ కులాలకు చెందడు అతడు అగ్రకులానికి చెందినవాడు

క్లాసులో ఫస్టు, సెకండువస్తూ బాగా చదువుకునే విద్యార్థులకు ధర్మాత్ములు ఉపకార వేతనాలు ఇస్తారు చలం చదువులో సగటు విద్యార్థి అలా అని అత్తెసరు మార్కులు తెచ్చుకునే చవటకాదు, అయినప్పటికీ అతడికి ఉపకార వేతనం దొరికే అవకాశంలేదు ఈ విధంగా చలం ఏ సహాయానికీ అర్హుడుకాడు

మరి ఇటువంటి విద్యార్థులు చదువుకో కూడదనా మన సమాజం ఉద్దేశం అని నేను ప్రశ్నించుకున్నాను పిత బాధలు పితవే అన్నట్టు ఇటువంటి పేద అగ్రకులాల కుటుంబాల బాధలు

వాళ్ళకే తెలుసు పురాతన సంప్రదాయాలను పట్టుకు వేలా డే ఈ అగ్రకులాలు ఆకలిబాధతో మాడడం మేలనకుంటారుగాని కూలీనాలీ చేసుకుని పొట్టనింపుకోవడం పరువు తక్కువగా భావిస్తారు తమ దారిద్ర్యాన్ని కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ మేము ఇప్పటికే • సర్వోచ్ఛ్య కులస్థులమే అని భ్రమలో పడి కొట్టుకుంటున్నారు. వీరికి ముక్తి ఎప్పుడో!

ఆలోచనలోంచి బైటపడి రామంవైపు చూశాను. అతడు మౌనంగా నిలబడి నావైపు చూస్తున్నాడు.

"మరి చలం ఫీజు ఎలా కట్టాడు?" అని అడిగాను.

"చలం వాళ్ళ అమ్మ కన్నీళ్ళుగ్రక్కుకుంటూ పెద్దవాడు బ్రతుకు ఎలాగూ తెల్లారేలా ఉంది, నాయనా నువ్వైనా ఫీజుకట్టుకుని బాగుపడరా, స్కూలులో పేరు కొట్టేయకపోతే కనీసం స్కూలుకైనా వెళ్ళవచ్చు. పుస్తకం లేకపోతేపోయె, వీలయినప్పుడు కొనుక్కుందువుగాని, అప్పటివరకు మాస్టారుగారి చీవాట్లు, దెబ్బలు భరించు అనిచెప్పి వాళ్ళ అన్న మందుడబ్బు ఇచ్చేసిందట"

చలం పుస్తకం లేనందున బడికి రావడం మానేశాడు నాకూ పాపం అనిపించింది. కాని నేనుమాత్రం ఏమి చేయగలను అతడు అర్హుడు ఐతే క్రిందామీదాపడి అతడికి రావలసిన ధన సహాయం అతడికి అందేలా చేద్దును. పోనీ అతడు పుస్తకంలేకపోయినా ఊరుకుందామంటే మరీ నా

# నిరుపేదకంటె హీనుడు

సిద్ధాంతం భంగం అవుతుంది. కుర్రాళ్ళంతా క్లాసులోకి పాఠ్యపుస్తకాలు తీసుకురావాలనీ, శ్రద్ధగా చదవాలనీ, క్రమశిక్షణ పాటించాలనీ నా సిద్ధాంతం

పోతే జాలిపడి నా సొంత డబ్బుతో చలానికి పుస్తకంకొని ఇవ్వడానికి నేనేం శ్రీమంతుణ్ణి కాదు అలా ఇవ్వగలిగినా అటువంటి విద్యార్థులు ఎంతమందో అంతమందికీ నాలాంటివాడు సహాయం చేయగలడా?

ఒక వారం గైరుహాజరయి సోమవారం చలం తన సీటులో కూర్చుని ఉన్నాడు. నా మనస్సు తేలికపడింది. ఈసారి పుస్తకం తెచ్చే ఉంటాడని నా మనసు అంటోంది దానికితోడు అతడి ఠీవి చూస్తుంటే పుస్తకం తెచ్చే ఉంటాడనిపిస్తోంది 'ఈ రోజు తేలేకపోయినా కొద్దిరోజులు తర్వాత ఆ ఊసు ఎత్తవచ్చుననుకున్నాను

నేను చలం వైపు చూడకుండా పాఠం చెప్పడానికి ఉపక్రమించాను చలమేలేచి నిలుచుని, "సార్, ఇంగ్లీషు పుస్తకం తెచ్చాను," అన్నాడు గర్వంగా నేను పుస్తకం తెచ్చావా అని అడగకముందే తానే చెప్పేద్దామని చెప్పేశాడు కాబోలు.

"వెరిగుడ్," అని అతణ్ణి కూర్చోమన్నాను కాని అతడు బైటకు తీసి చదువుతున్న పుస్తకం పాఠ్య పుస్తకంలాలేదు కుట్టిన కాగితాల కట్టలా ఉంది

ఇదేదో నా కళ్ళుగప్పే ఎత్తుగడ కాదుకదా అని చలం సీటువద్దకు వెళ్ళి ఆ కాగితాల కట్ట పుటలను తిరగేశి చూశా చిత్రం, అది అచ్చైన పుస్తకంకాదు చక్కటి దస్తూరిలో ఇంగ్లీషు పాఠ్యపుస్తకం అంతా రాసుంది. అచ్చులో 150 పేజీలైతే చేవ్రాతలో ఐదువందల పేజీలున్నాయి ఒకవైపు సైక్లోస్టైల్ చేసిన చెత్తకాగితాల రెండోవైపు రాసున్నాయి శీర్షికలు ముచ్చటగా ఎర్ర సిరాతో ఉన్నాయి. బొమ్మలు కూడా ట్రేస్ చేసి ఉన్నాయి

ఈ పుస్తకాన్ని రాయడానికి కనీసం నెల్లాళ్ళు పట్టవచ్చు కాని చలం రాత్రింబవళ్ళు కష్టపడి ఒకవారం రోజుల్లో ఈ పుస్తకాన్ని రాశాడు. ఎవరో తోటి విద్యార్థి పుస్తకం తీసుకుని నకలు చేసినట్టుంది.

నేను ఇంతవరకు నా మాస్టారు జీవితంలో చేయని పని చేశాను .విద్యార్థులయందు ఆప్యాయత, చనువు ప్రదర్శిస్తే క్రమశిక్షణ కుంటుపడుతుందని నా భావన. ఇంతవరకు ఏ విద్యార్థి వీపు నిమిరి ఎరుగను అందువలన నేను చాలా కఠినుడినని ప్రతీతి ఆ క్షణంలో మాత్రం నేనే చలం వీపు నిమరకుండా ఉండలేకపోయాను. మరుక్షణం తేరుకుని బ్లాక్‌బోర్డ్ వద్దకువచ్చి పాఠం చెప్పనారంభించాను □



# కార్టూనిస్టులకు సూచనలు !

- ★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.
- ★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- ★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !
- ★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
- ★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.
- ★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో, అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.
- ★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
- ★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.
- ★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

# కలికాలం కాదు! సినిమాకాలం!

గీతా సుబ్బారావ్



# హైదరాబాద్ నోట్‌బుక్

## శ్రీ విద్యాపీఠం శరన్నవ రాత్రోత్సవం :–

విశ్వాన్నంతా భగవన్మయంగా చూస్తున్న వేదమతానుయాయులు సుందర శరదృతువును దేవిగా, సకలాభీష్టదాయిని అయిన మాతగా ఆరాధించడంలో అబ్బురమేమీ లేదు ఆ విధంగా జనాదరణ పొందిన ప్రాచీన క్రతువుల ప్రతిరూపాలే నేటి శరన్నవరాత్రాదులు ఈ నవరాత్రోత్సవాలు జంటనగరాలలో అత్యంత నిష్ఠతో చాల చోట్ల జరిగాయి. సుల్తాన్‌బజార్‌లోని (4–2–150) శ్రీ విద్యాపీఠం ఈ ఉత్సవాన్ని పెద్దయెత్తున ఇస్సామియా బజారులో హరిద్వార్ హోటల్ వెనుక ఉన్న మేఘరాజ సత్రంలో అక్టోబర్ 2 వ తేది నుంచి 14 వ తేదీ వరకు వైభవోపేతంగా నిర్వహించింది ఈ శ్రీ విద్యాపీఠాన్ని శ్రీ విద్యాశంకర భారతీస్వామి (మచిలీపట్నం) ప్రియ శిష్యులైన శ్రీ వెంకటరమణమూర్తి (శ్రీ విద్యానంద) స్థాపించారు ఈ పీఠాన్ని శృంగేరి పీఠాధిపతి, కాంచి కామకోటి పీఠాధిపతి ఆశీర్వదించారు. ఈ ఉత్సవంలో త్రికుండాత్మక వైదిక కర్మతోబాటు సంగీత సాహిత్య కార్యక్రమాలే కాక శ్రీ అవధూతేంద్ర భక్తభజన మండలి, శ్రీ చావా నాగేశ్వరరావు బృందం వారు అధ్యాత్మ సంకీర్తనం, టి బాలయ్య బృందం వారి నాదస్వర కచ్చేరి జరిగాయి 9 వ తేదిన సరస్వతీ సాహిత్య సభా కార్యక్రమం మహావిద్వాంసులు శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రి అధ్యక్షతన జరిగింది శ్రీ సరస్వతి నామాక్షర రమ్యతను గురించి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం డైరెక్టర్ డాక్టర్ వి. వి ఎల్. నరసింహారావు, భాగవతంలో విశ్వజనీనతను గురించి శ్రీ పరాంకుశం దామోదరస్వామి, శ్రీదేవీ భాగవత తత్త్వం గురించి శ్రీ కలగా వెంకటరామశాస్త్రి ప్రసంగించారు శ్రీ విద్యాపీఠం పక్షాన శ్రీ విరజానందస్వామి ఉపన్యాసకులను శాలువలతో సత్కరించారు. 11 వ తేదిన శ్రీ విరజానందస్వామి అధ్యక్షతన శ్రీ నల్దిగ శ్రీనివాసాచార్యుల 'శ్రీ శారదా తత్త్వ చింతనం' గ్రంథావిష్కరణ జరిగింది. శ్రీ విద్యానందస్వామి ఆవిష్కరించారు. శ్రీయుతులు నిత్యానందస్వామి, విరజానందస్వామి, డాక్టర్ వి వి ఎల్ నరసింహారావు, నఖ చిత్రకళా సమ్రాట్ శ్రీ డి. కె శ్రీనివాసాచారి మున్నగు వారు గ్రంథాన్ని గురించి ప్రసంగించారు గ్రంథకర్త శ్రీ నల్దిగ శ్రీనివాసాచార్యులు వక్తలను శాలువలతో సత్కరించగా, గ్రంథకర్తను, ఆయన ధర్మపత్నిని శ్రీ పోచంపల్లి వేంకటేశ్వరరావు సోదరులు సత్కరించారు. శ్రీ విద్యాపీఠం పక్షాన శ్రీ విద్యానందస్వామి గ్రంథకర్తకు నూట పదార్హ రూపాయలు, సరస్వతీ మూర్తిని బహూకరించారు. శ్రీ నల్దిగ శ్రీనివాసాచార్యులు ఉచితరీతిని కృతజ్ఞత తెలిపారు శ్రీ నల్దిగ శ్రీనివాసాచార్యులు సంస్కృతాంధ్రాలలో సరస మధుర కవిత చెప్పగల దిట్ట. నల్లగొండ జిల్లా భువనగిరి తాలూకా ఇందిరాం గ్రామంలో 1933 లో జన్మించారు సీతారాంబాగ్ సంస్కృత కళాశాలలోను, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ కళాశాలలోను విద్యాభ్యాసం చేసి ఎం ఓ. ఎల్ పట్టం పొందారు సికిందరాబాద్ మహబూబ్‌నగర్ కాలేజీలో ఆంధ్రాధ్యాపకులుగా ఉన్నారు సంస్కృతాంధ్ర సాహిత్యాలు, కవిత్వం, చిత్రలేఖనం, నాట్యం, ఉభయ వేదాంతాలు అభిమాన విషయాలు. శతక వైజయంతీ (మూడు భాగాలు), విబుధసూక్తి శతకమ్, వేంకటపతి, కాళీ, మారుతాత్మజ, వరదరాజ, శ్రీ రంగనాయక, వేణుగోపాలాది సుప్రభాతాలు, రసవిపంచి, సింగి పదాలు, శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహ స్తుతిమాలా, శారదా తత్త్వ చింతనము (ఆవిష్కృత గ్రంథం), శబరిమలై అయ్యప్పస్వామి వ్రతకల్పం, తాండవ మదనుడు మొదలైనవి ఈయన ఇటీవల రచించిన మహాకావ్యం శ్రీ రాధికా మనోహరీయ ప్రబంధం. ఇది ఎనిమిది ఖండాల (550 పుటల) మహాకావ్యం రాధాతత్త్వం దీనిలో విస్తరించబడింది. రాధ శ్రీకృష్ణునికి తలంటింది. ఆ దృశ్యాన్ని కవి సహజ సుందరంగా ఇలా వర్ణించారు:–

కలసి నటింప కన్నవయు,
కౌనసియాడగ, తారహారముల్
జిలిబిలి నాట్యమాడ, ముఖ
సిమల చెమ్మటి లంకురింప మా
ర్పులు చెలరేగ, తాళగతి
బొందుచు కంకణముల్ ధ్వనింప, నా
సలలిత గాధ రాధ హరి
చందన తైలము నంటె శౌరికిన్(228 పు)

గోపకామినులు కృష్ణుని స్తుతించిన తీరిది :–

చల్లని వాడ కూరుముల
చక్కదనాల పసందుకాడ ఓ
నల్లనివాడ సొంపుల గు
ణంబుల రిక్కగు వన్నెకాడ రం
జిల్లెడు పండు వెన్నెలల
జిల్లెడు లేమిసి నవ్వువాడ ఓ
గొల్లలరేణ చేరితిమి
గోపకిశోరుడ బ్రోవ రావయా.

ఈ గ్రంథంలో శ్రీ శ్రీనివాసాచార్యులు పెక్కు అపూర్వ వృత్తాలు వాడి, కావ్యాన్ని మనోహరతరం చేశారు. శరన్నవరాత్రోత్సవ యాగ కార్యక్రమం శ్రీ వెంపటి ఆంజనేయశర్మ పర్యవేక్షణలో పూర్ణాహుతి, అవబృథస్నానాల వరకు సక్రమంగా నిర్వహింపబడినాయి పూర్ణాహుతిని శ్రీ విద్యానందస్వామి జరిపారు ఈ ఉత్సవంలో శ్రీయుతులు కేశవ పంతుల నరసింహశాస్త్రి, ఓగేటి అచ్యుతరామశాస్త్రి ముదిగొండ శివప్రసాద్ మున్నగువారు ప్రసంగించి సత్కృతులయ్యారు డి. అచ్యుతం బృందం, కుమారి మీనాక్షి బృందం సంగీత కచ్చేరి జరిపి గౌరవం పొందారు 13 వ తేదిన సమాచారశాఖ వారు ఏర్పాటు చేసిన హరికథను శ్రీమతి ఏ జయభాగవతారిణి నిర్ణీత సమయంలో చాల హృద్యంగా చెప్పారు. శ్రీ విద్యాపీఠం పక్షాన ఏటా జరిగే సన్మానం ఈసారి శ్రీ తాడేపల్లి వెంకటసుబ్బయ్యశాస్త్రి గారికి జరిగింది అవబృథానంతరం శ్రీ విద్యానందస్వామి ఉత్సవ కార్యక్రమాన్ని సింహావలోకనం చేస్తూ, అభిభాషించారు ఉత్సవ నిర్వాహకులకు తోడ్పడిన వారందరికి కృతజ్ఞత తెలిపారు. శ్రీ డి కె శ్రీనివాసాచార్యులు మున్నగు వారు ఈ ఉత్సవ విజయానికి చాల తోడ్పడ్డారు.

శ్రీ విద్యా పీఠాధిపతులు శ్రీ విద్యానందస్వామి



## ఉపశ్రుతి :–

మనమడు ఉదయన సాంఘిక శాస్త్ర పాఠాలు చదువుతున్నాడు. నేనొక ప్రశ్న అడుగుతాను, 'జవాబు చెబుతావా' అనడిగాను అడుగు తాతా, నేను ఫస్టు, క్లాసులో – అన్నాడు అయితే విను. ఊరంతా పాడుపడిన పాత భవనాల గోడలు. వీధి వీధికి మురికి పేటలు గోతులు పడిన రోడ్లు, కత్తుల లాగ పైకి లేచిన బండలున్న ఫుట్‌పాతులు. గాడిదలు, గేదెలు విచ్చలవిడిగా తిరుగుతున్న రాజ వీధులు ఫుట్ బోర్డులపై ప్రయాణికులు వేలాడుతున్న బస్సులు ఏ ఊరు? – అనడిగాను. ఇదేం తాతా ఏదో డిఫికల్ట్ కొశ్చన్ అనుకున్నాను వెరీ ఈజీ మన హైదరాబాదే కదా' – అని జవాబిస్తూ, ఈ కొశ్చన్ పరీక్షలో వస్తుందా, తాతా? – అనడిగాడు అమాయకంగా

–తిరుమల రామచంద్ర



బుక్‌స్టాల్‌లో అలంకరించిన "సినిమా రంజని" పత్రికల్ని
కొంటున్న పాఠకులు

## నాటిక, ఏకపాత్రాభినయ పోటీలు

## అవీ ఇవీ అన్నీ

శ్రీరామకృష్ణా స్మారక నాటక కళాపరిషత్ (రాయగడ) వారు 1987 ఫిబ్రవరి 28, మార్చి 1,2, 3 తేదీలలో అఖిల భారత స్థాయిలో తెలుగు నాటిక, ఏకపాత్రాభినయ పోటీలు ఏర్పాటు చేస్తున్నారు. నాటికలకి మొదటి బహుమతి రు. 1500/- శాశ్వత మరియు రోలింగ్ షీల్డులు, రెండవ బహుమతి రు. 1250/- శాశ్వత మరియు రోలింగ్ షీల్డులు ఉంటాయి. ఎన్నిక అయి ప్రదర్శింపబడిన ప్రతి నాటికకు రు. 500/- నుండి రు. 750/- వరకు పారితోషికం ఉంటుంది. ఏకపాత్రలకి మొదటి బహుమతి రు. 300/- మరియు శాశ్వత షీల్డు, రెండవ బహుమతి రు. 200/- మరియు శాశ్వత షీల్డు, మూడవ బహుమతి రు. 100/- మరియు శాశ్వత షీల్డు ఉంటాయి. వివరాలకి ప్రధానకార్యదర్శి, మహాత్మాగాంధి యూత్ అసోసియేషన్, జె. ఎస్. కో. కాలనీ, రాయగడ -2, కోరాపుట్ జిల్లా, ఒరిస్సా అన్న చిరునామాకి రాయాలి.

### మేకా ఇన్‌వెస్ట్‌మెంట్స్ లిమిటెడ్

మేకా ఇన్‌వెస్ట్‌మెంట్స్ (ప్రై) లిమిటెడ్ పది ప్రముఖ కంపెనీల షేర్లతో కూడుకున్న 'పోర్ట్‌ఫోలియో' ... 'పోలీషెర్ కంపెనీ'. ఆసియన్ పెయింట్స్, బజాజ్ ఆటో, కాల్గేట్, ఫుడ్ స్పెషాలిటీస్, స్పిక్, హింద్ కోకో, జి. ఎస్. ఎఫ్. సిరి లయన్స్, ఎల్ అండ్‌టి, టాటా స్టీల్ కంపెనీల వాటాలతో ఇది పోలీషెర్ కంపెనీ అయ్యింది. ఈ విధంగా వాటాదార్ల పెట్టుబడులకు ఉన్నతస్థాయి రక్షణ, అత్యంత ఆకర్షణీయమైన లాభాలు వచ్చేలా చూస్తుంది.

మేకావారి ఈ పోలీషెర్‌లో పెట్టుబడి పెట్టడం ద్వారా అభివృద్ధి చెందే ప్రముఖ కంపెనీల వాటాలను ఎంచుకోనడంలో చిన్న పెట్టుబడి దారునికి వీలవుతుంది. దానివల్ల మామూలు ఇబ్బందులను అధిగమించడమే గాకుండా వాటా పెట్టుబడులలో మంచి లాభాలు కూడా పొంద గల్గుతారు.

దీనితో బాటు పెట్టుబడి బహుళ ప్రయోజనాత్మక పొందే 'సిక్వెన్షియల్ ఫ్లో ఆఫ్ రిటర్న్స్' (ఎస్. ఎఫ్. ఆర్.) మేకా ఇన్వెస్ట్‌మెంట్స్ అమలు జరుపుతున్నది. పోలీషెర్‌గా ఈ కంపెనీ దీర్ఘకాలిక పెట్టుబడిపై 100 శాతం లాభాలు, ఎస్. ఎఫ్. ఆర్. ద్వారా స్వల్పకాలిక పద్ధతిపై 100 శాతంపైగా లాభాలు సాధిస్తుంది. ఒక ప్రైవేట్ కంపెనీగా 1986 జూన్‌తో అంతమైన మొదటి సంవత్సరం ఈ కంపెనీ 50 శాతం డివిడెండ్ ప్రకటించింది.

–(ఒ వి)




Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667

## ఉత్తరాలు......

(7 వ పేజీ తరువాయి)

### వ్యాసాలు

24–30 అక్టోబర్' 86 సంచికలో 'వాల్మీకి ఆశ్రమం', 'అండమానీయుల వింత ఆచారాలు' – ప్రత్యేకతలు. 'న్యూఢిల్లీ లేఖ'లో ఎన్నో నిజాలు తెలుసుకుంటున్నాము.

యన్. కనకారావు, పర్లాకిమిడి

★ ★ ★

నటి రాధిక ముఖచిత్రంతో వెలువడిన సంచికలో జమ్మి కోనేటిరావుగారి వ్యాసం "సూర్యుడి కొక సోదరుడున్నాడా?" విజ్ఞానదాయకంగా ఉంది ఆశ్చర్యాన్ని గొల్పింది.

రెడ్డి శివనాగేశ్వరరావు, మాచర్ల

★ ★ ★

24–10–86 సంచికలో ప్రచురింపబడిన "వాల్మీకి ఆశ్రమం" వ్యాసం ఎంతో బాగుంది. వ్యాసకర్త అభినందనీయులు. వాల్మీకి చరిత్ర, రామ శబ్ద మహత్యము, వాల్మీకి మహర్షి గొప్పతనమును గురించి బాగా వివరించారు. ఈ వ్యాసం చదివాక వాల్మీకి ఆశ్రమం తప్పనిసరిగా దర్శించవలసినదే అనిపిస్తుంది. అంతటి మహామహుడైన వాల్మీకి ఆశ్రమం దీనావస్థలో ఉండడం శోచనీయం.

ఎన్. రాజారెడ్డి, అనంతపురం

★ ★ ★

నటి "రాధిక" ముఖచిత్రంతో వెలువడిన మా ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది. "అండమానీయుల వింత ఆచారాలు – అలవాట్లు" గురించి మాకు తెలియని విషయాలు చక్కగా వివరించినారు.

చోడాబత్తుల శ్రీనివాసరావు, కుప్పనపూడి

### కథలు

24–30 అక్టోబర్ 86 యాక్షన్ క్వీన్ రాధిక ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వార్తపత్రికలో "మతిమరుపు" కథ చాల బావుంది.

సయ్యద్ జానిబాష, దూపాడు

★ ★ ★

'రాధిక' ముఖచిత్రంతో వెలువడిన 24–30 అక్టోబరు '86 సంచిక శోభాయమానంగా వుంది. ఈ వారం కథలలో "వెలుగు వెనుక చీకటి" కథ సందేశాత్మకంగా వుంది. నేటి యువత మంత్రతంత్రాల్ని, మూఢనమ్మకాల్ని పరిహసిస్తున్నారు. అందులో తప్పులేదు. కానీ... అలా వాటినే విమర్శించడంతో నే కాలాన్ని వృథా చేసే బదులు, సంఘటిత శక్తితో మారుమూల పల్లెల్లో చీకట్లో జీవితాన్ని వెళ్ళదీస్తున్న అనేక మంది బాధాపీడితుల్ని ఆదుకొంటే ఉభయత్రా మంచిది. ఈ విషయాల్ని రచయితలు ఆచారి పాత్ర ద్వారా చక్కగా వ్యక్తీకరించగలిగారు. వారికి అభినందనలు.

మోదేకుర్తి సత్యనారాయణ, అన్నవరం



# దూరదర్శనం

లత

శ్రీకాంత్ నాటిక చాలా అందంగా హృదయ స్పందనంగా సాగుతోంది. శ్రీకాంత్ నవల భారతీయ భాషలలోకి అన్నిటిలోనూ అనువదింపబడటం వలన ప్రేక్షకులకు ఎంతో నచ్చిందనే చెప్పాలి.

శ్రీకాంత్ శరత్‌చంద్ర ఛటర్జీ జీవితం అంటారు. దీనికనుగుణంగానే శ్రీకాంత్ పాత్ర ధరించిన ఫరూక్ షేక్ వృద్ధ శ్రీకాంతుడుగా నవల వ్రాస్తూ గతంలోకి వెడుతూ ఉంటాడు. రాజలక్ష్మి పాత్ర ధరించిన సుజాత టి. వి. ప్రేక్షకులకు కొత్తగాదు. 'ఖాన్‌దాన్'లో కనిపించింది. మాగి ప్రకటనలో తరచు మోడల్‌గా కనిపిస్తూ ఉంటుంది– ప్రత్యేకంగా రాజలక్ష్మిగా ఆమె హావభావాలు బాగున్నాయ్. శ్రీకాంత్ డబుల్ సక్సెస్ ప్రతివారూ విధిగా చూడాలి ప్రతి గురువారం



"శ్రీకాంత్"లో ఫరూక్‌షేక్, సుజాత

ఇక హైద్రాబాద్ నుంచి వారానికి మూడు తడవల తెలుగు ప్రసారాలు వస్తాయి– ముందుగా ఎనౌన్సర్ ధన్‌మని తెరమీదకు ఎగిరి అట్టే అందంగాలేని ముఖంతో చేపల పెంపకం (31-10-86), జానపద నృత్యంలాటి తైతక్కల్ని మనకు చూపిస్తాడు- ఒక్క మాటలో చెప్పాలంటే వీటికోసం టి. వి. దండగ అనిపిస్తుంది. జానపద నృత్యం అంటే కర్రల మీది నుంచి ఎగరడం కాబోలు– చివరిగా ఒక నాటిక అన్నాడు ఎనౌన్సరు. నాటిక పేరు చెప్పలేదు. అందులో విషయం పెద్దదొరగారూ మరో స్త్రీ గర్భివాములో క్రిష్ణ క్రిష్ణ అనటం ఇతివృత్తం. వాచికం ఆంగికం బాగుండకపోతే పీడా పోయింది "దరిద్రం పూర్వజన్మ కర్మ వలన వస్తుంది కనక చదువుకోవద్దు"ని అంటాడు తండ్రి. చివరకు కొడుకు చదువుతాడు. ఇది వయోజన విద్య గురించిన ప్రచారం. పరమ దౌర్భాగ్యంగా ఉంది.

అసలు తెలుగు ప్రోగ్రాముల్ని చూడటం పెద్ద పొరపాటు.

ఇందిరాగాంధి ద్వితీయ వర్ధంతి మీద డాక్యుమెంటరీ అద్భుతంగా ఉంది. ముఖ్యంగా శాంతినికేతన్‌లో ఆమె నాట్యభంగిమ, ఆమె వివాహం– కాశ్మీరులో హనీమూన్, ఆ తరువాత– తండ్రి ప్రధాన మంత్రి అవటం, గాంధీజీ హత్య– ఇందిర ప్రథమ పుత్రుడు రాజీవ్ జననం– సంజయ్ జననం– తండ్రికి చేదోడుగా ఉండటం– కాంగ్రెసు అధ్యక్షురాలుగా అవటం, తండ్రి మరణం, శాస్త్రి మంత్రి మండలిలో బ్రాడ్‌కాస్టింగ్ మినిస్టరుగా ఉండటం– శాస్త్రి మరణానంతరం ప్రధానమంత్రి అవటం– పాకిస్తాన్ విభజన బంగ్లాదేశ ప్రాదుర్భావం.

భారతరత్న అవటం అలా ఉంచి కారులో కూడా పని చేయటం- కొద్ది రోజులు జనతా ఉన్నా, ఇందిరాజీ చివరకి అధికారంలోకి రావటం– అనంతరం పారిశ్రామిక ప్రగతి రిగన్‌తో సమావేశం– అలీన దేశాల అధ్యక్షురాలుగా కాస్ట్రోనే ప్రపంచాన్ని ఉద్దేశించి ప్రసంగించడం– చివరకి భారతదేశానికి ఆమెను లేకుండా చేయటం, అంత్యక్రియలూ అన్ని ఉన్న డాక్యుమెంటరి.

సూర్యచంద్రులుండేదాకా ఇందిర జీవించే ఉంటుంది.

ఇది గొప్ప డాక్యుమెంటరి అని నిస్సంశయంగా చెప్పవచ్చును.

1-11-86 శనివారం మధ్యాహ్నం ఛార్లెస్ డికెన్స్ వ్రాసిన నికొలస్ నికొల్‌బీ అనే నవలను సీరియల్‌గా చూపిస్తున్నారు. నటి నటులు ఎవరో చూసేలోగా టైటిల్స్ అయిపోతున్నాయి. అయినా ఆనాటి ఇంగ్లీషువాళ్ళ దుస్తులూ, స్వారస్యమూ, ఉచ్చారణా బాగున్నాయి. నాడు పిల్లల ప్రైవేటు స్కూళ్ళలో జరిగిన అన్యాయాలే నేడు కూడా భారతదేశంలాంటి దేశంలో కూడా జరుగుతున్నాయి గనక ఈ నాటకం సార్వజనీనం సార్వకాలికం.

2-11-86 ఆదివారంనాడు కరెంటు పోవడంలో ప్రభుత్వం చేయిఉందా? ఇది నా అనుమానం. ఆ రోజు మధ్యాహ్నం అంతా కరెంటు వస్తూ పోతూ ఉంది. అందుకని సాయంత్రం వచ్చిన సినిమా జానెదొయార్ కాబోలు చెప్పుకోదగ్గ చిత్రం బాగున్నది.

# భారతి

సాహిత్యాభిమానులకు చక్కటి అవకాశం!

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా భారతి సంవత్సరం చందా రు. 48.

పోస్టు ద్వారా అయితే భారతి సంవత్సరం చందా రు. 51.

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు భారతి అందుతుంది!

★ అంటే రు. 11 దాకా ఆదా చేసుకో వచ్చునన్న మాట!

రు. 40 చందా మొత్తాన్ని "ఆంధ్రపత్రిక" (గాంధీనగర్, విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని, డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంప ప్రార్థన. ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించ వద్దని మనవి.

ఈ క్రింది కూపనుని నింపి డిమాండు డ్రాఫ్టుతో గాని, మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి.

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా భారతి సరఫరా చెయ్యబడు తుంది.

★ ఏజంటు లేకపోతే భారతి మీకు పోస్టులో అందుతుంది!

★ <u>చందా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!</u>




---

నేను "భారతి" మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను. చందా పైకము రు. 40 డి. డి./ ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

చందాదారుని సంతకం

